# శ్రీ వేదాంతకవి కాంతులు

## సన్మాన సంచిక

విజయదశమి, **26-10-55**


రచయిత:

జగజ్జనని, ఆంధ్రబెర్నార్డ్‌షా, మహాకవి, మహావక్తమనోహర్, వేదాంతకవి

Jagajjanani, Andhra Bernardsha, Mahakavi, Mahavakta Manohar, VEDANTAKAVI.

విజయదశమినాడు వేదాంతకవికీర్తి భువనమెక్కఁజేసె మూర్తిరాజు
సభికులెల్లనుఁ జయభేరిగొట్టిరి విజయవాడ దుర్గపేర్మికతన.



మహాకవి శ్రీవేదాంతకవి సన్మానసంఘ ఆహ్వాన సంఘాధ్యక్షులు.

ఆంధ్ర భోజ

శ్రీ చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాద మూర్తిరాజుగారు,

ఎం. ఎల్. ఏ.

పత్తేపురం. (పశ్చిమగోదావరిజిల్లా)

## వేదీలు విజయవాడలో, సన్మానసభా కార్యక్రమము.

ది 26-10-55 తేదీన, విజయవాడ, రామనగర్, ఈశ్వరమ హాల్‌లో మహాకవి శ్రీ వేదాంతకవిగారి సన్మానసభ ఉదయం. గం. 8 లకు ప్రారంభింపబడినది. ఈనాటి సభాధ్యక్షత వహించవలసిన ఆంధ్ర రివిన్యూశాఖామాత్యులు గౌ॥ శ్రీ॥ కల్లూరి చంద్రమౌళిగారు కారణాంతరములచే రాజాలనందున స్థానికజాతీయనాయకులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులు, ఎం. ఎల్. ఎ,గారు అధ్యక్షతవహించిరి. సభా ప్రారంభకులు, ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారి స్థానే తెనాలి పురపాలకాధ్యక్షులు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు సభను ప్రారంభించిరి. మున్ముందు జనాబ్ షేక్ చినపీర్ సాహెబు, షేక్ ఆదంసాహెబుగారల మంగళవాద్యములు, వేదాశీర్వచనములతో సభ ప్రారంభమాయెను.

ఆంధ్రభోజ బిరుదాంకితులైన శ్రీ సి. హెచ్. మూర్తిరాజు, ఎం. ఎల్. ఎ. గారు, అధ్యక్షులు సభాప్రారంభకులు ప్రసంగించిన తరువాత మహాకవి శ్రీవేదాంతకవిగారికి ఆనందజలపాతముతో తమ ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసమిచ్చి, పదియూరు నవరసులతో కనకాభిషేకము చేసి వెయ్యినూటపదారులు రొఖపూర్వకముగా కట్నమిచ్చి, అయిదుకావ్యములతో, సన్మానసంచికగా రచింపబడిన శ్రీ కవిగారి "శ్రీవేదాంతకవికాంతులు" అను ఉద్గ్రంథమును ముద్రించియిచ్చిన సంపుటము, పట్టుపీతాంబర, తాంబూలాదులతో పుష్పమాలాలంకృతుల చేసి గౌరవించిరి.

శ్రీయుతులు సాహిత్యాచార్య, జమ్మలమడక మాధవరాయశర్మ, కవిసార్వభౌమ, వేదాంతం లక్ష్మీకాంతకవి, సరస్వతీకంఠాభరణ, వేదుల సూర్యనారాయణశర్మ, ఉభయభాషాప్రవీణ, జాస్తి

వేంకటనరసయ్యగారలు, సినిమాయాక్టరు శ్రీఅక్కినేని నాగేశ్వరరావుగారికి "తెనుఁగుతల్లి" నాటకమును కృతియిచ్చిన శ్రీ వేదాంతకవిగారు, కృతి స్వీకరించిన శ్రీ నాగేశ్వరరావుగారలు ప్రసంగించిరి. సన్మానసభ జయప్రదమగుగాక యని వచ్చిన అభినందనాలు, ఆశీర్వచనాలు శ్రీ రాయని రాములుగారు చదివిరి. శ్రీ బి. ఏ. రాజుగారు చక్కని శైలిలో తామురచించిన "మనోహారాలు" అనే పద్యాలు శ్రావ్యముగా గానంచేసిరి.

మధ్యాహ్నం మూడుగంటలకు ఆంధ్రా బిస్మిల్లాఖాన్, జనాబ్ షేక్ ఆదంసాహెబుగారి నాదస్వరవాద్యములతో, బ్యాండువాయిద్యములతో, పురపౌరుల పుష్పవర్షములతో, మహాకవి శ్రీవేదాంతకవిగారికి జై యను నినాదహర్షములతో, బ్రహ్మానందముగా గజారోహణ మహోత్సవముతో మహాకవి శ్రీవేదాంతకవిగార్ని విజయవాడ రాజవీధులలో ఊరేగించిరి.

మరునాడు, సహకారశాఖామాత్యులు గౌ॥ శ్రీ॥ డి. సంజీవయ్యగారు కారణాంతములచే సభకు రాజాలనందున ఆంధ్రప్రభుత్వ అస్థానకవి, కవిసార్వభౌమ, శ్రీ శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రులవారి అధ్యక్షతను, మహాదాత శ్రీ చుండూరు వేంకటరెడ్డి, బి. ఏ. గారు సభాప్రారంభోపన్యాసముగావించిరి. పిదప అభినవతిక్కన, శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు, సరస్వతీకంఠాభరణ, శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు, నవయుగకవి చక్రవర్తి, శ్రీ జి. జాషువాగారు, వీరికుమారులు శ్రీ జి. వలరాజు మున్నగు కవిపండితులనేకులు ప్రసంగించిరి. తదుపరి కవిపండితులందరికి ఉచితరీతి శాలువలతో సన్మానములు జరిగెను.

# భు వ న వి జ య ం

గుంటూరు 5-11-55

కృష్ణదేవరాయలెక్కిన శకటమ్ము తేలిపోని యిరుసు తిమ్మరుసుర
పుచ్చిపోని యిరుసు తెచ్చిరికాబోలు మాధవుండు మార్గమహిమగనగ.
నాయన! మీరలెన్ని రతనమ్ములుపూచి సహస్రభాగ్య దీ
ర్ఘాయువు వోసుకొన్నను మహాసుకుమార సుఖైక మాధురీ
ప్రాయముతోడ మా కవనరాణికి కున్కనుబట్టనీని యీ
రాయలు వెల్గువచ్చునె? చిరాయువుతేలుము! కృష్ణరాయలా!

నేను రామకృష్ణుని పాత్రవేసి, పాండవపక్షమున నిల్చి చర్చలో ఇచ్చిన సమాధానము.

గృహాకల్లోలము లేచినప్పుడు జగతీకర్త్రి క్షమారామ ధూ
ర్వహులై సోదరులెల్ల దోర్విభవముల్ రాణించు నట్లేకమై
గహానంబెక్కి బకాసుర ప్రతతి డొక్కల్ చీల్చి శ్రీకృష్ణ వా
గ్లహారిం దేల్చిరి పాండవేయులు రఘుక్ష్మాపాలురన్ మించుచున్.

కొండ గుండెలుకర్గు చుంచెడి కడగండ్లు
పూలదండలైన మేలియశము
ఎగసి గుండిగలు గుండిగలు లేపెడి తిండి
పడకున్న చలముగొల్వడని బలము
మన్నుమిన్నేకమై కన్నుగప్పెడి విల్లు
వేయగలిగినట్టి వీరగుణము
చినుకు చినుకుమధ్య మిచుకు మినుకుమంచు
గుజ్జుమెక్కి వెలుంగు గొప్పతనము

అలకాపరిచ్చిన సలహాల ముద్దు అలకాపరి చుట్టరికాలు పూచి
దిక్కు లెక్కిదాశరధేయు లెక్కకుండనేడు కౌంతేయులున్నారు వాడవాడ!

వేదాంతకవి;
కవితాసంస్థాన్, విజయవాడ.
ది5 - 11 - 55

## VEDANTAKAVI AS PLAY WRITER.

### RAJAKAVI.

The great ness of a writer is really felt in his producing work of art. The measuring rod, of one's artistic greatness always the play which he produces Bernard Show once clared that a drama is a distorted mirror to nature, and our ndhra Bernard Shaw "Vedanta Kavi" bears testimony to it.

Vedanta Kavi produced a number of original Telugu amas, and chief among them are (1) Telugu Talli (2) Viswa-varajyam (3) Challo Hyderabad (4) Kasta Kalam (5) Akali anta and so many others.

All his dramas are characterised by a deep love for our elugu Desa and an exalted view of a poet, demanding self spect from ever corner. All his themes are mystic and bstract in nature Of all h s dramas Viswa Swarajyam, Kasta alam and Akali Manta stand on the heights and rival any ther best drama in World Literature.

Taken together the works of art from all the provincial inguages in India, to-day, we do not come across a play-riter like Vedanta Kavi, a short story writer like Padma Raju nd a song writer like Krishna Sastry or Srirangam Srinivasa Rao. If some of the works of art, Produced by any one of the bove are translated into English and released to the world, I m sure some of them are capable to earn a Noble Prize.

I hope and ardently wish, that our Vedanta Kavi will be given a proper place and due encouragement by his country-men and the Government, so that he may be able to produce more in future.

"RAJA KAVI"

HON'- SRI KALA VENKATA RAO,
Minister for Planning and Industries.

KURNOOL
24th Oct, '55.

*Dear friend,*

Thank you for the invitation for the reception to Vedanta Kavi. I regret that I will be unable to come. I wish the function all success:

Yours sincerely,
K. VENKATA RAO.

Wishing the function every success.

ANNAVARAPU KAMESWARA RAO,
MunicipalOunciller.

Regret inability to attend function stop am joining others in paying tributes to the poet. NARLA.

శ్రీ పి. తిమ్మారెడ్డిగారు, ఎం. ఎల్. ఎ. కర్నూలు.

మిత్రులు శ్రీ మూర్తిరాజుగారికి,

మీ ప్రయత్నములన్నియు పవిత్రములయినవి.

పూర్వపు "రాజుల" వలె పోషణయోగ్యమైన ప్రతిపద్యమాన్ని, వ్యక్తిని గౌరవించి, పోషించి పెంచుటలో మా మూర్తిరాజుగారిది ముందంజ అని చెప్పుటకు నాకెప్పుడూ సంతోషము. రాష్ట్రములో సాంఘికోద్ధరణ కార్యక్రమములో మీ ప్రయత్నాలన్నీ సఫలము కాగలవని నావిశ్వాసము.

శ్రీ వేదాంతకవిగారి సన్మాన సందర్భమున పంపిన ఆహ్వానము చేరినది. సాహిత్యాభిమానులందరి ఆశీస్సులు, అభిమానము వారికున్నది.

భవదీయుడు,

పి. తిమ్మారెడ్డి.

## కవిహంసా!

వ్యాకరణవారాన్నిధి శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు

భవదీయాతుర చక్షురింద్రియమహా
ప్రాగల్భ్య దీవ్యచ్ఛటన్
గవిహంసా! గణనీయ నవ్యకవితా
కావ్యప్రపంచంబునన్
నవనీతాంచిత శబ్దతత్త్వవిదులన్
సత్కావ్యులన్ మెచ్చి దుష్
కవిసామ్రాట్టులఁ గాలఁదన్నితివి నీ
సాహిత్య సౌహిత్యముల్
వివిధమ్ముల్ శతధా శుభంకరములౌ
వేదాంత కవ్యగ్రణీ!

వడ్లమూడి గోపాలకృష్ణయ్య

విజయవాడ

8-11-1955

NEW DELHI D/ 2—11—55

ఏనుగంబారి నధిష్ఠించి
కన్నుగల్గి నాదములు
పలికించిన మహాకవి
శ్రీ వేదాంతకవి సమ్ముఖమునకు
మహారాజశ్రీ ఆహ్లాదాభి
వందనాలు. మహారాజశ్రీ.

ఆర్యా,

వేదాంతకవి సన్మానసభలకు మీరు పంపించిన ఆహ్వానాది కము చేరినది. సంతోషము. సభకు నేను వచ్చుటకు అవకాశము లేదు.

శ్రీ వేదాంతకవికి ఈ సన్మానోత్సవము ఉదాత్తంచన చేయుటకు ఉత్సాహమిచ్చుగాక! శ్రీ శివానుగ్రహములవలనను, శ్రీ జనని కృపాకటాక్షవీక్షణములవలనను వేదాంతకవికి సమస్త సన్మాంగళాని భవన్తు.

ఇతి శమ్ శ్రీ శివశంకరస్వామి.

ఆయ్యా,

శ్రీ వేదాంతకవిగారిని గౌరవించడానికి మీరు కావించే మహోత్సవం జేగీయమానంగా జరగాలని కోరుతున్నాను. మంత్రులూ పండితులూ, కవులూ, మీవంటి రసజ్ఞులు, – ఇందరు పూనుకొని శ్రీ వేదాంతకవి పూజకావిస్తున్నారు; దానికి వారు ఎంతయినా అర్హులు. వారికి నా అభినందనాలు అందజేయించండి.

కష్టవార్త ఏదో హఠాత్తుగా వినినందువల్ల, నేను ఉత్సవానికి రాలేకపోతున్నానని ఎంతయినా ఖేదపడుతున్నాను.

Simla House,
Habidullah Road,
Thyagarayanagar,
MADRAS.

చిత్తగించవలెను.
దే. వేం. కృష్ణశాస్త్రి,
25-10-55



**26_10_55** సభాధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు



**27_10-55**సభాధ్యక్షులు: శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు



సభాప్రారంభకులు: శ్రీ ఆవులగోపాలకృష్ణమూర్తిగారు



సభాప్రారంభకులు: శ్రీచుండూరి వేంకటరెడ్డిగారు

## శ్రీ ర స్త్వా త్

నవీనవాఙ్మయ నన్నయభట్టు,

## శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు, సికింద్రాబాద్.

అక్షయకామనీయక మయంబయి ఇష్టపదార్థమై అశో
కక్షత కోమలంబయిన కల్పిదుప్రశ్రుతిసంది తత్కలా
వేక్షణ జాగరూకులయి విశ్వసుమంగలసూక్తిసంహితా
దక్షిణులైన సత్కవుల ధారణకున్ జయమాను గావుతన్.

వేదాంతకవివరేణ్య కలాదీపావళికి మంగళంబగు కృష్ణా
గోదావరీ పయస్యాస్వాదనరతి కవులు స్నేహపాత్రలు నింపన్.

బంతులవంక తీర్తువు సువర్ణలతన్ చిగురాకు పచ్చినం
టింతువు పావురాల పలిటీలను నర్తకి విభ్రమంబు ల
ర్పింతువు మాటలోన మురిపెంబు స్వరంబున కోఅడంబు వే
దాంతికవీ! భవత్కవిత కంజలినిత్తు మహాంధ్రభారవీ!
అతికఠినమైనపగడ మమితకాంతంబాయె కాంతమృదులాధరమై
నుతియింతురె కవులు? వంచితులయినంగాక కవివశీకరణోక్తిన్.
అతికుశలావతార్ణకమహర్షి సరస్వతి- కాళిదాసభా
రతి బహునర్మనాట్యరతరాగిణి - పావని ధీరవైదిక
శ్రుతిభవభూతివాణి-మృదుచుంబన సుందరి దండినూక్తి ఏ
కృతిమదనంత గీర్వాణిలికన్ తలవంచి నమస్కరింతుమో.

సికింద్రాబాదు
44 స్నేహలానగరం
మన్మథ మహానవమి

రాయప్రోలు సుబ్బారావు

## ఆ శీ స్సు

కవయిత్రి. శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు, విజయవాడ.

పురహరుని శిక్కసేయడు ధర వేదాంతకవి యెంతో ధన్యుడు తనవే
సరసకవిత్వపు ధోరణి నిరంకుశాః కవయయనుట నిజమొనరించెన్.

## కానుక

నవయుగ కవిచక్రవర్తి జి. జాషువాగారు, గుంటూరు - 2.

గంగ్రాజాచేత భిక్షాపాత్రబట్టించు కవిరాక్షసుని నోటి కఱకుదనము
హాస్యవాక్చతుర విద్యామండితుండైన తెనాలిరామలింగన్న బిరుసు
అవసానదశయందు నాత్మగౌరవము గోల్పడనట్టి కవిసార్వభౌముని దివి
తిట్టిజోహారకోట్లు చెట్టించుకొనిచన్న అడిదము సూరన్న గడుసుదనము
అంతరించిపోయెనని బిట్టుదురపిల్లు తెలుగువాణి గుండెదిగులు వాయ
విజయవాడనగరి వేదాంతకవినోట నూడిపడియె నతిశయోక్తి గాదు.

పంతముబట్టి నేటికవిపండితకోటి చరించుచున్న ప్రాం
ఋంతల సంచరించక, యపూర్వసుధామయమార్గగామివై
దంతిరథాధిరోహసముదగ్రయశస్సు గడించినావు, వే
దాంతకవీ! భవత్కవనధాటికి నూటపదారు కానుకల్.

జాషువ.

## కవిరత్న కానుక

శ్రీ పామర్తి వేంకటరమణారావుగారు, నన్నయపీఠము. తణుకు.

శ్రీవాణీ గిరిజామనోహరుల సంసేవించు వాణీశ్వరా!
శ్రీవాణీ గిరిజాశ్చిరాయ” యనుచున్ శ్రీకారమున్ దిద్దు సం
శ్రీవాల్లభ్యయశస్వి భారతకథా సమంతినీవల్లభా
శ్రీవేదాంతకవీంద్రు వాఙ్మయజగత్క్షేమంకరున్ బ్రోవుమీ!

అహో విచక్షణా చక్షువీ యలఘు పండితకవి - కవికులాలంకార! త్యాగమూర్తి
వెలయు స్వాతంత్ర్యభారత వీరుడితడు జట్టి యాంధ్రభాషారస చక్రవర్తి.
అక్షరతపస్వి నిశితవిచక్షణాత్మకుండు పర్జన్యగర్జన కోవిదుండు
తెలుగుతల్లికి నటరాజా తెగడువాడు వట్టిభ్రాజాకుకవులై భజనసేయు
వందిమాగధకవుల నిర్భయముతోడ విశ్వవిజ్ఞాని సూక్తికిఁ జేరమాళి
కాళిదాసు - స్థితప్రజ్ఞగరిమవాడు శ్రీమహాకాళిమూర్తిమ శ్రీవిహారి
తాను సన్మానములు గాంచి తానెకవుల రత్నములఁ జేరి తనదు దర్బారునందు
దీవెనలతోడ భూరిసంభావనలిడు రాజ గోపాలమిత్ర సమ్రాట్టు రసకి
శోరి! పట్టాభిషేకమ్ము సుందరాంగి శారదాదేవి వర్ణింప సరసనిలచె
వత్తలిపంచాస్యమయిసభాప్రాంగణమున విజయవాడను సన్మాన విరులజల్లి



తెనుగుతల్లి నాటకం కృతి స్వీకారం.



స న్మా న ం.



శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, (సినిమాయాక్టర్

తరుణకవిరత్నకానుకల్ ప్రాంజలులను ప్రేమగైకొని దుర్గదీవించునట్లు
అమ్మ ! సెలవొసంగుముతల్లి - యిమ్మశుభము - శ్రీజగజ్జననీ కవిశేఖరమణి
భక్తనీరాజనమ్ముల ప్రస్తుతులను వాఙ్మయారామకోకిలవాణివగుచు
మాన్యతలగాంచుచు కవిసామ్రాట్టువగుచు.

శ్రీవాల్మీకి పదారవిందములకున్ చిత్తమ్ము హత్తించుచున్
నీవాగ్మాధురివాణి హస్తమున మాణిక్యాలవీణాస్వనాల్
గావింపన్ రఘువీరుగాథలను పల్కన్నేర్తు కవ్యగ్రణీ
శ్రీ వేదాంతకవీశ! నీకు జయమా శ్రీరామునాశిస్సులన్.

తిరుపతి వేంకటేశ్వరులతీరున శిష్యుడు పట్టభద్రుడై
వరలుచు నేను నెక్క మనవాడను శ్రీవిజయాభిరాముడై
వరకవిసార్వభౌమబుధవర్గము పాలితపాలకోత్తముల్
కరములబట్టి రాశివనికాయపు సౌరభపుష్పమాలికల్
గళమునవైచి రాశివనిగారపు సౌరభపుష్పవల్లరుల్
శిరమునజల్లి రాశిప్రసిద్ధపరిమళగంధరాజముల్.
నేటి జయాభిషేకములం నీకగుపెద్దగి గండపెండెరం
చేటికి పెక్కమాటలు మహీసురభాసురవ్యాసభారతీ
ధాటికి నీవు రాయలవు దాల్చగ పెద్దనవంటివాడవున్
సాటికనంగరామ కవి శారదనోచిన నోములిన్నియున్,

కవిరత్నాయని సత్కరించితిది భాగ్యాశిష్యభారావముల్
తవణింపన్ భవదీయ నిండుమనమున్ దప్పంబుదర్పంబుకున్
కవులన్మెచ్చెడువారి నొల్లవుగదా క్ష్మాపాల నీరాజ్యమున్
భువిలోజొల్చుత రామరాజ్యమగుచున్ పుంభావవాణీ (కవీ) ద్వయా ! (గురూ)

శ్రీమద్వేంకటనాయకుండ భవసంసేవ్యుండు శ్రీరాముడున్
శ్రీమాతంగకుమారి మంజులకళా సీమమ్ము శ్రీకాళికా
భామారత్నము - శేషభూషణుడు శశ్వత్కీర్తి సత్కీర్తుడా
శ్రీమావేదవిశుద్ధభారతికి నాశీర్వాదముల్ గూర్చుతన్.

చీకటిపువ్వులో నిరులనుగురియించు ప్రౌఢకవీంద్రుడీ రసవిహారి
కోకిలస్వరములో కలికించివెన్నెల పిల్లకు తొలకరితల్లి - అమ్మ
సంగీతరాణికి సాహిత్యవరునకు ముమ్మూర్తి దాంపత్యము నిడు తండ్రి
పదునారుపద్యాల పదహారుకళలను శిల్పానబూయించు శిల్పిభవుడు
తనదు పట్టాభిషేకాన దనరజేసె వరుని గోపాలకృష్ణు భావాలబరిణ
నేమిచూచుకు వాకొన నేమొకాని విజయవాడను జయపీఠవెలసెనెల్ల.

తెనుకుపురాన నన్నయసుధామధురోక్తి సమీక్షసేయుచో
మణులను సేర్చిగూర్చితివి మంజులవాఙ్మయరత్నహారముల్
గుణమణి నన్నపార్యునకు గూర్చెదు పండితభక్తకవీంద్రమండలుల్
మణిగణ హారతుల్ విరులమాలలు గూర్చరి సేదు సత్కవీ! (శ్రీమహాకవీ!)

ఇట్లు,

పామర్తి వేంకటరమణారావు

## ప్ర శం సా ప ద్య ర త్న ము లు

### శ్రీ మందరపు సత్యాచార్యకవిగారు, విజయవాడ.

శ్రీకాళీ కరుణా కటాక్ష విభవ శ్రీమూర్తివంతంబుగా
జేకొల్గిన భక్తవర్య, భువన శ్రేయంబె కావ్యంబుగా
వాకొల్గిన సత్కవీంద్ర, రససంభావైక భాషాకళా
రాకాచంద్ర, రవీంద్ర సత్కవియటుల్ రాణించు విశ్వంబునన్.

సరసోదార గభీర భావకవితా సామ్రాజ్య సామ్రాట్టువై
వరణీయంబుల పెక్కు సత్కృతుల నిర్వక్రప్రౌఢి సృష్టించి, సుం
దరమందారముగా ప్రజావళికి మోదంబున్ ప్రసాదించి, స
ద్బిరుదుల్ గాంచితి వాంధ్రవీరకవివై: వేదాంతకవ్యగ్రణీ!

రమణీయభావ సద్రస పరిపూర్ణ విఖ్యాతంబులౌ పద్యకావ్య వితతి
అనుభూత సంఘటనాత్మకంబులు, కరుణా సన్నివేశముల్ నాటకములు
వ్యవహార భాషాప్రవర్ధిత సంఘ సంస్కరణాయుతములు వచనరచనలు
సారస్వత కవిత్వసార నిర్వచన సంభరితంబులగు సద్విమర్శనములు
శ్రోత్రమాటలు, పాటలు, కూర్పు సేర్పు నిత్య నూతనమై యొప్పు నీదుకృతులు
తెల్గుభాషామతల్లి సంతృప్తినొంద; కరమొనర్చితి వేదాంతకవి వసంత.

నవరసభరితంబగు నీ కవితాఝరి, నింగిదిగిన గంగానదియై
ప్రవహించె నాంధ్రభువి, సంస్తవనీయంబై తనర్చి సత్కవిచంద్రా!

సంస్కృతాంధ్రాగ్ల భాషా విచక్షణుడును సచివవర్యుండగు చంద్రమౌళి
సరససాహిత్య రసాలోపవనకళా మదనుడు సంజీవ మంత్రివరుడు
సముదారచరితుండు సత్కార్యధుర్యుండు కీర్తివిస్తారుండు మూర్తిరాజు
కవికులాలంకార ఘన బిరుదాంకుడు లక్ష్మయ్యనాయుడు రమ్యయశుడు
భవదనంత కళావిభవంబు సెన్ని స్థానిక ప్రముఖులెల్లరు జరుపు సభను
నిర్వహింపగబూని రపూర్వశోభ సద్యశః సాంద్ర వేదాంత సత్కవీంద్ర.

## పంచరత్నములు

పల్నాటిసోదరకవులలో నొకరగు

బ్రహ్మశ్రీ కన్నెకంటి చినలింగాచార్యులుగారు,

శ్రీ వాగ్దేవి నిరతమున్ మా వేదాంతాఖ్యకవిని మనసార "చిరం
జీవ, సుఖీభవ" యనుచున్ దీవించుతపసపు పసిడితీవెలచేతన్.

దయయును, సత్యమున్, శుచియు శాంతిగలాడవు సర్వసజ్జనా
శ్రయుడవు, నీవు చక్కగను సంస్కృతకావ్యచయంబులన్ సమ
న్వయ మొనరింపజాలు ప్రతిభన్ గడియించితి, వెల్లచోట్ల ని
ర్భయత నుపన్యసింపగల పండితమూర్తివి మిత్రరత్నమా.

సంతతమున్, దేవిన్ బూజింతువు, కడుకమ్మగా రచింతువు "కవనం
బంతయు, నొకటే" యను వేదాంతివి, వేదాంతకవి! చిదసుధవి! సుకవీ!

తత్త్వజ్ఞానసంయుత మానసుండవై భూసురాన్వయమున బుట్టినావు
విద్వాంసుడగు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి చెంత విద్యల నభ్యసించినావు
కవనామృతమునకు, గల్లోలినులనంగ మించు కావ్యముల రచించినావు
భారతదేశ సేవాధర్మమునుబూని, చరసాలయందు గష్టపడినావు
దేశదేశంబులెల్లను దిరిగినావు స్వీయపాండిత్యమును ప్రదర్శించినావు
తెలుగుతల్లికి తండ్రివై యలరినావు ఘటితసాహిత్య! వేదాంతకవివరేణ్య!
నీకున్ నీ సంతతికిన్ నీ కాంతారత్నమునకు, నీ బంధుజనా
నీకమునకు దీర్ఘాయువు చేకూరిచి బ్రోచుగాత, శ్రీకంఠుడిలన్.

కన్నెకంటి చినలింగాచార్యులు

## జయాభివందనపద్యహారము

శ్రీ తోటరామారావుగారు, విశాఖ.

శ్రీజయవల్లి పాదసరసీరుహ సేవసమాచరించి స
త్పూజిత భాగ్యసంచయము పాత్రవసలార గడించి శారదాం
బాజయ ఘంటికానినద ఝంకృతి మ్రోయగజేసియుంట న
వ్యాజమహత్త్వరంబగు జయమ్ము లభించెను నేడు మిత్రమా!

జిలిబిలి పల్కులన్ రసము జిప్పిలజేయు కవిత్వచాతురిన్
పలుకువెలందిసొంపు ప్రతిభన్ భువిఁజాటెడు కావ్యముల్ భళీ
వెలయగ జేయుటన్ ప్రజలు వేడుకతో జయపత్రమీయగా
వలచిరి పక్కివీశ్వర! ముదంబిదియొంతయు నాకు జూడగన్.

జ్ఞానధురీణ ! భారతిని సంతసపెట్టిన యోగ్యభాగ్య స
న్మానమిదంచు నమ్మెదను నర్మిలి నీ కవితావధూటి స
న్మానయశమ్ము తెల్గురచనావళినిచ్చి నిరంతరమ్ము లో
కానఁ గవీశ్వరుల్ మరియు గౌతుకహేతువుగా వసించెడిన్.

ఆంధ్రగౌతమీ వారి యానందసుధలు కవులుఁ బ్రోచెను మన గొప్పగడ్డయందు;
ఆంధ్రగౌతమీ వారి యానందసుధల పోల్కి గవులఁ బ్రోచెడు నీదు పుణ్యకవిత.

దీనార టంకాల తీర్థమాడినయట్టి శ్రీనాథువాణి వరించెనిన్ను
సంస్కృతాంధ్రములందు జవులూరవలపించు పెద్దన్నవాణి నీ యొద్దజేర
ప్రియమార విహరించు పినవీరభద్రుని శృంగారవాణి నీ చెంతజేర
జిలుగు వొయ్యారమున్ జిగురొత్తనటియించు సూరన్నవాణి నిన్జేరియుండె

ననగ గావ్యముల్ రచియించినావునీవు, "ఆంధ్రబెర్నార్డుషా" యంచు నాంధ్రులెల్ల
నిన్ను గొనియాడ ఘనతగణించినావు, శుభము "వేంకటకవిచంద్ర" శుభమునీకు.

విజయవాడ
తే॥ 26-10-1955

తోట రామారావు
వి శా ఖ.

# అభినందన పద్యరత్నములు

## అభినవత్యాగరాజు, నిట్టాల సూర్యనారాయణగారు, పెనుగొండ.

నాడు శ్రీకృష్ణరాయ భూనాయకుండు పెద్దనార్యుని గజముపై వెలయజేసి
విజయనగర పురంబున విశ్రుతముగ జేసినంతటి గౌరవ శ్రీలు నేడు
అవని శ్రీమూర్తిరాజు వేదాంతకవికి విజయవాడ పురంబున వెలయునట్లు
అట్టి సన్మానమొనరించి జయముగాంచె శ్రీనివాసుండు మిమ్ము రక్షించుగాత.

విజ్ఞాన గుణనిధి విష్ణు సంభూతుండు వ్యాసుండు వ్రాసిన భారతంబు,
పరమధర్మ నిధాన పంచమ వేదమై పరమ ప్రమాణమే భారతంబు
మానవకర్తవ్య మార్గబోధకమను ప్రఖ్యాతి గన్నట్టి భారతంబు
భారతజాతీయ భవ్యతపః ఫలమైరహినొప్పు శ్రీ భారతంబు

ఆంధ్రలోకంబు వేనోళ్ల నభినుతింప శ్రవణ శుభగంబు మధురిమా సరసరీతి
రచన పచరించి ధాత్రిని ప్రతిభగాంచిన ఘనత రాష్ట్రీయ సంస్థాన కవివరేణ్య
కృష్ణ కవిరాజ నీకిదె కేలుమోడ్తు.

పలికితివి భారతమ్మును పలికితివి రామకథ సెబాసని మెచ్చన్
పలికితి భాగవతమును పలుపలుకు లకేలనీవు భారతివి కవీ.

సంస్కృతాంధ్రములందు సజ్జనుల్ కొనియాడు పాండితీ గరిమచే వరలినావు
వేదవేదాంగాది వేత్తవై విజ్ఞాన మూర్తివై విఖ్యాతి బొందినావు
చాలగా తెలుగులో సద్గ్రంథముల వ్రాసి భాషాభిమానివై వరలినావు
పలుకు పలుకున మంచి భావముల్ జనియింప చాతుర్యమును జూప జాలినావు
అట్టి సుగుణాలవాల విద్యావిశాల కేశవార్చనశీల సత్కీర్తిలోల
ఆంధ్రబెర్నార్డుషా యను ఖ్యాతివడసి అలరు శ్రీ జగజ్జనని వేదాంత సుకవి

ఇట్లు
తంగేడిపూలు బంగారుబాబు

## పంచరత్నములు

### భక్తకవయిత్రి, శ్రీమతి అనుపోజు చంద్రకాంతమ్మగారు

శ్రీలుజెంగిన నీదివ్య చిత్రకవిత ప్రభలు గొల్పగ నే వింటి భవ్యచరిత
ప్రవిమలంబైన వేదాంతపరనములరు నీ యశఃకాంతికిదే నేడు నియతితోడ
వినతిజేసెదనయ్యా నా వేడుకలర వేదవేదాంతకవి చంద్రవిమలసాంద్ర.
దయయు సత్యంబునెప్పుడు తాండవింప ప్రియముతోడను నెల్లర ప్రీతిగనుచు
కవులగాయకు లనుజాలగతిదలచిన భవ్యమూర్తివి వేదాంతభాస్కరుడవు
కాశీమహాదేవి కళ్యాణసుతుడవై వెలసినావయ్య సద్విబుధులందు
ఆంధ్రతనయనీదు అమలమౌ రచనల కవితామతల్లిని ఘనులుబొగడ
నల్పజ్ఞురాలను యనఘనీచరితంబు ఆనందభరితనై యలరినేడు
పండితాగ్రేణ్యులు భారత వీక్యులు నిండినసభలోన నిలచినేను
శక్తికొలదిగ నీయశశ్చంద్రికలను విన్నవించితి నాచిన్న విరచితమున
విశ్వకళ్యాణ కవిత సర్వేశ్వరునిగ నెనరు నిస్సన్న చేసెంత నిర్మలాత్మ
పండితానంత వేదాంత భాగ్యవంత.
ఆంధ్రనాయక ఆనందమలర మీదు కావ్యకన్యకు కళ్యాణఘనతనిచ్చె
మూర్తిరాజు శ్రీమూర్తియైముత్తియునట్లు ఆంధ్రధీరులు కాశీశ్వరాహ్వయులును
కనకవర్షంబు మిముముంచుగణ్యవరులు మూర్తిరాజు శ్రీ విష్ణుయై ముదముగాంచె.
ఇంకనెందరో ఘనవరులెలమి మిమ్ము గజము నారోహితునిజేసి ఘనతగాంచి
నిరుపమానంద నిలయులై నెగడినారు విజయవాడను విజయులై వెలయుమీకు
వీరికందరి కానంద విజయములను గలుగజేసిన కనకదుర్గాంబజనని
నెల్లవేళల సేవింతు నుల్లమలర.

శ్రీమతి అనుపోజు చంద్రకాంతమ్మ,
భక్తకవయిత్రి.

# ప్రశంసాపద్యములు

ఉభయభాషాప్రవీణ, శ్రీ ప్రభల వేంకటసుబ్బయ్యశాస్త్రిగారు.

విజయవాడ.

పండితబృందముల్ బహుళభావనచేసి నుతించునట్టి మీ
దండికవిత్వసంపద కుదారులు మెచ్చి బహూకరింపఁగా
పండుగరోజులందు బహుభంగుల నీబెజవాడయందునన్
మెండుగమోదమందితిమి, మేదిని గాంచితికీర్తి నెంతయున్.
లోకమునం గవీశ్వరులు, లోకహితార్థము గ్రంథముల్ సదా
ప్రాకటమాదినంబుగను వ్రాసి సుశాసకులౌదు రెంతయున్
లోకప్రశస్తకావ్యములు లోనుగవ్రాసినవారి ధీయుతుల్
వీఁకవహించి మీరచన వీఁకగ మేము నుతింతు మెప్పుడున్.
మీకనకాభిషేకమును మీరలు దంతిని నెక్కియుండుటన్
మాకునుజూడఁగా ముదము మానసమందునఁగల్గె తెన్నుగాఁ
మాకును మోదమయ్యెఁ గవిమండలభూషణకోకవీశ్వరా
కైకొను మాప్రశంసలను గౌరవమించుక యుంచిమాయెడన్.
ఎఱిగియున్నవాఁడ నింతకుఁబూర్వంబు కవితనీవు చెప్పఁగలుగుదంచు
గాని యింతలోనఁగననెక్కుదువటంచు లేశమైనఁదలపలేదు మేము.
పురవరంబగు బెజవాడపురమునందు పౌరులెల్లరు నినుఁగాంచిధళిగయనఁగ
నేనుఁగెక్కియూరేగితివీవుచిన్న ధన్యుఁడవయితిగాదె వేదాంతసుకవి.

# సాటియెవ్వరు?

శ్రీ నూకరాజుగారు, విజవాడ.

అఖండ కవితాసాగరుండై - అద్వితీయవిమర్శకుండై
'ఆంధ్ర బెర్నార్డుషా' యని - అసమాన బిరుదమునొందినాడు
సాటియెవ్వరు? పోటియెవ్వరు? - మేటియగు వేదాంతకవికి?
తెలుగుతల్లి నోముపంటగ - వెలసినాడు విజయవాడలో
తెలుగుసాహిత్యమునతడు - తీర్చిదిద్దగ నిలిచినాడు
సాటియెవ్వరు? పోటియెవ్వరు? - మేటియగు వేదాంతకవికి?
నవరసమ్ములొలుకుచుండెడు - నాటకాలను వ్రాసినాడు
ఆనందరత్నాకరములోన - ఆంధ్రజనులముంచెత్తినాడు.

పాటియెవ్వరు? పోటియెవ్వరు?-మేటియగు వేదాంతకవికి?
కమ్మకమ్మని కావ్యఫలములు విర-జిమ్మినాడు తెనుఁగుభువిపై
తెలుగువారికి కల్పతరువై-తీర్చినాడు కవితకరువు .
పాటియెవ్వరు? పోటియెవ్వరు?-మేటియగు వేదాంతకవికి?
విజయవాడరాజధానిగ-విశాలాంధ్ర కవితరాజ్యము
నిశితవిమర్శఖడ్గధారియై-ఏలునిరంకుశకవిచక్రవర్తి
పాటియెవ్వరు? పోటియెవ్వరు? -మేటియగు వేదాంతకవికి?
తెలుగుసాహితిప్రపంచానికి-వెలుగునొసగే కవిద్యుమణీ!
వృద్ధకవులకవితదోషముల్-దిద్దబూనిన ధీవిశాలి ...
పాటియెవ్వరు? పోటియెవ్వరు?-మేటియగు వేదాంతకవికి ?

నూ క రా జు

## మ ధు ర మా లి క

శ్రీ జి. వలరాజుగారు. గుంటూరు.

స్వాగతమ్మిదె! సుకవిశేఖరా! నీ కిదే-గేయమాలిక-ఓ! కవీ-
తెనుఁగువీధుల దీర్చి వెలిగె-తెనుఁగువారలు తరలివచ్చె
తెనుఁగువనితలు హారతిచ్చె-చవుగల మా తెనుఁగుకవికి-
వసుధనిండిన నీదు కవనపు-రుచిని మరగిన మాదుహృదయం
మరచిపోవదు నీదు పాండితి-హాసాదులటుగో! ఓ! కవీ-
బిరుదులు నీ వదగినచో-పొరలివచ్చు పాదయుగళి
కోరి నీవు కలముబూన-తరలివచ్చు మధుకావ్యం-
రాటుదేలిన నేటి నటకుల-మీటుచుండిన మేటికావ్యం
కులికి పలికే "తెనుఁగుతల్లి"మా-జీవితాంతపు కల్పవల్లి-
మధుర మంజుల పద్యబాటలో-సుధలుచిందెడి గద్య వాటిలో
వజ్జలేడిక నీదు ప్రౌఢికి-ఉజ్జిలేడిల యాంధ్రభూమిలో
కమ్మని నీ మధుకవనం-ఇమ్మహిలో వ్రాయలేరు
ఇంపగు యీనాటిసభలో-గుమ్మయ్యెను తెల్గుదనము-
అంతులేని రసికులలో-వేదాంతకవికిసన్మానం
పండిత, కవి, గాయకులలో-నిండిపోయె యీ రంగం
పండిపోయె మాహృదయం-

రచన: "వలరాజు"
(జి. జాషువాగారి కుమారులు)
గుంటూరు

# మహాకవి శ్రీ వేదాంతకవిగారి సన్మాన సంఘం

అధ్యక్షులు :

శ్రీ చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాద మూర్తిరాజు

ఎం. ఎల్. ఏ., పత్తేపురం (ప॥ గో॥)

ఉపాధ్యక్షులు :

శ్రీ యం. ఆర్. అప్పారావు, ఎం. ఎల్. ఏ.

(కుమార రాజా, వుయ్యూరు)

కవికులాలంకార శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయుడు, ఎం. ఎల్. ఏ.

(జమీందారు, పెనుగొండ)

కోశాధికారి :

శ్రీ రాయని రాములు పాత్రుడు

విజయవాడ - 1.

సహాయకులు :

శ్రీ బి. ఏ. రాజు

శ్రీ దేశిరాజు పుండరీకాక్షుడు

ప్రొప్రయిటరు : టెక్నో కామర్స్, విజయవాడ - 2.

## లంబోదరుడు

రాజప్రముఖుడా
గజరాజ ప్రముఖుడా
రోజురోజు నీ కరుణకావలసినదే
కొండల చక్రవర్తికూతురు నీమాతరా
అండపిండ బ్రహ్మాండము లణగిమణగి నీకుమ్రొక్కురా
॥రాజ॥
మేధావంతులు మేల్కొనెడి శ్రీ
వేదాంతకవి సన్నుతికి పెన్నిధికి ॥రాజ॥

# నేషనల్ మార్చింగ్ సాంగ్

వీరభారతావని-విశ్వశాంతిదాయని
అహింసావిహారిణి-అహంకారదూరిణి
నిఖిలభువనదినమణి-నిగమజనని శుభఘృణి ॥వీర॥
ధర్మచక్రధారిణి-కర్మశూరకారిణి
విచక్షణాస్వరూపిణి-విజ్ఞానభాగ్యధారుణి ॥వీర॥
ఐక్యసౌఖ్యగేహిని-ఆధిక్యలౌక్యమోహిని
కవిత్వగానవాహిని-గంధర్వ నగరిశోభిని ॥వీర॥
సస్యరత్నభూషిణి-సత్యవాక్యభాషిణి
వసంత వనవికాసిని-అనంతధనసుఖాసిని ॥వీర॥
భోగరాజరాగిణి-త్యాగరాజభాగిని
మహాత్మబోధపావని-మహాప్రతాప గోత్రిని
వీరభారతావని-విశ్వశాంతిదాయిని
అహింసావిహారిణి-అహంకారదూరిణి
నిఖిలభువనదినమణి-నిగమజనని శుభఘృణి

# ప్రసిడెంట్ ప్రసాద్

రాజరాజనరేంద్రుడుకాదూ - మా రాజేంద్రప్రసాదూ
శాంతిదాతకు - చామంతిమనస్సు
కన్నులవెన్నెల - కాయించుతపస్సు
రాజరాజనరేంద్రుడుకాదూ - మా రాజేంద్రప్రసాదూ
పారిజాతము - వానిజీవితము
వీరభారతము - వీనిజాతకము
రాజరాజనరేంద్రుఁడుకాదూ - మా రాజేంద్రప్రసాదూ
రసకిశోరికి రసవిహారికి - అనంత వసంత జయంతుఁడై
పసందుజేసెను - భరతఖండము
రాజరాజనరేంద్రుడుకాదూ - మా రాజేంద్రప్రసాదూ
వేదాంతకవిలేఖని - విశ్వోత్కరదరహాసిని
విశ్వాసముతో విన్నవించెను - ఆశ్వాసముతో సన్నుతించెను
రాజరాజనరేంద్రుఁడుకాదూ-మా రాజేంద్రప్రసాదూ.

# మ హా త్ము లు

శక్రాదుల్ తెలతెల్లబోయెడి అహింసాజ్యోతి వెల్గించి భూ
చక్రంబీవొక రాట్నచక్రమున నిష్టంద్రిప్పి యీసృష్టి ని
ర్వక్రప్రేమ హిమాలయాగ్రమున లేపం దర్లినావయ్యా ? రా
జక్రీడా ధరణీత్రివిక్రమ భుజస్కంధమ్ములో బాపుజీ !

2

నలుబదికోట్లఁబుత్రులను నాల్గుయుగాల వరాలనోము పం
టలుగ ఫలించుకొన్న రతనాల గృహంబున పెద్దగుండముం
నిలువున వేయబడ్డ దిక నిల్వదు భారత వృద్ధమాత ఈ
కులమతజాతి గక్కసుల కొంప మహాత్ముని దక్క నిచ్చునా.

3

పదిలముగా దురాగ్రహ ప్రవాహమునాపెడి కట్టగండి ప
డ్డది యెగబడ్డ వాహిని యెడారిగ జేసెడిదాక యింక తే
లదు మనవీరభారత కళానవరత్న హిమాలయంబు యీ
గుదురున శాంతిదాత మనకుం శతజన్మలకైన మొల్చునా ?

4

ఈ రవిఅస్తమించని మహీతలచక్రము నేలినట్టి దు
ర్వార నిరంకుశ ప్రభుపరాక్రమ సింహుల నూలుపోగుతో
ధారుణి గట్టివేసి యుగధర్మము మార్చు మహాత్మునిన్ మహా
క్రూరమృగాలు మ్రింగె కనుగొమ్మ మఱింత దరిద్రముండునా ?

5

ఇల బోసినోటి నవ్వుల తొల్కరికి
పండుచున్న చేలిక మందుచుందునేమొ
సర్వసర్వం సహాస్థలినూపు రాట్నచక్రము
నేఁడు మదురుపై బ్రతుకునేమొ
విశ్వభారతి శాంతివీణామీటిన
భగవద్గీత చదపుర్గువట్టునేమొ
భువనమ్ము లవలీల మోయువానిని
మోయు పాదఁతులెవరిపైనబడునో

కూడుగుడ్డవెలితిచేసి యూడిపోసి
దూసిపోసి బహిష్కారదోషవహ్ని
యందు మాడ్చు పెద్దతలలముందు హరిజ
ను లెచట తలదాచుకొనియుందురో జగాన.

6

శపథమువట్టి గెల్చిన విశాల ధరావలయమ్ము నీ భుజ
మ్ముపయి మహాత్ముడుంచి చనిపోయె జగజ్జనకుండుగా కటా!
ఇపుడు స్వతంత్రభారతమహీ మహిళామణి తండ్రిలేని బి
డ్డపగిది నిన్ను నమ్ముకొనె డస్సినదై యిల నెహ్రూధీనిధీ.

7

విశ్రుతకీర్తికెక్కెడి నవీన మహాయుగభార మెంతయో
నీ శ్రమమీఁదఁ బడ్డది, వినిర్మల భావివిశాలవిశ్వవా
ణీశ్రవణాలు నీదు కమనీయవచోరమణీయసౌఖ్య ల
క్ష్మీశ్రుతికోస మింక తిలకించుచునున్నవి నెహ్రుధీమణీ.

8

పుత్రుల్ పుట్టిరిగాని లేఁడొకఁడు నీ బోల్ జెట్టి ఏవజ్ర స
త్పుత్రం బెంతటిధన్యయై పసిఁడిపూజల్ సల్పి నిన్ గాంచెనో
క్షాత్రక్షోణి కఖండ శౌర్యకుల సంగ్రామోగ్రపాదోధివై
గోత్రం బెల్లకుదించి లేపితివి దిక్కుల్ బోసువీరాగ్రణీ.

9

పిన్నలు పెద్దలొండొరులు వెన్కఁ బ్రచండప్రతిజ్ఞఁబట్టి యా
శృన్నియుఁ బాదుపెట్టి చెరలందు శిరమ్ములిరుక్కనంగ బ్ర
చ్ఛన్నవిధంబుగా నరిగి సర్వచమూచతురంగవార్ధికై
కొన్న సుబాస్ శెబాస్ ! పగులగొట్టితి గుండెలు శత్రుకోటికిన్ !

10

ఏ యప్సరసచిట్టి కోయిలగొంతులో
ఘనయశస్సు వడఁగట్టినదో నీకు?
ఏపులిపిల్లలు కోపురకాచెడిచోట
సింహాసాహసము వచ్చినదో నీకు?
ఏమహాకవి పరమేశ్వరాఖండ జాహ్నవి
చదివినదో? కట్నాలు నీకు?
ఏకోహినూర్వజ్ర మింత కాలానికి
చిరునవ్వు కబురుచేసినదో నీకు?

ఈ కఠినకర్కశ శిలా శలాకములకు
దిమ్మదిరిగెడు దెబ్బనెత్తిపయిఁదగిలి
మొలిచె జయశాసనాక్షరములు జగాన
స్వాగతము నీకు రమ్ము సుబాసుతండ్రి !

11

మురళీప్రసూన సమ్మోహనగానముఁ
గానమనెడి హాళుక్క పేనినావు
ద్రాక్షామధుఫలరసాక్షరవత్సస్థ
లము పిండి కావ్యపాకమిడినావు
లలితకళానంద జలపాత మ్ముగ్రూత
లూగించి హృదయమ్ములూపినావు
బహుమహోపన్యాస వారాణ్ణిధిమధించి
రత్నమ్ములేరి పేర్వడసినావు
మనములో కవనములో సహనములోన
విశ్వసౌందర్యవనము పుష్పించినావు
చేసుకొనినావు పట్టాభిషేకమింక.
చాల రెవ్వారు నీకు గోపాలకృష్ణ.

## శ్రీ రామరాష్ట్రవిధాతృఁడు

ఈ మన రాజకీయ జగదీశ్వరులందున పొట్టివాఁడె మహా
ప్రేమవిపంచిమీటి బలవీరపరాక్రమసింహ శౌర్య సం
గ్రామ యశో విలాసులు వినమ్రతమ్రొక్కెడిరీతి పొట్టి శ్రీ
రాములు తెన్గుతల్లి కిల ప్రాణములిచ్చిఋణంబుతీర్చెరా.

## మంత్రులు

తిరిగిమొన్న బడులు తిరుగవై చినగూడ
ఐదుబడులె అంటవయ్యెనాకు
చలువపూచు షోడశకళాప్రపూర్ణుని
సంద్రమెట్లుకనెనో ? చంద్రమౌళి !

2

నీయధ్యక్షత కుల్కుచున్నసభ తండ్రీ ! కావ్యవిద్యల్లతా
శ్రేయోరాజ్యముగా చిగిర్చినది రాజీవాక్షులై జ్ఞానధా
రేయుల్ గానకళాప్రసూనకవితా కృష్ణాతరంగాలతో
నాయైశ్వర్యము రాసిపోసిరిగదన్నా ! చంద్రమౌళీశ్వరా !

3

ఎన్నో బర్వాలుపడ్డబండ్లు పయనం బీత్రోవపై జేసి నే
డన్నా చూడుము త్త్రడుల్ మెడలుకాయల్ కాచి యెట్లుండెనో ?
కన్నుల్ పండువొనర్చు నీకవనసౌఖ్యశ్రీ రథంబెంతయో
విన్నాణంబుగసాగె రామచరితోర్విన్ చంద్రమౌళీశ్వరా !

4

దయ్యాములై నశబ్దములు తాండవమాడెడి పద్యమల్లుటే
యియ్యెడ చాలతేలికసుమీ, యదిచక్కని శబ్దరేఖతో
వియ్యముసేయుచుండెడి కవిత్వము జేయుట కష్టమయ్యా ! యీ
నెయ్యముదక్కనట్లిడుము నీ సహకారము మంత్రిశేఖరా !

5

పుంజల్ లేచెడి రోజులందు కవనంబుల్ పూచి క్రొందళ్కులి
చ్చెం, జీర్ణించెడి నందనంబులకు సుస్నిగ్ధప్రసూనాత్మవై
సంజీవయ్యా సునామధేయ ! కవితాసంస్థానధారేయ నీ
కెంజాయల్ సహకారశాఖలయి యెక్కెన్ దిక్కులన్నింటిపై !

6

గోపాలరెడ్డి !నీ భూపాలకత్వంబు తెనుఁగు చామంతిపూచినదిగాదె
సంజీవిరెడ్డి ! నీ జగదేకవిజయంబు తెనుఁగువెన్నెలపంట తెచ్చెఁగాదె
లచ్చన్న ! నీ శౌర్యలక్షణవిభవంబు తెనుఁగురాచరికంబు తేల్చెఁగాదె
వేంకటరావు ! నీ విశ్వవిజ్ఞానంబు తెనుఁగు కీర్తికళ విప్పినదిగాదె

నీ ప్రశస్తినాగేశ్వరా ! నిక్కువముగ
తెనుఁగుతల్లి నోముఁగోట దిద్దితీర్చి
మోసి పట్టాభిషేకమ్ము చేసెగాదె
ఈ ప్రకాశమ్ముఁగో దిశ కెక్కెనెపుడొ !

## ప్రేమ స్వరూపులు

దీర్ఘాయు రారోగ్య దివ్యభాగ్యములిచ్చు
అన్నపూర్ణమ్మ నా కన్నతల్లి
అనివార్య శౌర్యసత్యాగ్రహోద్యమ శక్తి
కనిన శంభుండు నా కన్నతండ్రి
చక్కని మోహనాకార సహస్ర
ఫణిఫణాగ్రమణి మరీచి నా ఘృతాచి
అఖిల విశ్వస్వరాజ్య పతాకమెత్తెడి
భగవన్మతమ్ము నా ముగతనమ్ము

కవన భువనాధిపత్యమ్ముఁ గట్టినట్టి
వడ్డికాసులవాఁడు నా దొడ్డ గురువు
ఏమితక్కువ యింక నా కెవఁడు లెక్క
బండ్లకెత్తి నా వజ్రాల పంటనిత్తు.

2

సుంతయుదైవచింత మనసుల్ చిగిరించని జిబ్బపైన ని
శ్చింతగఁ బెర్గుజీవములు శ్రీరఘురామచరిత్ర వీనులం
దింతయు వేయ వీ దిన మదేమి మహాత్మ్యమొ మూర్తిరాజ ! అ
ర్పింతును నీకు మంజులపరీమళకావ్యము కల్పతర్వుఁగో.

3

రాయని రాములా ! తెనుఁగురాజ్యము వెల్గెడిదాఁక నిన్ను నా
తీయని కావ్యవీణ వినుతించి మహాత్ముని దివ్యపాద ధా
రేయుని జేసి నీకిడు చరిత్ర పవిత్ర సహస్రభాగ్య దీ
ర్ఘాయువులెల్ల తల్లిచరణాబ్జములిచ్చు జయాభిషేకముల్.

4

శాశ్వతకీర్తిపూచెడిరసస్వర కావ్యగళంబులెన్నియో
విశ్వ మునిఁప నీజయము వీనులవిందుగ, మంచిరాజు నా
గేశ్వర ! తెన్గుతోట ఫలియించెడి సంపదలెల్ల రాజరా
జేశ్వరి నీ కొసంగుత రవీంద్ర కవీంద్ర గజేంద్రకోటితో.

5

విశ్వము నాట్యమాడెడి కవిత్వముగైకొని తెన్గుతల్లి నా
గేశ్వర ! నీ కళాభిరుచికే నవరత్న విభూషితాంగియై
శాశ్వతసౌఖ్యకేళి కనుసన్నలతో మునుదేల్చి ఎన్నియో
అశ్వము లిచ్చి కొల్చెను జిరాయువులున్నతులంది యేలుమా !

6

విజయదశమినాడు వేదాంతకవికీర్తి
భువనమెక్క జేసె మూర్తిరాజు
సభికులెల్లసురలు జయభేరిగొట్టిరి
విజయవాడదుర్గ పేర్మికతన.

వేదాంతకవి

# ఆనంద జలపాతం

శ్రీ సి. హెచ్. మూర్తిరాజుగారు, ఎం ఎల్. ఏ. ఆహ్వాన సంఘాధ్యక్షులు.

ఈ అతిరమణీయమైన ప్రకృతిమహదైశ్వర్య మనోహరాల్ని, యుగయుగ పరిణామాల్ని, సమస్త మనస్తత్వాల్ని కనిపెడుతున్న తన మేధస్సుని యింద్రధనస్సు చేసుకొని విహంగయానం చేస్తుండే ఆలోచన తనజ్ఞానత్రిలోచనం చేసుకొని కాలాన్ని గుర్తించి కలాన్నిపట్టి అక్షరనక్షత్రాల్ని ఆచరణలో పెట్టే కవే అని శ్రీ వేదాంతకవి గార్ని నాహృదయం ఆనందదృష్టితో తెలుసుకొన్నది.

చిగిరించి చిలునవ్వుపువ్వులతో రాసులురాసులు యుగయుగ పరిణామాలుపోసి చూపిస్తున్న ప్రకృతి పరిస్థితులే తన స్థితిగతులుగా తీసుకొని నిరంతర నిర్నిద్రావస్థతో సాటిమానవలోకానికి వెర్రివాఁడుగా కనిపించి అనంతవిశ్వవిజ్ఞాన సౌందర్యరాశి యెగబోస్తున్న కవే అని యీ "ఆంధ్రబెర్నార్డుషా" బిరుదాంకితుల్ని నా నయనవీథిలో ఎప్పటికప్పుడు ఎందుకో చూడటం కలుగుతున్నది.

అంతర్ముఖుడై ఆత్మ ఆనందమురళితో చక్కగా భవితవ్యాన్ని గుర్తించి విశ్వ మహాజన భావిభాగ్యోదయాన్ని అక్షరాలతో చిత్రించి అందరికీ అందుబాటులో చూపిస్తున్న కవే యీ మహాకవియని చరిత్రమార్గనుండి అధునాతన మార్గంమీదచూచి ఆనందించకలిగాను.

ప్రళయగోళమైన యీ బ్రహ్మాండంలో ప్రతిమూలరహస్యాన్ని విశేషాల్ని తనకంటి కమేరాతో చెక్కుచెరగనట్లుగా గిద్దితీర్చి అక్షరదరహాసంతో హాయిగా! ఆనందంగా! తెలియజేస్తున్న కవే యీ విశ్వకవి అని గుర్తించాను.

కలంపాళి కన్నీటిమరకలతో కబుర్లుచెప్తూ సంఘాన్ని దోచుకుంటున్న బాపతులో పడక మహాకాళీ ప్రసన్నదయారసదృష్టితో ప్రసాదించిన అక్షరప్రసాదాన్ని పరిగ్రహించి రసవర్షం వర్షించి సంఘాన్ని నందనవనంగా కులికిస్తున్నకవే యీ కాళిదాసని నేను విశ్వసించాను.

జీవిత రణరంగాలలో దెబ్బతిని దిబ్బదిబ్బలైపోతున్న దేశదేశాల్ని నిరంకుశకవియై విశ్వవిజ్ఞానవీరగళంతోలేపి దేబిగొట్టుతనంతో దేవిడీలకెక్కకుండా తన జీవితాన్ని నానాకడగండ్లతో చిల్లులుపడి బక్కచిక్కికన్పిస్తున్న యీ శ్రీ వేదాంతకవిగార్ని నాదేశీయులంతా గుర్తించి యీనాఁడు సన్మానం జరిపించుచున్నందులకు నేను యిది నా అదృష్టమని తలుస్తున్నాను.

దేశానికి యిటువంటి మహాకవే దేవదత్తమని యీ అక్షరపూజాద్రవ్యంతో పూజించుకొంటున్నాను. త్రైలోక్యకుటుంబినియైన శ్రీ కనకదుర్గామహాదేవి మీకు, మీ మధురసంసారమునకు, మీ విద్వజ్జన బృందావన రాజ్యపట్టాభిషిక్తులకు ఆనంద మహోదయం పుష్పింపచేయటానికి మహాకవి శ్రీ వేదాంతకవిగార్కి ఆయురారోగ్య భాగ్యములుయిచ్చి చల్లగా కాపాడుగాక అని దేవీచరణక్షేత్రంలో నాభక్తికిరణాలు వర్షిస్తున్నా.

డాక్టరు. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు,
గవర్నర్, మధ్యప్రదేశ్.

ఆర్యా, నమస్కారములు!

శ్రీ వేదాంతం వెంకట సుబ్రహ్మణ్యం అను వేదాంత మహాకవిగారికి తాము ఏర్పాటుచేసిన సన్మానము జరుపుట ఎంతయు శ్రేయోదాయకము- వాంఛనీయము - సంస్తవనీయము. చిన్నప్పటినుంచి నేను వీరి తండ్రిగారిని సోదరులలో మధ్యముని కనిష్ఠులనుబాగా ఎరుగుదును. ఆంధ్రదేశము వీరిని సత్కరించుటలో ఆంధ్రభాషను సత్కరించుచున్నారే అని నేను భావించుచున్నాను.

నాగపురం,
14—10—55

చిత్తగింపుడు,
భో॥ పట్టాభిసీతారామయ్య.

శ్రీ పి యస్. కుమారస్వామిరాజాగారు,
గవర్నర్, ఒరిస్సా.

**Dear Mr. Murthy Raju.**

I am in receipt of your kind letter sent as President of the Sri Vedanta Kavi Sanmana Sangham

It is indeed proper that we, in a liberated India, do our duty to literateurs and others whose sacrifices in the national cause have so luckily attained fruition I am, therefore, glad that steps are being taken to honour Sri Vedanta Kavi who has done so much to inspire our people with his powerfull gifts of verse and oratory and has also suffered incarceration. In honouring him Vijayavada will be indeed honouring itself, and I wish the function every success,

*Yours si cerely,*
P. S. KUMARASWAMY RAJA

గౌ॥ శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు,
రివిన్యూ శాఖామాత్యులు
కర్నూలు, 23-10.55

ఆర్యా, నమస్తే!

శ్రీ వేదాన్తకవిగారి సన్మానసభకు నాకున్న యితర కార్యక్రమములవలన ఆ నాటికి రాజాలనందులకు విచారము.

సన్మానసభ జయప్రదముగ జరుగును గాక!

కల్లూరి చంద్రమౌళి.

శ్రీ రాజా వై బి. వీరబసవచిక్క రాయల్‌గారు, యం. ఎల్ ఎ.

జమీందార్, పుంగనూరు.

Dear Sir,

Your letter dated 19th instant to hand noted the contents. I am very glad to note for the arragements made for Sammanam to Sri MAHAKAVI Sri VEDAMTHA KAVI Garu.

Thanking you

Yours faithfully,

R AJA VEERA BASAVA CHICKRAYAL,

Zamindar.

శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్‌గారు, యం. ఎల్. ఎ.

త ణు కు.

Dear Sir,

I have great pleasure in acknowledging receipt of your invitation in connection with Sanmana Mahostavam to Sri VEDANTA KAVI Garu to be celebrated on 26th 27th instants. I am sorry, I could not attend the function due to preoccupations I wish the function every success.

Thanking you,

Yours Sincerely,

K. Gangadhara Rao

For (M. H. PSASAD)

SRI RAYALA KALA PARISHAT,

Hindupur, 19th Oct '55.

Wishing the conference a glorious and colourful success.

D. KRISHNAYYA.

*Secretary.*

బ్రహ్మశ్రీ గుమ్మడిదల వేంకటసుబ్బారావుగారు,
గోష్ఠి, అమలాపురం.

అయ్యా!

మిత్రులు శ్రీ వేదాంతం వేంకటసుబ్రహ్మణ్యం అను వేదాంతకవిగారికి సన్మానము జరుపుచున్నందులకు సంతసము. స్వాతంత్ర్య సాధనలో యితడొనర్చిన కృషి, సల్పిన త్యాగము, గావించిన ప్రబోధము జగద్విదితములు. నిజముగ యిచ్చట ఏర్పడినది "స్వరాజ్య"మే యగుచో, శ్రీ వేదాంతకవి మన రాష్ట్రమునకు ప్రథమ ఆస్థానకవి కావలసియుండెను. కాని మన మిత్రులు బ్రిటిష్‌పాలకుల స్వైచ్ఛిక ఔరసత్వము వహించుటలో "రాజకీయబాధితు" లగుటను "బాధితులు" పీడితులు కావలసివచ్చినది. ఈ రీతిగ వెనుకబడిపోయినవాడు మన మిత్రుడుకాని "కవులను" ఎవ్వ రణచియుంచ గలరు? అందు మన వేదాంతకవిని? కావున యాతడు ముందుకు పోవుచూనే యున్నాడు. ఇట్టితరి యాతని విజయవాడ, ఏలూరు (పశ్చిమగోదావరి) మిత్రులీ సన్మానము నేర్పాటుచేయుట యెంతయు ప్రశంసనీయము సభలు దిగ్విజయముగ జరుగుగాక! శ్రీ కవిగారికి ఈ సందర్భమున నా శుభాశీస్సులు.

గ్రహించవలెను,
గుమ్మడిదల వెంకటసుబ్బారావు.

శ్రీ దాడి గోవిందరాజులుగారు,
సబార్డినేట్ జడ్జి, అనంతపురం.

మహాశయా,

మీరు దయతో పంపిన శ్రీ శ్రీ వేదాంతకవిగారి సన్మాన ఆహ్వాన మందినది.

శ్రీవారు మహాకవులు. నేనో కవిత్వమును అర్థముచేసుకొను అర్హతకూడ లేని వాడను. కనుక నేను శ్రీవారినిగూర్చి వ్రాయుట 'నక్క యెక్కడ నాగలోక మెక్కడ" అన్న తీరున వుండును. కాని, 'కొండంత దేవునికి కొండంత కొబ్బరికాయ' కొట్టలేముకదా - అదిగాక అధమాధముడైన మానవునికికూడ సర్వాంతర్యామి అయిన ఆ ఆదిమూర్తిని స్తుతించు అర్హత వున్నదికదా - అట్లే శ్రీవారినిగురించి రెండు ముక్కలు వ్రాయుటకు నాకుకూడ హక్కు కలదనుకొనుచున్నాను.

శ్రీవారు 'తెనుగుతల్లి' నాటకము రచించిన, నటించిన నాటినుండి,- నేనుకూడా రంగస్థలమున ఆ రోజులలో వైతిక్కులాడేవాడ్ని - వారిపరిచయ భాగ్యము నాకున్నది. వారు మహానటులు. చక్కటి నాటకసమాజమును స్థాపించి నిర్వహించేవారు వారి

నాటకములు, కావ్యములు, సర్వతోముఖ రచనలు, వారి ప్రతిభను వేనోళ్ళ చాటు చున్నవి. కవిత్వముతోపాటు, అధ్యాత్మిక చింతను శ్రీవారు మేళవించి, అందలి పరమరహస్యములను లోకమునకు వెల్లడిచేసి, ప్రజానీకానికి యెంతయు మేలు సమకూర్చుచున్నారు.

శ్రీవారికి ఆయురారోగ్యములను, అశేష శక్తిని యిచ్చి, విశాలాంధ్రకు ఏకైక మణిభూషవలె ప్రకాశించునట్లు ఆశీర్వదించ వలసినదిగా ఆ దేవదేవుని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,
శ్రీవారి అనుచరుడు
దాడి గోవిందరాజులు.

జనాబ్ మహమ్మద్ రహింతుల్లా, యం. ఎల్. ఎ.
చైర్మన్, మున్సిపల్ కౌన్సిల్, అనంతపురం.

ఆర్యా !

మీరు పంపిన ఆహ్వానమునకు కృతజ్ఞుడను.

శ్రీ వేదాంతకవిగారిని సన్మానించుట సంతోషకరమైన విషయము.

నా మిత్రులు మూర్తిరాజు యీ పనికి పూనుకున్నారని మరిన్ని సంతోషించినాను.

మహాకవులు శ్రీ శ్రీ పాద, శ్రీ విశ్వనాథగారలు కవిగారిని ఆశీర్వదించుట బాగున్నది.

కవిగారికి నా అభివందనాలు అందించండి.

సన్మానసభలు జయవంతంగా జరగాలని అభిలషిస్తూవుంటాను.

ఇట్లు,
మహమ్మద్ రహింతుల్లా.

స్వామి సీతారాం
వినయాశ్రమం.

ఆత్మస్వరూపా!

మీరు దయతో పంపిన ఆహ్వానములు నిన్న చేరినవి. మీకు కృతజ్ఞుడను.

మీరు తలపెట్టు శుభకార్యము జయప్రదముగా జరుగుగాక. అంతకంతకు వచనములకు, సామాన్య పాటలకు యెక్కువ వ్యాప్తి కలుగవలయును.

జై ఆంధ్ర,
సీతారాం.

శ్రీ చిత్తూరు. వి. నాగయ్యగారు,
ఫిలిం ఆర్టిస్టు, ప్రొడ్యూసర్, డైరక్టర్,
మద్రాసు.

మహాకవి శ్రీ వేదాంతకవిగారి సన్మానసంఘమువారికి హృదయపూర్వక నమస్సులు.

మహాశయులారా!

"ఆంధ్ర బెర్నార్డ్షా" అని ఏనాడో బిరుదందుకున్న శ్రీవేదాంత కవిగారికి, యీనాడు అఖండసన్మానం జరుగుతోందని తెలిసి మిక్కిలిగర్విస్తున్నాను. ఆంధ్ర కవితామతల్లికి, శ్రీ వేదాంతకవిగారి యీ సన్మానం, మరో వజ్రాలహారం. ఇందుకు పూనుకున్న మీ అందరికీ, నా హృదయపూర్వక ధన్యవాదాలు.

శ్రీ వేదాంతకవిగారి, కవితావాహిని, దేశాన్ని ఏనాడో, ముంచెత్తింది. వారి నెరుగని ఆంధ్రుడుగానీ, వారి కవితాలహరిని ప్రశంసించని రసజ్ఞుడుగానీ, దేశంలో లేగనడం అతిశయోక్తికానేరదు. అలాంటి మహాకవికి, మహావ్యక్తికి, యీ సన్మానం జరుగుతోందంటే, నిజంగా, నా హృదయం- సంతోషంతో పొంగి పోతోంది.

అన్నివిధాలా, చిక్కుల్లో ఆర్థిక ఒత్తిడిలోవున్న నేను, యీ ఘనసన్మానాన్ని నేరుగాచూచి ఆనందించేభాగ్యం లేనందుకు విచారిస్తూ నా హృదయపూర్వకమైన శుభాకాంక్షలు పంపుతున్నందుకు నన్ను క్షమిస్తారని తలుస్తా.

రిక్తహస్తాలే, కాని, నిండు హృదయంతో శ్రీవేదాంతకవిగారికి యీ మహోత్సవ సందర్భంలో నా నమస్కారపూరిత అభినందనలు అందజేస్తున్నాను.

సర్వశక్తిప్రదాతయైన పరమేశ్వరుడు శ్రీ కవిగారికి దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యముల ప్రసాదించుగాక.

భవదీయుడు,
చిత్తూరు వి. నాగయ్య.

## వేదాంతకవిగారి సన్మాన వేళాభినందనము

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఎం. ఎ.,
వి జ య వా డ

మీరు "ఆంధ్ర బెర్నార్డుషా" అనిపించుకొంటిరి. అనేక కావ్యములు వ్రాసితిరి. వేలకొలది శిష్యులను భక్తులను గడించుకొంటిరి. మీ సన్మానములకు మంత్రులు పత్రికాధిపతులును వత్తురు కవులందఱు మిమ్ము ప్రశంసింతురు. మీకు పరమేశ్వరుడు దీర్ఘాయుస్సును ధనధాన్య సమృద్ధియు నిత్యోధిక కావ్యరచనాశక్తియు నిచ్చుగాక.

(సం.) విశ్వానాథ సత్యనారాయణ

# సరస్వతీ కంఠాభరణం

విద్వాన్, సరస్వతీ కంఠాభరణ
శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు, తణుకు.

శ్రీ వేదాంతకవీ! కవిని ఘనునిగా చెప్పవలసివచ్చినప్పుడు ఈశుడు, ఇంద్రుడు, చంద్రుడు, చక్రవర్తి, సార్వభౌముడు మొదలైన పదాలు తగిలించివాడడం పరిపాటియైపోయింది. అసలు ఆకవిలో, ఈశత్వం, ఇంద్రత్వం, చంద్రత్వం, చక్రవర్తిత్వం, సార్వభౌమత్వం కించిత్తుగానైనా ఉందో లేదో చూచి ప్రయోగించడం లేదు. శ్లేష్మతావాచకాలుగా వాటికి చలామణీ జరుగుతోంది అంతే.

శ్రీ వేదాంతకవిగారికి ఆ పదాలు తగిలించడం మాత్రం అల్లాంటిదికాదు. ఆ పదాలు వ్యుత్పత్త్యర్థం ఆయనకు అతికినట్లుండదు. సరిగ్గా తూచి అన్నట్లుంటుంది.

శ్రీ కవిగారిలో ఈశత్వం ఉంది, ఇంద్రత్వం ఉంది, చంద్రత్వం ఉంది, చక్రవర్తిత్వం ఉంది. ఆయన స్వభావం మొదటినుండి స్థైర్యాలను నిలబెట్టుకొంటూనే ఉంది. నానాటికి ఆధర్మాలు పూర్ణత్వస్థితి నందుకోబోతున్నాయి కాని ఏమాత్రం దిగజారలేదు. ఆయనభావం ఎప్పుడూ ఉన్నతోన్నతస్థాయిలో రాజరికంతో నిండి ఉంటుంది.

ఆయన కవితాసంస్థానాధిపతి తాడేపల్లిగూడెములోనుండి ఆ సంస్థాన ప్రతిభ దిగంతములనందుకొన్నది. ఆయన పూరింటిలో నున్నా సంస్థానాధిపతిస్థాయినుండి అణుమాత్రం దిగలేదు. ఆ సంస్థానగౌరవాలను అందినవారికి అదొక ఐంద్రజాలికం అనిపిస్తుంది.

పూర్వం వసిష్ఠులవారి ఆశ్రమంలో మహాసేనాపరివృతుడైన విశ్వామిత్ర మహారాజునకు పంచభక్ష్య పరమాన్నములతో విందుజరిగింది. భరద్వాజులవారి ఆశ్రమంలో అనేక పహాపువానరసమూహంతో శ్రీరామచంద్రునకు విందు జరిగింది. ఆవిందులకు

ముందు పొయ్యిలో పొగ రాజలేదు. భాండశుద్ధి లేదు శాకపాకాలు కనుపించలేదు. విందులుమాత్రం బంగారు పళ్ళెరాలలో నవకాయ పిండివంటలతో కంఠదఘ్నంగా వేలమీదజనానికి మహాహ్లాదకరంగా జరిగిపోయింది. అది వసిష్ఠులవారి ప్రతిభకు నిదర్శనం. భరద్వాజులవారి మహిమకు దృష్టాంతం. సరిగ్గా అదేపద్ధతిని కవితాసంస్థానంలో అప్పటికప్పుడు మొలుచుకొనివచ్చి మహారాజయోగంగా అతిథులకు అభ్యాగతులకు సమస్త గౌరవాలునడిచేవి. ఒకమూల వేదాంతకవిగారు పడకకుర్చీలో మందహాసంతోనో, మహావేగంతోనో కవితాగానంచేస్తూంటారు ఆయన కాలు కదుపడు. అంతే ఎక్కడకూర్చున్న వారికక్కడనే సమస్త ఫలాహారాలుసిద్ధం.

అది కవితాసంస్థానం. ప్రతినెల 1వ తేదీని ఒక మహాకవికి, మహాపండితునకు మహామేధావికి, మహాప్రతిభాశాలికి అక్కడ మహోన్నతోన్నత గౌరవాదరాలతో మహాసత్కారం జరుగుతుంది. సంస్థానాధిపతి ఎప్పుడూ అకించనుడే సన్మానములు మాత్రం ఏసంస్థానములోనూ అంతగౌరవం పొందలేదని సంతోషించివెడుతారు. ఇదంతా వేదాంతకవిగారి ప్రతిభాప్రభావములకు తార్కాణం. ఆయనలో, ఈశత్వం, ఇంద్రత్వం, చంద్రత్వం, చక్రవర్తిత్వం, సార్వభౌమత్వం నిరూపించడానికి ఇది ఒకచిన్న ఉదాహరణం. ఎన్నోకథలవలె ఉదహరణాలున్నాయి.

ఇట వారికవితావిషయము తడవుట అనవసరము ఆయనకవితలో ఎక్కడ చూచినా దైన్యం కనుపించదు. నైరాశ్యం గోచరించదు అరణ్యరోదనం అగుపించదు. అసలు ఆయనలో ఈ లక్షణాలు మచ్చుకైనా ఉంటేనాని ఈశత్వాది లక్షణాలన్నీ ప్రస్ఫుటమవుతాయి.

ఆయన కవితాప్రతిభ మహత్తరమైనది. వ్యుత్పత్తినిమించిన ప్రతిభావంతుడు వ్యుత్పత్తిని సాధించవచ్చు. ప్రతిభ సహజసిద్ధంగా ఉండవలసిందే. ఆయన "నిరంకుశాః కవయః" అను తాహతును అందుకొన్నవారు. ఆయన కవితలోని కొన్ని ప్రయోగములు నిరంకుశప్రయోగములు కానవచ్చును అది ఆయన ప్రతిభనిరంకుశమైనదని ద్యోతకము చేయునవే కాని వ్యుత్పత్తిని శంకింపజేయునవిగా నుండవు

అప్పటికప్పుడు వలసినప్పుడు కవితాయోగంలో సమాధిస్థితిని పొందగల మహనీయుడు వేదాంతకవి అసలు రాత్రింబవళ్ళు నిరంతరము ఆయన కవితాసమాధిలోనే ఉంటారన్నా అబద్ధంగాదు. మరేమీ ఆయన పట్టించుకోరు. స్వవిషయాలాయనకు అంటవు అది ఆయనచేతకానిపనియన్నా అనవచ్చు.

"కల్పతరువు"లో వేదాంతకవి కవిత్వము పండినది. ఆ ఫలము అమృతమునే ప్రసవించుచున్నది. ప్రతిపద్యము స్పృశించి తలస్పర్శముగా కల్పతరువు నామూలాగ్రంగా విమర్శించే అవకాశం నాకు మరొకప్పుడు లభ్యంకాగలదని ఆశిస్తున్నాను.

ఇట్లు

విద్వాన్, సరస్వతీకంఠాభరణ, వేమల సూర్యనారాయణశర్మ.

# జాతీయకవి

ఉభయభాషాప్రవీణ శ్రీ జాస్తి వెంకటనర్సయ్య చౌదరిగారు,
చిలకలూరుపేట.

దేశములో ఉప్పుసత్యాగ్రహము జరుగుచున్న రోజులవి. 1930 జూనులో తంజావూరున బాలుర కారాగారమునకు సత్యాగ్రహమునందు పాల్గొన్న యువకులము పంపబడితిమి. అచట నాకు బక్కపలచని శరీరము, కళ్లజోడు, చేతిలో పుస్తకాలు పెనసలు కలిగిన యొకయువకునితో మైత్రి కలిగినది. నేను ఉభయభాషాప్రవీణ విద్యార్థిని కాన అదే ధోరణిలో నుంటిని. మిత్రులము నిరంతరము చదువుట, కవితాభ్యాస మొనరించుట, చర్చించుట, చేయుచుండెడివారము. దినములు క్షణములుగా గడచినవి. ఆమిత్రుడే వేదాంతకవిగారు. వారి సాహితీశక్తిని ఆనాడే గుర్తించినవాడను నేను. దేశసేవతోబాటు వారి సారస్వతసేవ ప్రారంభమైనది.

చెమటల్ కార్చి చతుస్సముద్రముల రాశిబోసి యీమంటిగి (పావురాలు)

నీచముగ నిందించకన్నా అన్నదమ్ముల మాదుమన్నా॥

దేవునికి దేశమ్ము జూపి, బోసినోటితో పూజచేసె॥ (పట్టాభిషేకం)

రథసారథి రథసారథి రథసారథి విద్యార్థి॥ (పట్టాభిషేకం)

అని జాతీయకవిత, వారిరచనల్లో తొణికిసలాడును. చూడుడు.

కవిగారి కల్పతరువను రామాయణకావ్యంలో, "మాఇలువేల్పు" పావురాలలో భక్తి, తెలుగుతల్లినాటకంలో జాతీయాభిమానం, పంజాదెబ్బ, కవితాసంస్థానములలో విమర్శనాశక్తి, మహాకావ్యాలు, పట్టాభిషేకాల్లో సునిశిత ప్రతిభ ప్రస్ఫుటమగును. కష్టకాలం, ఆకలిమంట, సోషలిజం, నాటకాలు వారి విశాలహృదయాన్ని వెల్లడి చేయును.

కవిగారి కావ్యభావాలను (శ్రీ పట్టాభిగారివలన విని జవహరులాలు నెహరూ) పండితులు వారిక "ఆంధ్రబెర్నార్డుషా" బిరుదమిచ్చిరి "వాలకంలోనూ వ్రాతలోనూ, మాటల్లోనూ వేదాంతకవి బెర్నార్డుషానుజ్ఞప్తికి తెస్తారు" అని యొకరు, "నేటిలోకమునకు తెనాలిరామలింగకవి లక్షణాలున్నై" అని ఇంకొకరు అన్నారు. నిజమే. "నిరంకుశాః కవయః" అనునది మనకవిగారియందు అక్షరశః సత్యమగును.

అక్షరము లప్సరసలై (పావురాలు)
వేదాంతకవీంద్రుని కల (పావురాలు)

"పెద్దలయినవాళ్లకి నిజమైన దాసుణ్ని నేనే. నిజంకోసం లేచిన నిరంకుశుణ్ని నేనే." అనునది కవిగారి ఆత్మధైర్యమును వెల్లడించును. 'సుకవితా యద్యస్తి రాజ్యే

నకిం' అనినట్లు వారు కవితా రాజ్య పట్టాభిషిక్తులు. "ఘుమఘుమలాడు పదములేరి కూర్తును; కవనంబు దవనంబు కరణి నేను" అని వారే చెప్పినారు 'కొత్తపోకడ వీరి కూర్పులో కనుపట్టు- తెనుగుతల్లికి వీరు తెనుగుతండ్రి' యని గురుదేవులు శ్రీ చెళ్లపిళ్ల వారు కవిగారిని గురించి చెప్పియున్నారు "విశ్వశ్రేయః కావ్యం" "నానృషిః కురుతే కావ్యం" అన్నట్లు ప్రపంచకళ్యాణమే వారి రచనల లక్ష్యము "వాక్యం రసాత్మకం కావ్యం" అన్నట్లు వారు మాట్లాడు ప్రతివాక్య మొక్కొక్క కావ్య మగును. లలిత కళాస్వరూపులు నవరసమూర్తులు. శ్రీ మహాకాళీమూర్తి మతిను నిరంతరము అక్షర తపస్సు నొనర్చు "జగజ్జనని" వారు. 'మహాభక్తమనోహర' బిరుదము వారియందు సార్థకమగుచున్నది. కావ్యగానములో వారికి సాటియగువారెవరున్నారు? కథా, గేయ, నాటక, కావ్య, విమర్శనా రూపములగు వారి రచనలు ఏబదికి మించును.
సంగీతాగమదైవమైన హనుమస్స్వామి ప్రమోదమ్ముతో (కల్పతరువు)

పై పద్యమెంత మధురముగా నున్నదో చూడుడు.
మధురమధురమైన మామిడిపండులో, రామనామముతీపి రాదురాదు. (కల్పతరువు)

యని విన్నవింప శ్రీరామమూర్తి హనుమంతుని భక్తికి సంతసించి యిట్లనియె.
'హనుమా! నీవు నిజమ్ముగా శివుడవయ్యా!' (కల్పతరువు)

తెనుగుతల్లినాటకములో ఆంధ్రదైన్యము నెట్లువర్ణించిరో చూడుడు,
దిక్కువ్వండును లేక గోడుమని వీకెన్ బడ్డ నా ఆంధ్రి (తెనుంగుతల్లి)
ధరణిన్ వాఙ్మయపీఠమెక్కి బహునా ధర్మంబు శాసించి (తెనుంగుతల్లి)

మన కవిగారు నటకులు వారి నాటకాల్లో ప్రధానపాత్రగ వారే నటింతురు.

'కం పరమాత్మానం లాతిగృహ్ణాతి ఇతి కళా' పరమాత్మను జేర్చునదియే కళయని నిర్వచనము. రాజకీయవాదులకన్నా కళారాధకులే ఎక్కువ శాంతి వికాసము కల్గించువారని శ్రీ జవహరులాలు నెహ్రూ గారు చెప్పినారుకదా. "రసో వై సః" "ఆనందో బ్రహ్మ" యన్నట్లు కవిగారు నిత్యానంద రసస్వరూపులు. "యద్భావం తద్భవతి" యన్నట్లు వారి యాదర్శములు వారి రచనలలో ప్రతిఫలించుచుండును. వారి కవిత్వము సత్యశివసుందరము వారి భావము శాంతశివమద్వైతము. సత్కవితను ప్రశంసించుట, సముద్రమునకు ఏతాము ఎత్తుటవంటిది.

సభాధ్యక్షులగు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు 'భారతీయప్రతిభ' 'రామాయణ సుధాలహరి' మున్నగు ఉత్తమ విమర్శనాత్మక గ్రంథములను రచించిన కళావేత్తలు. రాష్ట్రమంత్రులు దేశభాషాసేవా ధురంధరులునగు వారు కవిసన్మాన సభకు అధ్యక్షులుగానుండుట బంగారమునకు పరిమళమిచ్చినట్లున్నది. మంత్రులు కవులు అయిన డి. సంజీవయ్యగారు రెండవరోజుసభ కధ్యక్షులుగానుండుట మిక్కిలి ఆనంద

దాయకము. అభినవతిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారికి 29-4-1949 న గజారోహణ కనకాభిషేకాది ఘనసన్మానము, ఆంధ్రులు చేసినారు. 26-10-1955 న, విజయదశమీపర్వదినమున శ్రీ వేదాంతకవిగారికి అట్టిసన్మానము జరుపుచున్నారు. ఆంధ్రులరసికతకు శ్రీ సి. హెచ్. మూర్తిరాజుగారి కళాహృదయమునకు జోహారులు.

జయ్ ఆంధ్ర

"జయంతితే సుకృతినోరస సిద్ధాకవీశ్వరాః"

—జాస్తి వేంకటనరసయ్య
ఉభయభాషాప్రవీణ

# మా మ హా క వి

## శ్రీ సర్వా చిదంబరశాస్త్రిగారు, విజయవాడ.

విశాలాంధ్రావనియందు, పురాణయుగమునుండి ప్రస్తుతపు ఆధునిక యుగము వరకు మహామహులైన కవిపండితు లుదయించి, దేశభాషా సంస్కృతిని విస్తరింపచేసి, విశ్వవిజ్ఞాన చైతన్యమును గగనవీధుల నంటించి దేశమునకు జ్ఞానచక్షువులైనారు. పండిత కవుల కలము, కంఠారవములు లేనిదేశము కీకారణ్యము కవితానుధారస వృష్టివల్లగాని జ్ఞానసంపదలు వర్ధిల్లనేరవు జ్ఞానసంపదలు లేనియెడల, దేశ మజ్ఞాన తిమిరాంధ బంధములచిక్కి కృశించి నశించుట నిక్కువము. కనుకనే ప్రాచీన కాలమునుండియు ధరాపాలురు పండితకవుల నాదరించి, గౌరవించి పోషించుచూ వచ్చిన విషయము చరిత్రాత్మకమైనది. ప్రస్తుతము శ్రీకృష్ణదేవరాయలువంటి ప్రభువులు, కొండవీటివంటి సంస్థానములులేవు తంజావూరు, గద్వాల, బొబ్బిలి, విజయనగరము మొదలగు సంస్థానముల అధీశులు భాషను పోషించుచు వచ్చినారు. స్వతంత్ర భారతావనియందు అట్టి సంస్థానాధిపతుల సన్మానభారములు ప్రభుత్వములు స్థాపించుకొన్న ప్రజలవైనవి.

సాహిత్య రంగమునందే, కొంచెము సమైక్యతా భావభాగ్యము సంపాదింప గలదన్న విశ్వాసముకల విశ్వ వాఙ్మయోద్ధారకులకు నిలయశూన్యమగు టెంతయు శోచనీయము. విద్యయొక్క ప్రథమ ధర్మము విచక్షణ. విచక్షణాచక్షువులుగల పండితకవులు అరుదు. అట్టి జ్ఞానధనులలో దేశారాధకులు, శ్రీ వేదాంతం శంభుశాస్త్రిగారి తృతీయ కుమారులు, మహాకవి శ్రీ వేదాంత కవిగారొకరు.

వీరు ప్రథమ ఆస్థానకవి శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ప్రియశిష్యులు. శ్రీ వేదాంతకవిగారిని యెరుగనివారు దేశమున లేరు. వీరినిగురించి వ్రాయుట దివిటీని గొని సూర్యుని చూపించినట్లుండును. స్వతంత్ర సమరమున, దేశ సౌభాగ్యమున సర్వము త్యజించిన త్యాగధనులు. చిన్న వయస్సుననే పండిట్ జవహర్‌లాల్ నెహ్రూజీ

సమక్షమున "ఆంధ్ర బెర్నార్డ్ షా" బిరుదుపొందిన భాషారస చక్రవర్తి. కవి కంఠారవములే దేవదత్త శంఖారావములై అజ్ఞాన సుషుప్త్యావస్థ యందున్న ప్రజను మేలుకొలిపి, విశ్వ విజ్ఞాన చైతన్యము కలిగించుట నిస్సంశయమని ఆదేశించు వీరి రచనలు విశ్వకల్యాణ లావణ్యమునకు మంగళసూత్రములు. దేశమందు రాజకీయపరిణామములను, ముందుగనే, యోచించి, వచించి, గ్రహించి, ఆశించినట్లు వీరి పాత్రములు గనబడును. శ్రీ కవిగారు రచించిన, తెలుగుతల్లి, కష్టకాలం, యుద్ధభూమి, ఆకలిమంట, ఛలో హైదరాబాద్, విశ్వస్వరాజ్యం, మహా ధికర్ణ, సోషలిజం మొదలగు నాటకములు, కవితాసంస్థానం, భగవన్మతిభ్రాష్ట్యం, దండయాత్ర, నాయకులు, గడుగ్గాయి, కరటాలు, కొత్తపాటలు, కిరణాలు, ప్రపంచవిషయాలు, పంజాదెబ్బ, క్విట్ మహాతెలంగాణ్, పావురాలు, మూషలువేల్పు, జగజ్జనని, మహావాక్యాలు. రసమురళి, కిలార్నట్టు, ప్రభుత్వం, పట్టాభిషేకం, మొదలుంగాగల కావ్యములు, దేశవిజ్ఞాన సౌభాగ్య సౌందర్యమునకు గీటురాళ్ళు. శ్రీ విగారు నాటకములు రచించి, సమాజములు నెలకొల్పి, నటీనటులకు నాటకములు నేర్పి, మహా విశాలాంధ్రములో నే గాక, యావద్భారతదేశమున్న మన్ననలందిన మహామహులు, మహానటులు వీరివద్ద నాటకములలో తయారైనవారిలో కొందరు సినిమాజగత్తులో మేటినటులై రాణించుచున్నారు భాషనెంత మనోహరముగా, సరళముగా, హృదయంగమముగా, మాధుర్యముగా, రూపొందించవచ్చునో అమోఘముగ నిరూపించి ఆంధ్ర సాహిత్యాన్ని మాధుర్యోజ్జ్వలం చేశారు. నిష్కపట నిరంకుశ శక్తిసామర్థ్యములు శ్రీ కవిగారిభుజబలములు, సింహగర్జనవంటివాక్కు, దయార్ద్ర హృదయులు, దృష్టి నిశిత విచక్షణాత్మకము. అంగుష్ఠమాత్రులను ఆజానుబాహులుగను, ఆజానుబాహులను అంగుష్ఠమాత్రులుగను సమయోచితముగా పొగడుట వీరికి గిట్టనే గిట్టదు కలిమిలేముల యందును, సుఖదుఃఖముల యందును ప్రవాస పేరోలగములందును తారతమ్యములు లక్ష్యపెట్టక నిశ్చల హృదయులై, విశ్వవిజ్ఞాన మహాధనమున అక్షరకుబేరులై, కలమతిఝాతికత్తు వర్గవిచక్షణల పారద్రోలి, పాలాసంఘసర్వరోజా, కవితా సంస్థానమునుస్థాపించి, పండిత, కవిప్రముఖుల సన్మానించుసంస్థానాధీశులైనభాషా సేవకులు శ్రీ వేదాంతకవిగారు. వీరి వచన రచనాపటిమలు వర్ణనాతీతములు. శ్రీ మహాకాళీమూర్తిమంతమున నిరంతరము అక్షగతిపన్నుండి నిష్కల్మషహృదయులై రామాయణ మహా గ్రంథమును అతి మృదు మధుర భావగర్భిత కవితాసుధారసవృష్టి కడవపోతగా కురిపించుచూ రచించిన కల్పతరువనెడి కావ్యమెంతయు ప్రశంసనీయమైనది. వీరి వక్తృత్వము కావ్యగానము అతి శ్లాఘనీయములు. విశాలాంధ్రావనికి శ్రీ వేదాంతకవి యనికిపట్టు వెన్నెముక వంటిది.

అమ్మనని పించుకొన్నట్టి అధికుడెవ్వడు?
కాళి నేనని గర్జించు కవి యెవండు?
వాణిచేబట్టి చెండాడు వక్త యెవడు?
ఒక్క వేదాంతకవి తక్క యొక్కడైన.

# మా వేదాంతకవి

శ్రీ ప్రభల రాధాకృష్ణమూర్తిగారు, గోష్ఠీవిద్యాలయం.
విజయవాడ—2.

అదియొక కుగ్రామం. నాస్వగ్రామం. దానిపేరు, తెనాలి తాలూకా కోరుతాడిపఱ్ఱు అగ్రహారం. ఆగ్రామంచుట్టూ కనుచూపు మేర ఎటుచూచినా పచ్చతివాసీ పరచినట్లుండు పంటచేలు. ఉత్తర దక్షిణముల చెరువులు. ఉత్తరదిశ చెరువునానుకొని కోవెల. దాని వెనుక ఆంధ్రరత్న స్మృతి చిహ్నములై పెనవేసుకొనియున్న వేప, రావిచెట్లు. ఆచెట్లముందు నిశాల బహిఃప్రదేశం. ఆగ్రామగాంభీర్యత. ఇవన్నీ కనుగొన్న అదొక సద్రసికవిద్యాసీమయని దోచుచుండును.

ఆగ్రామ మధ్యస్థమైయున్నదొక మండువాలోగిలి. అయ్యదియే మన మహాకవి మేనమామలగృహము. వారనన్యసామాన్య పాండిత్యశేముషీధురంధరులు గీర్వాణభాషానియంతలు. ఏకసంతగ్రాహులు. వారింట్లోనే మన వేదాంతకవిగారి బాల్యం చాలాకాలం గడచి పోయిందంటారు. ఆరోజుల్లో నేనింకా గోచిపెట్టలా. అంచేత అప్పటి మా వేదాంతకవిగారిని నేను బాగా ఎరుగను. కాని వారికుటుంబ మంతానాకు పరిచితులే.

వారి మాతృపక్షమట్టిది. పితృపక్షముకూడా వైదగ్ధ్యవారాణ్ణిధియే. పైగా అశేషదేశభక్తి ప్రపూరితులాకుటుంబం మొత్తం. సకుటుంబముగా స్వాతంత్ర్యసమరములో నడుములుబిగించి దూకారు. లాటీదెబ్బలు తిన్నారు. జైళ్లకు పోయినారు.

వీరు చదువుకొన్నది మున్ముందు ప్రకృతిపాఠశాలలో, తదుపరి "కింకవీంద్రులు" వీరి గురుదేవులు.

సహచర్యముచేసి తిరిగినది భోగరాజు, ఆంధ్రరత్నము, ఆంధ్రకేసరి మున్నగు నాయకోత్తములతో.

ఇట్టి సాంప్రదాయములలో పుట్టి పెరిగారు మా వేదాంతకవి వరేణ్యులు. వీనికితోడు వీరికి కుశాగ్రమైనబుద్ధి గురువు. పూజ్య పాదులు చెళ్ళపిళ్ళ వారన్నట్లు, "జన్మతఃకవివీఁడు సాహసికుఁడు తెనుఁగు తల్లికివీఁడు తెనుఁగు తండ్రి." ఈ వేదాంతకవ్యాయణము, బాల కాండలో యింకాఎన్నో ఉపాఖ్యానాలుండవచ్చు. కాని సంక్షిప్తగా యిట ప్రస్థాపించా.

ఇక పెరిగి పెద్దవారమైనాక ప్రప్రథమంగా వీరిని నేను విజయవాడ గాంధీపార్కులో చూచా, షుమారు రెండు దశాబ్దములకు పూర్వం. అప్పటికింకా మనకు స్వాతంత్ర్యంరాలా. పరప్రభుత్వం పరాకాష్ట వహించి యున్నరోజులవి మన మహానాయకులంతా స్వాతంత్ర్య సముపార్జనోద్యమంతో సతమతమౌతున్నారు. అప్పటికప్పుడే మన మహాకవిగారు ఏతత్ యజ్ఞగుండంలో యింధనమై, లాటీదెబ్బలు, జైలుయాత్రలుపూర్తియై, దేశ స్వాతంత్ర్యంకొఱకు పరితపిస్తున్నారు. నాటిరాజకీయాగ్ని (Political fire) యెంతగా మనకవిగారిలో ప్రజ్వరిల్లిందో ఆనాఁడు గాంధీపార్కులో, బహుప్రజాసమూహాముమధ్య వారుగావించిన యీ క్రింది ప్రబోధములుచూచిన తేటతెల్లమగును. ఇదివారి నిత్యదినచర్య.

ఒకనాఁడు సంక్రాంతినిగూర్చి పద్యం చెప్పమనగా:—

దానకళాప్రవీణతకు ధారుణిపైన సువర్ణహస్తఘం
టానిపుణాకశోభితదృఢవ్రతులైనసహోదరాళి సా
తానుల జేసి నెత్తిపయి దామ్రపుటక్షయపాత్రబెట్టి బి
చ్చానికిదించు సాములను చల్లనికాలమా! సాగనంపుమా॥

అని గంభీరంగాకంటల తరబడి ఉద్బోధించారు.

"బ్రిటీష్‌గయోపాఖ్యానం" అనే పేరుతో కొన్ని పద్యాలు వ్రాసి ప్రజనుజ్జూతలూగించారు. స్థలవిస్తరభీతిచే అందలి ఒక పద్యం మాత్రంయిట ఉటంకిస్తా.

చతురంబోధిపరీత భూతలమునం జంభారిసామ్రాజ్య పూ
జ్యతఁగైకొన్న మదీయప్రాణులకు భత్యంబింక లేదేమొ యు
ద్ధతుపాని త్తఱి గొప్పగా విసరి విధ్వంసంబుగావించు ప
ద్ధతివీక్షించు లేదె ఫ్రాన్సువిజయా! ధైర్యప్రతాపోదయా!

ఇలాగే సందర్భానుసారంగా యనేకపద్యాలు, గద్యాలు, నాటకాలు వ్రాసివినిపించేవారు ప్రజాకోటికి. వీటన్నిటిలో రాజకీయాగ్ని ప్రజ్వరిల్లుతున్నదనటానికి ప్రబలనిదర్శనం వీరు కాగితముమీాదవుంచిన ప్రతి అక్షరం పరప్రభుత్వపాశంలో చిక్కుకొనుటయే ఆంధ్రం కాదు భారతదేశం మొత్తం గర్వించవలసిన విషయమిది.

అక్కడికా ఆశ్వాసం అయిపోయంది. స్వతంత్రభారతి అవతరించింది. అప్పటి కప్పుడే మాకవిగారిలోని రాజకీయాగ్ని అర్ధికాగ్నిగా ప్రకాశించింది కమ్యూనిష్టురా బాబూ! వీరని వ్యామోహం ప్రబలింది ప్రజల్లో కొందఱు బుద్ధిమంతులకు. దీనికిఉదాహరణముగా యిట నెక్కువ వ్రాయపనిలేదు. వీరి తెనుఁగుతల్లి, కష్టకాలం, మొదలగు నాటకాలూ కావ్యాలూ నిర్బంధంలో లేక విచ్చలవిడిగా బహుళ ప్రచారంలోనున్న వే.

క్రమేపీ మాకవిగారిలో మతాగ్నిజ్వాలబయలుదేరింది. కాళీమూర్తిమంతంలోతానే "అమ్మ" అయినారు ఈసందర్భంలోకూడా నిదర్శనానికివారి జగజ్జనని, మాయిలువేల్పు, పావురాలు, వీటన్నిటికన్నమిన్న "కల్పతరు" వనెడి రామాయణగ్రంథం.

పైవాటినన్నిటినిబట్టి వారు పూర్వసంస్కృతినిదేశ, కాల, పాత్రలకనువైన సమన్వయముతో, త్రికరణశుద్ధిగా, విశ్వమానవగళంతో, అక్షరతపస్సుచేసుకొంటూ, విశ్వకళ్యాణప్రాప్తికి అవతరించి, అమ్మయై విశ్వమును తనలేఖినిచే ఉపలాలించుచూ ఉన్న మహామహులనుటలో ఆవంతయు అతిశయోక్తి కానము. అందుచేతనే మాగురుదేవులు విశ్వ

కళ్యాణముకకు అర్థికములు లయహేతువులుగావున అవి పనికిరావని ఉద్ఘోషించిరి.

తర్వాత మతసమన్వయమై విశ్వజనులందరు ఒక త్రాటిపైనడచినగాని మోక్షములేదని "భగవన్మత" మనునొకదానినిచూపిరి. వట్టి మాటలతోనేకాక చేతలలోకూడా యీ మతసమన్వయముకొఱకు ఒక మహమ్మదీయ బాలుని తనయింట్లో పెంచుకొంటూ కుమారునిగా చాటిరి ఇలాగేకొందఱు క్రైస్తవ బాలురకు చదువులుచెప్పించి, పెళ్ళిళ్లుచేసి, వారినికూడా తనయింట్లో తనతోపాటుంచుకొని పంపించిరి.

కావున తాను నమ్మినదానికై ఎంతటి సంస్కారమునకైనను వెనుదీయని శక్తి వీరికి కలదని తెలుచున్నది ఆ శక్తితోనే కవితా సంస్థానమును స్థాపించుకొని విశ్వపాలన కుద్యుక్తులైనారు.

ఎవరిలోనైనా ఒకవిశేషం ఆధిక్యతగా నుండనోపు. కాని వీరి విషయ మట్లుకాదు. పిన్నలో పిన్న, పెద్దలలో పెద్ద, కవులలోకవి, పండితులలో పండితుడు, నాటక కర్తలలో నాటకకర్త, నటులలో నటుడు, వక్తలలోవక్త, ప్రవక్తలలో ప్రవక్త, ఉపాసకులలో ఉపాసకులు, మాంత్రికులలో మాంత్రికులు, తాంత్రికులలో తాంత్రికులు, ఓకటేమిటి ఎటుమాచినా అటుపై చేయిమాదే అన్నమాదిరివ్యక్తి

ఇట్టివారిని సన్మానించుటయన్న మనభావి భాగ్యోదయమును, అభ్యున్నతిని మనము గౌరవించుకొనుటయే కాగలదు. ఇయ్యది సంకల్పించి దిగ్విజయముగా సాధించిన సిద్ధాగ్రేసరులకు నా అభివాదనులు.

ప్రభల రాధాకృష్ణమూర్తి.

కవయిత్రి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు, బాపట్ల.

శ్రీయుతులు కార్యదర్శిగారికి,

కవిగారి సమ్మానాహ్వానపత్రిక చేరినది. శ్రీ కవిగారికి సన్మానము చేయు మీ పూనిక చాలా ప్రశంసార్హమైనది సన్మానోత్సవము శుభాంతముగా నెరవేరునట్లు భగవంతు డాశీర్వదించునుగావుత.

ఊ. లక్ష్మీకాన్తమ్మ.

పురిపండా అప్పలస్వామి, కవితాసమితి అధ్యక్షులు విశాఖపట్నం.

శ్రీ వేదాంతకవి సన్మానసంఘం వారికి, విజయవాడ.

అర్యా,

శ్రీ వేదాంతకవిగారు సుప్రసిద్ధులు వారి సన్మానం తలపెట్టడం సంతోషంగావుంది. వారివంటికవులు ఎంతటి సన్మానానికయినా అర్హులు. ఈ శుభసమయంలో వారికి నా ఆశీస్సులు కాదు అభివందనాలు అందించండి

ఇట్లు
పురిపండా అప్పలస్వామి

## ప్రశంస

"అభినవ తిక్కన" శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

అప్పికట్ల

వేదాంతకవికి మహతీ - నాదాంచితవాణి కాంధ్రనాటక కావ్య
ప్రాదుర్భూతినిదానవి - భాదీపితమతికి జయముపల్కెదనర్థిన్
దేవీప్రసాదకృతసీ - తానల్లభకృతికి నాంధ్రతామూర్తికి బ్రా
హ్మవరివస్యావిస్మృత - జీవనునకునాయు వభిలషించెదనెడదన్.
కవిభాస్కరసమ్మాన - ప్రవణోద్యోగులకు సిరులుపండుతమెపుడున్
కవితామధుమత్తంబై - నవాంధ్రలోకమ్ము కమ్మవలకిమ్ముగుతన్.

తుమ్మల సీతారామమూర్తి.

## శ్రీ వేదాంతకవి ప్రశంస

కవిచక్రవర్తి శ్రీ దోమా వెంకటస్వామి గుప్తగారు, విజయవాడ.

వేదాంతకవి కవిత్వము
వాదాతీతమ్ముగాఁ బ్రపంచకమందా
మోదంబిడి-సజ్జనులకు
నాదాతీతమ్ముగాఁ దనర్చు నిజముగన్.

ఇట్లు—హితుడు
దోమా వేంకటస్వామిగుప్త.

# మ న వి

శ్రీ వేదాంతకవిగారిని చాలా కాలమునుండి యెరుగుదును. వీరి రచనలు అందినంతవరకు చదివినాను అర్థంచేసుకుని ఆనందించాను నాకున్న సామాన్యమైన భాషాజ్ఞానంతో నాకు తెలిసినంత వరకు, శ్రీ కవిగార్ని గురించి, కవిగారు రచించినవాటిలో విశేషాల్ని గురించి పద్యరూపంలో వ్రాసి, ఈ సన్మానమహోత్సవ సందర్భంలో హృదయపూర్వకంగా "మనోహరాలు" సమర్పించుకుంటున్నాను—

విజయవాడ. 1
26-10-55 } బి. ఎ. రాజు

# మ నో హ రా లు

కవివై! నాటకకర్తవై! అతి చమత్కారుండవై! వక్తవై!
యవధానంబులతో విమర్శకుడవై! యానందభోజుండవై!
చవులూరించితి వాంధ్రలోకమున సాహిత్యారామ లింగండవై!
వివిదార్థప్రభలన్ నిరంకుశుడవై! వేదాంతకవ్యగ్రణీ!

వ్రాసినాడవు మహావాక్యాలు ప్రజలలో
విజ్ఞానపుష్పాలు-విరియగ బూయ
వ్రాసినాడవు కావ్యరాజంబులెన్నియో
రసములూరించి, నీరసముబాయ
వ్రాసినాడవు వ్యంగ్యభావగర్భితమైన
కథలు గేయములన్ని-వ్యథలుబాయ
వ్రాసినాడవు జనరంజకంబైన నా
టకములు, దేశకాటకముబాయ

వ్రాసితివి కిలార్నె ట్టెల్ల-రసికులూర
వ్రాసితివి కల్పతరువు శ్రీరాముఁడలర
వ్రాయుచుంటివి, యింకెన్నొ వ్రాయగలవు!
వివిధ రసకాంత వేదాంతకవివసంత

ప్రతిపదమందు భావములపార రసమ్ములు కుల్కి-వల్కఁగా
శ్రుతులను మేళవించి ధ్వనులింపుగ మీాటి స్వరమ్ము బాడిన
ట్లతిమృదు మాధురీ కవనమల్లి మనోలత పల్లవింపఁజే
సితివి కవీంద్ర! యింతటివిచిత్ర కవిత్వమదెట్టులబ్బెనో! ?

మనమందెంతయొమెచ్చి నీదుకవితా మాధుర్యమ్ముల్ గ్రోలి, యీా
ఘనసన్మానము జేసినారు కవిలోకమ్మెల్ల కీర్తింప! ని
న్ననయంబున్ గొనియాడుఁగట్టుగ విశుద్ధానంద విశ్వాత్మవై,
వినిపింపంగదె నవ్యభవ్య కవితల్ వేదాంతకవ్యగ్రణీ!

అల్ల దె! చెళ్ళపిళ్ళకవి యాత్రముతో దివినుండి ముందుగన్
చల్లని దీవెనల్ సలిపి "నాప్రియ శిష్యుఁడవీవెరా" యటం
చుల్లముపల్లవించు విజయోక్తులు బల్కి, సుపర్వకోటితో
జల్లెసుమాక్షతల్ కవనశౌర్య విలాస రసాభిషేకముల్.

ఆంధ్రావనీకేంద్ర మింద్రకీలాద్రి నీ
ఘనకవిత్వము మెచ్చి-ధ్వనులనిచ్చె
కనకదుర్గాదేవి-కరుణాధురీణయై
కనకవర్షమునిచ్చి-కఱవుదీర్చె
మల్లికార్జునసామి-యుల్లంబురంజిల్ల
శివతాండవము జేసి- చిక్కుదీర్చె
కృష్ణవేణమతల్లి-కిల్బిషంబుల బాపి
చిరునవ్వుజల్లుపై- చిలుకరించె

ఈవిజయవాడ సన్మానమిచ్చి కొలచె
భువి "మహాకవి" వీవని-దివినిబలికె
ధన్యుడవునీవు కవిలోకమాన్యచరిత
ఎవరు నీసాటి వేదాంతకవి యనంత!

చాదస్తుఁడని, చంచలాత్ముఁడని, వాచాలుండడటంచింక నీ
ర్ల్యాదాష్ట్యుండని, దుర్మధాంధుడని భాషాజ్ఞాన శూన్యుండ వం
చేదేదో బిరుదంబులిచ్చిరిగదా హెచ్చైన మర్యాదతో
యేదేనొక్కటి నిల్పుకోవయితివే మీ ఆంధ్రబెర్నార్డుషా! ?

పంతముబట్టినిన్ను పదభ్రష్టుని జేయదలంచి, యెన్నియో
వంతలపాలుజేసి, బలవంతముగా పడగొట్టి యీడ్చినన్
వింతగలేచితిప్పుడు కవిత్వపటుత్వ మహత్తుతోడ! వే
దాంతకవీంద్రచంద్ర! జదదంబకు నీగళమెంత తీపియో! ?

పిచ్చికవిత్వమల్లుకొని వీధులవెంబడి వాగుచుండు వా
డచ్చుగ విద్దేహీనుడని" యాడిన మాటలువింటిమున్ను, నే
డిచ్చట తానునిల్చిన స్థుతించుచు స్వాగతమీయగంటి, నా
కచ్చెరువయ్యె, నింతటి మహాకవి నెందుకు వెక్కిరించిరో! ?

ఎంతమహాత్మునైన నవహేళన జేతురుజాతివారె! ఆ
వంత విదేశమాన్యులు "మహాత్ముడటంచును బల్కినంత నే
గంతులువైచుచున్ ప్రభలు గట్టుదురప్పుడు గొప్పగాను! వే
దాంతకవీంద్ర! నీకిపుడయా యుగమే సరితూగలేదయా!

కష్టములెన్నియోబడుచు కాల ప్రవాహము నీదుకొంచు, యే
ముష్టికిచేయిజాచక ప్రమోద మనస్కుడవై కవీంద్ర! యీ
సృష్టివిచిత్ర భావములనెంచి నిరంకుశదృష్టితో మహా
స్రష్టగదేలినాడవు విశాలరసాల ధరాతలమ్ముపై!

పుట్టున్ ధీరుడు జాతికోవిదుడు సంపూర్ణాంతరంగంబుతో
చెట్టాపట్టము వట్టుకొనడి జగాలెట్లందరిన్ గల్పుచుఁ
పుట్టల్ త్రవ్వి మహోదయంబునకు తల్పుల్ దీయుచెల్లప్పు! నీ
ఘట్టంబట్టులె చోచె నామదికి నికఁబాంధ్ర బెర్నార్డుషా!

లోకాలేలెడి కాళికాజనని నీలోనుండి యెల్లప్పుడున్
నీకాయుష్యము భోగభాగ్యములతో నిర్నిద్రయై యిచ్చుచుఁ
లోకశ్రేయముగూర్చి పెంచి మరియేలోపంబులేకుండ వా
ల్మీకి శ్రీ విభవంబు నీకిడెను స్వామీ! ఆంధ్రబెర్నార్డుషా!

## నతులు - నుతులు - కృతులు

విద్వాన్ షేక్. దావూద్ సాహెబ్, హిందీపండితుఁడు.
ఉస్మానియా కళాశాల, కర్నూలు.

స్తన్యంబిచ్చిన మాతృగౌరవము విస్తారమ్ముగావించుచున్
ధన్యంబైనది మామకాంధ్రము కవీంద్రా! ఆంధ్రచూడామణీ
యనాల్యాలోకనరామణీయక విలాసోత్సుకవిద్వత్సభా
విన్యాసంబునఁ బూజలందితివి శ్రీ వేదాంత విద్వత్కవీ.

2

ఆశీర్వదించు వేదాంతకవీ చంద్రమౌళిమంత్రియశోప్తి మనఁగదయ్యా
దీవించు దీక్ష సంజీవాఖ్యయువమంత్రియశస్తతల్ భరియించియలరుమయ్యా
వినుతింత్రుసత్కవుల్ విమలవాణులతోడ నానందమునదేలియాడుమయ్యా
తనియింత్రు వివిధవిద్వత్కోటులిప్పట్ల గురుగౌరవంబునన్ వరలుమయ్యా
ఆంధ్రదేశము నినుబోలునట్టి కవుల
గన్నకతమున ధన్యతం గాంచెనయ్యా
నిత్యతృప్తి ప్రసిద్ధియు, సత్యరక్తి
గాంచి వర్ధిలు వేదాంత కవివతంస.

3

అనఘా! యెంతటి జ్ఞానదృష్టి "కవితాయద్యస్తి రాజ్యేన కి"
మ్మనువాక్కుల్ ఋషిసత్తముల్ నుడివిరో యామాట లప్పట్టునం
దనుభూతంబగు సత్యమై కవివరేణ్యా! రాజులున్ మంత్రులున్
నినుఁ బూజించుచు గౌరవింతురిదిగో నెత్తావి తేకెత్తగన్.

4

తెలుఁగుందల్లిని గష్టకాలమును దృష్టింగూర్చ సృష్టించి యా
కలిమంటన్ వివరించు రూపకములంగల్పించి దిగ్దేశ ని
ర్మలకీర్తుల్ దెలుఁగు ప్రదేశమునమేరల్ మీరు సన్మానపూ
జల వేదాంతకవీ గ్రహించితి విశిష్టప్రజ్ఞలం జాటుచున్.

5

అంతములేని గౌరవము, నార్యు లమాత్యులుగూర్చ నేడు వే
దాంతకవిప్రభూ! ప్రతిభదాల్చి గ్రహించితి జన్మసార్థకం
బింతకుఁ జాలు నీకవితకీయెడఁ జక్కని పీఠమబ్బె సే
వింతువుగాతఁ బూర్వకవి వీరులసద్యశముం బ్రభావమున్

6

అనుపమశక్తితో సమయమారసి సంఘము మేలుకొల్ప ని
ష్ఠను నెలకొల్ప సజ్జనుల స్వాంతములం గిలిగింతగొల్ప హృ
త్ప్రణయము సౌకుమార్యము విరాట్ప్రతిభల్ చిగురింపఁగ్రైతల
ల్లిన మొనగాఁడ! నిన్ గవుఁగలిగించుయశమ్ము ననుగ్రహింపుమీ.

7

చిరుకబ్బంబులగూర్చు మంత్రికవి సంజీవాఖ్యుఁడుం బాలనా
భరముందాల్చిన చంద్రమౌళియును గూర్పంబీర మాశాంత వి
స్తరకీర్తుల్ కవిపండితుల్ సతతదీక్షున్నిన్ను దీవింప భా
స్కరతేజంబునఁ బూజలందుము కవీశా! యాంధ్రచూడామణీ

8

కమ్మగసాగు నీ సభ యుగమ్ములనాటి చరిత్రలందు జీ
వమ్మిడుగాత! యీవిధిసభల్ దెసలం బ్రసరించుతం గవి
త్వమ్మున కాదరార్ద్రవిధ వైకవిశిష్టత లబ్బుతన్ స్వదే
శమ్ము గవిత్వవాసనల, శాశ్వతరక్తి గహించుగావుతన్.

9

జయమీసభకు లభించుత
జయమీ వేదాంతకవికి సతతంబగుతన్
జయమాంధ్ర భారతికి ని
శ్చయముగ లభియించి భావిచరిత వెలయుతన్,

ఇట్లు
"విద్వాన్" షేక్ దావూద్ సాహెబ్.
**హిందీపండితుడు, ఉస్మానియా ఉన్నతపాఠశాల, కర్నూలు.**

## నమస్కృతి

ప్రౌఢకవి, శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు, తెనాలి.

నిను దీవించుటయెట్లో
యనుపమ వాగ్దేవతామహాకృతిఁ బట స
జ్జన జని కారక త్రిజగ
జ్జనని వట నమస్కరింతు సాహిత్యధునీ!

నీ కన్నుంగవ సోఁకుదాఁక సెగదాఁ కిద్దాఁ జగా కావ్యపు
న్వాకిళ్లం గల రంగవల్లులు గుణ వ్యాజమ్ములో నిల్చుటల్
లోకమ్మంకుఁ దమస్సులున్ రవికరాలోకమ్ము పై సోఁకునం
దాఁకన్ గాదె సుఖమ్ముఁ జెందుటలు వేదాంతప్రబంధప్రసూ!

తగునయ్యా! సుకవీ! సమిద్ధము జగత్కల్యాణ రేఖాప్రద
మ్మగు నీకోపము నొక్క దివ్యరమణీయస్వాదు వేయూట యి
జ్జగతిన్ రమ్యతమమ్ముగాదె విలసత్సౌగంధ్య లోకం పృణ
మ్మగు కాలాగురుమూర్తిలోఁ గల యసహ్యమ్మైన కారిన్యమున్.

గిరిపైఁ దట్టునొ యబ్ధియుట్టఁ గునొ కృష్ణాభ్రమందో మహో
ర్వరకున్ గ్రిందో సురోర్వియందొ ఫణివిశ్వమ్మందొ నీదౌ జగ
ద్గురు దర్భాసన మెచ్చటన్ నిలిపియుందో విశ్వవిశ్వాంత రా
ళ రహస్యమ్ము లెఱింగి భవ్యకృతు లల్లన్ గావ్యకృద్ధీమణీ!

కొలుతువు గీముగీము పలుకుం జెలిమేల్జిలుగంచుఁ గుచ్చెళుల్
విలుతువు వాడవాడను ద్రవించెడి క్రొంజరువైన చెమ్మటల్
నిలుతు వయశ్శిలల్ గురియు నిప్పులవాన కకంపితాద్రివై
గెలుతువు నేఁడు కావ్యవిజిగీషులగద్దె జగద్గురుండవై.

వేదాంత సుకవి! నీదగు
వేదాంతము నచ్చదొక్క విశ్వశ్రేయో
వాదులకున్ సాదులకున్
బీదలకుంగాక మెట్టవేదాంతులకున్.

బొడ్డూడని పసికందు లె
దొడ్డ గజమ్మెక్కి తిరుగ ద్రుహిణాండమె పై
పడ్డం దొణఁకని పందెపు
బిడ్డకు నీకొప్పవే కవీంద్రసమర్చల్.

ఇట్లు
అమ్మిశెట్టి లక్ష్మయ్య
సీనియర్ తెలుగుపండిట్
బోర్డు హైస్కూలు, తణుకు.

## సరుకున్న కవి!

కవిపాదుషా. శ్రీ కొప్పరాపూరి సత్యనారాయణగారు, విజయవాడ

ఓ వేదాంతకవీ ! కవి
తా వేదాంతసముతాసుధార్ణవ జనతా
భావాల ప్రచారకగొను
మా వందనములు జయజయ మంగళనాదాల్.

పోతనధార నైషధముబోలుకవిత్వము తిక్కనార్య సం
జాత విశిష్టలక్షణము స్థాయితెనాలిది భీమధైర్యమున్
నూతకవీంద్రఫక్కిగల సూక్తులు వేంకటశాస్త్రి లాక్ష్య వి
ఖ్యాత సుశబ్దసంచయప్రకాండుడు పెద్దన శంభుపుత్రుడా.

సరుకున్నకవియెరా సన్యాశికాదురా
ఆవేశమన్నదే అణచియుంచె
తెలుగుతల్లికి పీడు తిని తిర్గకొడుకురా
మోసాలులేనట్టి మీసగాడు
గొప్పగొప్పోళ్ళని చెప్పుకొనేవారి
త్రిప్పికొట్టుచొఱ పీరితప్పులయ్యొ
భాషలో, ధారలో, భావమ్ములో ధ్వని
లో సాటియెవ్వారు యీ సమాజ

మందు పంచదారనుబోలు మధుర మధుర
కవితలల్లంగ వేదాంతకవికిపోటి
ఆంధ్రదేశ గడుగ్గాయియైప్రశస్త
వాగ్ఝరీనేత ప్రజచేతవరలుభ్రాత.

కవులలో నీకున్న కడుపెద్ద యౌదార్యము
ఫలితంబు ప్రజలలో పామ్మప్రేమ
కవితలో నీకున్న గడుసుతనమె గార
వానికి నిజరాజబాటచూడ
సవిమర్శసందర్భ సంపాదనమ్మె నీ
సన్మాన సద్భాగ్య సంచయమ్ము
రిపుసమూహాల నారించు నీధైర్యమే
సాటిలేనిది మేటికోటగోడ.
సంకుజేయకు మొగతాళిజనులసోది
ప్రజలుచదువంగ వినగపరమసుఖావ
లమ్ముజెందగా తగసాగనిమ్ము రచన
విజయ వేదాంత కవికాంత విశ్వశాంత.

కొప్పరాపురి సత్యనారాయణ.

## వే దాం త క వీ !

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు, పామర్రు.

నాటకసమాజమొక టేర్పాటొనరించి పిదపఁ జనిపలుతావులనున్
నాటకమాడించి నుతులు గాటముగాఁ బ్రజలచేతఁ గాంచితిసుకవీ !
చెఱకేగితి చిన్నప్పుడె నరనుతుఁడగు గాంధిమాటనమ్మి మనసునన్
ధరణీజనుల సుఖంబును విరివిగ భావించి నీవు వేదాంతకవీ !
అబ్బురముగలుగుపగిదిం గబ్బంబుల నెన్నొ వ్రాసి కవిజనములకీ
వుబ్బును జేకూర్చితనుట దబ్బరగాదయ్యె సుకవితాపారీణా !
పండితలోకాఖండల మండితమై సుజననికరమహితంబై యు
ద్దండకవీంద్రకలితమగు నిండుసభన్ గౌరవంబు నేఁడొందితివో.
కరిపై నెక్కెడిభాగ్యము దొరకునె? యెందఱికి సుకవిధూర్జటులయినన్
దొరకెను నీకీభాగ్య మమితముగు శుభంబుగాదే వేదాంతకవీ !

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు.

## శ్రీ ఆంధ్రబెర్నార్డ్‌షా వేదాంతకవిగారి
## సన్మానోత్సవ శుభసమయమున అర్పించబడిన
## పంచరత్నములు

కవయిత్రి. శ్రీమతి గుడిపూడి రాజేశ్వరీదేవిగారు, చిలకలూరిపేట.

ఓమహనీయ! మీకవితమోసులనెత్తి నటించి యాంధ్రలో
కామితమెల్లదీర్పనవ కావ్యవిలాసవినూత్న జోతులన్
మా మనమందునిల్పె మధు మాధురిజొప్పించుతేనెవాకయై
సామరసంబుతోడనిదె సాగిలె పండితలోకమోకవీ

పాడెను రోళ్ల రోకలుల పాడెను నీకవితాప్రభావముల్
పాడెనుయాంధ్రలోకమిదె బాడెనునూయెలలూగు పాపలుం
పాడెనుబాలవృద్ధులదె పాడెను మేలని బాహ్యలోకమే
పాడగవ్రాయుమింకవరి పాలనజేయుచు కావ్యకాంతనున్.

కావ్యంబువ్రాయుట ఘనుడంతెయందునా
గానంబునెఱిగిన గాయకుండు
గాయకుండంతియే ఘనతేమియందునా
నవరసభావనా నటకుడౌను
నటకావతంసుడే నాకౌంబికేమన్న
మధురవాగ్ఝరిగల్గు మందహాసి
మందహాసియుగాని మహిమేమిగలదన్న
కాళీప్రసన్నంబు గలదటంద్రు

బాగడనేర్తునెనిన్నోప్పలు పురుషమూర్తి
సాగిరమ్మింక వేళాయె స్వాగతంబు పే
వేగదెచ్చిరి యువిదలు వేడుకలర ంకీతులునగు
ఆగనేటికి కవిరాజ హారతిద్దిగో

ఎందఱులేరుకావ్యములనేర్పడవ్రాసినవారలాంధ్రలో
అందిరెకొందఱేనిమునుపందగరానివిశేషస్వాగతం
బందితపీవ మేటియయి అందుమ కావ్యకళాగ్రసూనసం
బంధితపుష్పహారమిదె యందుమ యాంధ్రబెర్నార్డుషాహావై

తేటతెల్గున గీతికల్ తేనెలూర
నాటజేసితిహృదయాల నీటుగాను
సాటినీకేది నవ్యాంధ్రసాహితందు
కోటిదీపాలహారతి కోరియిత్తు.

కవిగజముల కనుసన్నల
మన్ననొందు మహనీయుడ
అర్హమగునో కాదోదెలియ
అర్పింపగవ్రాసితంతె
కవనమనే కలిమిలేదు
కానిమనసుఆపలేను
పొంగిపొరలిభంగముగతి
చెంగలించిచేయికదిపి
నాచేతలకలమునునిచి
నన్నెవ్వరోవ్రాయించిరి
ఆదరించి ఆహ్లాదితులై
అందుకొనుమచిన్నికానుక
న్న చెల్లిముద్దుకానుక
ల ఙగుజిమ్ము దివ్వెసుమా

జి. రాజేశ్వరీదేవి

## సత్కవీ!

మును శ్రీనాథునకూడిగమ్ము సలిపెన్ మోదమ్ముతాశి పాణియం
చును వాదించిరి పెద్దలెల్ల రదియే చోద్యంబుగాదోచు భ
ర్గునియిల్లా లెనలేని ప్రీతి సమకూర్చున్ మీకు సర్వమ్ము; లే
దనుమానం బిసుమంత, సద్గుణవిభూషా! ఆంధ్రబెర్నార్డుషా!

2

కమ్మని భావగర్భితముగా రచియించు కవిత్వశైలి నా
ట్యమ్మొనరించు పాఠకహృదంతరసీమల; నవ్యదివ్యమా
ర్గమ్మునసాగి హర్షజనకంబగు; నిట్టి మహాత్ముల్, మెల్లలో
కమ్ముల నేలు అంబకృపగా కొ కటున్నదె దెల్ప సత్కవీ?

3

ఓ సుకవీంద్ర! తావక మహోజ్జ్వల భావతరంగపంక్తుల
గ్రాసనమందుకొన్నవి నవాభ్యుదయాంధ్ర ధరాతలంబునం
దీసుదినాన; పండిత కవిప్రముఖామలహృద్యపద్య సం
దేశములందుకొమ్ము భవదీయ యశోలత మింటికంటగన్.

"షేక్ ఆలీ"

కావూరు, నరసరావుపేటతాలూకా.

## కిరన్ సోదరులు, పెంటపాడు.

శ్రీ జగజ్జననీ వరప్రసాదకవితా ప్రపంచ సామ్రాట్టులును, కవి దిగ్గజాహంకార ఘీంకార మర్దనాసామర్థ్యగర్జన ప్రవర్ధమానోర్వీ నృసింహామూర్తులును, "ఆంధ్ర బెర్నార్డుషా" బిరుదాంకితులునగు వేదాంత కవీంద్రుని చరణకమలాలకు సమర్పించు

# భక్తి కిరణాలు

శ్రీ కిరన్ సోదరులు : పెంటపాడు

నీకావ్య మందాకినీ తరంగాలు మా
తూగుటుయ్యాల శయ్యాగృహాలు
నీకావ్య శ్రావ్యధ్వని మృదంగ సంఘాలు
అమృతాంశు మౌళీశు ఢమరుహాలు
నీకావ్య పదజాల నిగమాతుగశ్రీలు
అభ్రశుభ్ర జ్యోత్స్నతాప్నగసలు
నీకావ్య గీర్వాణి నిర్మాణహార్మ్యాలు
విశ్వకళ్యాణ రామేశ్వరాలు
దివ్యకవితా ప్రపంచము దిగులువడెడి
యింత వేదాంతకవి వైజయంతిశిల్ప
కళలు దిగ్భ్రాంతిఁగొలుప సంక్రాంతి సలుప
వచ్చితిమి భక్తికిరణాలనిచ్చి గొలువ.

శిల్పసౌందర్య కిరణాలు చిదిమిపోసి
కల్పతరువును యిలువేల్పు కావ్యమను
సృష్టిఁజేసిన నీ కళాపుష్టిఁజూడ
వేడ్కతో వచ్చె రసికులు విజయవాడ

ఇట్లు
కిరన్ సోదరులు

## కవీ: కానుక

చలనంబందవు కొండపైఁబడిన దీక్షాఖడ్గహస్తుండవై
నిలువంగల్గిన వీరమూర్తివి ? భవానీదేవి ప్రత్యక్షమై
కులికించున్ దొలికించు నీ పసిఁడిపల్కున్ గాన నిం కెవ్వ రీ
విలువం గాంచఁగలారు, ధార్మికమణీ ! వేదాంతకవ్యగ్రణీ !

2

పులకించున్ దిలకించినంతనె జగంబుల్ – నీ గడుగ్గాయి చూ
పుల నీ చిన్నరసాలచూపుల – జయంబుంగొన్న నీ దండయా
త్రల నీ తెల్గుపవిత్రి పావనచరిత్రన్ వెల్గుచున్నట్టి పా
త్రల – వేదాంతకవీంద్ర! ఆంధ్రజనచంద్రా! యెంత ధన్యుండవో ?

3

కలముంబట్టినదాది నేటికి సమీక్షాక్షాత్రమున్ దాల్చి తె
ల్గుల కాహ్లాదముఁగూర్చినాఁడ వొక వెల్గుంగల్గఁగా జేసి – ఈ
యిలనైనన్ గలనైన నీ కపజయంబే లేదు లేదో మహో
జ్జ్వల మేధానిధి! నీ పవిత్ర కవితాసంస్థాన ముప్పొంగెడున్.

కన్నెకంటి వీరభద్రాచార్యులు.
(పల్నాటి సోదరకవులు-పిడుగురాల)

## కవీంద్రా !

"కవిరత్న-ఆంధ్రభాషావాచస్పతి" శ్రీరామ్ వీరబ్రహ్మకవిగారు,
విశ్వజ్ఞ గ్రంథనిలయమ్, మచిలీపట్నం.

సంస్థానాధిపులు కవుల నాదరించుదినములలో మహాకవులు తమకవితాప్రతిభను జూపి, ఘన భూదానాదులందియుండిరి. అట్టియెడ-గర్భకవిత్వము, బంధకవిత్వము చెప్పి తమ ప్రతిభలను జూపుచుండిరి. ఆనందగజపతి మహారాజులుంగారు ఇట్టికవితకు గొప్ప భూదానమొనరించియున్నట్లు చరిత్రలు దెలుపుచున్నవి. అట్టి భూరి దానమునే తమరు గావింపనున్నందున శ్రీ వేదాంతకవిగారి పక్షమున నేనీ గర్భకవిత్వమును బంధమును నొకటిగాజేర్చి, యొక పద్యమునే గర్భ-బంధరూపమున రచించితిని. చిత్తగింపుడు.

శ్రీమీార రసికజ నామోదమయిన నా
యకులు, గడుగ్గాయి యనెడికృతులు
ముద్దులొకి- మనోజ్ఞమున్ వేడ్క-గొల్పు కా
వ్యములును గరము ముదాంబురాశి
మగ్నులై సంతతా మందహర్షముగూర్చు
మహనీయకవితా విమర్శనిధివి
ఆంధ్రబెర్నార్డుషా యనుబిరుదంది నీ
వనుపమసత్కీ-ర్తి కునికిపట్టు
వయితివి కవీంద్ర ! విజయములలరి వెలయ
అతులితాధిక విభవముల్ సతముగనుక
మనుచుత జగన్నియత మిమ్ము ననుదినము, ద
యయును, ప్రేమయు ఘనముగ నానహీలంగ

ఇట్లు
శ్రీరామ్ వీరబ్రహ్మకవి.

# సు వ ర్ణాం జ లి

విద్వాన్ శ్రీ రాళ్లభండి సుబ్బయ్యగారు : గుడివాడ.

తేట తెనుంగుఁదేనియల, తియ్యఁదనమ్మును గ్రోలఁజేసి యీ
నాటి తెనుంగుసోదరులఁ నవ్యసముజ్జ్వలభావ వీచికా
కోటులనూయలించు నవకోమల కావ్యకళాప్రకల్పనన్
మేటియటంచు నీకలము మెచ్చెదనిచ్చెదమన్నమస్సులన్

వేదాంతవీధిలో, విహరించి యాత్మాను
    సంధానమొనరించు జ్ఞానశక్తి
అసమానధీశక్తి యెసలార్చుకావ్య ని
    ర్మాణనైపుణ్యసమ్మాననగరిమ
ధారాళవాగ్గుంఫితారమ్య రచనా ప్ర
    వచనాతి చాతుర్య పాటవంబు
శ్రోతలబట్టి యుఱ్ఱూతలూగించెడు
    భావప్రకల్పనా ప్రబలపటిమ

వెన్నతోడుతఁ బెట్టిన విద్దెలేమొ
నీకు వేదాంతకవివరా! నెమ్మిగొనుము
నాయొసగు సువర్ణాంజలి నయముమీఱ
గవిత కమనీయ సత్కృపా కరుఁడవగుచు.

కింకవిలోక మత్తగజ కేసరియన్ బిరుదమ్ముగొన్నయ
వ్వేంకటశాస్త్రి వర్యుకడ విద్దెలునేర్చిన భాగ్యశాలివీ
వింకరచించు కైతలను నిట్టిదియట్టి దటంచు మాదృశుల్
వంకలువెట్టి చూపఁగల వారలె? నిక్కముగా మహాకవీ!

ఇట్లు, భవదీయుడు
రాళ్లభండి సుబ్బయ్య

## కా ను క

శ్రీ పెదపాటి నాగేశ్వరరావుగారు, చిలకలూరిపేట

1

ఓంకారపంజరశుకీ,
శాంకరి, సుగుణాకరసుర సన్నుత చరితా
లంకార, భవస్మార్యా
లంకారిణివై కవిత్వ లతల బెనుచుతన్.

2

కవితలో నేర్పు, సువిమర్శకత్వ ప్రగతి
లోన నీతీర్పుకుకవి కల్లోలితాంధ్ర
ఘోషకోర్పును నిచ్చును; ఉన్నతాంధ్ర
కవికుటుంబాన నీకీర్తి గ్రాలు చిరము.

3

అల తెలంగాణ మాగాణమందు, గౌత
మీ తరంగపయశ్ఛటల్ మెలగు నేల
మీద, సర్కారుజిల్లాల మేటిభూమి,
పూత రాయలసీమలో, నాతతముగ
నీదు కవితాలతాపుష్పనిచయమునకు
వ్రాలుచున్నది రసికులన్ భ్రమర గణము.

ఇట్లు
పెదపాటి నాగేశ్వరరావు
చిలకలూరిపేట

# కృతజ్ఞత

విజయశ్రీ కరుణశ్రీ
ధ్వజవజ్రాలయ జగద్ధిత కనకదుర్గా!
అజరామర కవనశ్రీ
సుజనామోద ప్రసూనశుకపికవర్గా!

2

భారతమును గుదించి గీతము రచించి క్షీరసాగరము నూగించి నతని
వ్యాసవాల్మీకమ్ము మాసమ్ములోపల మూసక్రొవడి తీర్చబోసి నతని
వేయిపడగలు విప్పి వినోదముల చూపి నదులకొయ్యారమ్ము లిడినవాని
జడకుచ్చులకు చిట్టిజడకుప్పెలను గట్టి తెనుగుచామంతి ముద్దిడినవాని
కృష్ణపక్షగానమ్ము చేయించి నతని చిన్నిసౌందరనందమ్ము లన్ని నతని
అందఱికి శంకరస్వాములైనవారి యీపదాంధ్రభువనము సౌఖ్యముగ మోసె,

3

అభినవతిక్కన్న కవులతిక్కన్నకు కనకదుర్గాకటాక్షమ్ము గొలిచి
దోమసామికి తెన్గుదొర రామసామికి కృష్ణవేణీజయరేఖ లిచ్చి
యువకవిరాజు కవిదిగ్గజానికి నింద్రకీలాద్రి మహిమములొసగి
బుచ్చిసుందరునకు సచ్చిదానందుని కైశ్వర్యహర్షమ్ము లన్ని జూపి
ఊటుకూరేటుకూరు ముమ్మాటు దలచి ఉమ్మరాలిపాకవి మాని సన్నుతించి
కరుణశ్రీ కిరణమ్ములు గ్రాలజేసి ఇప్పుడాంధ్రజయస్తంభమెత్తిరయ్య.

4

కల్పాటికృతికన్య కొల్పాటిచీరతో ముద్దుమాటలుగట్టి మురియుచుండ
రాయలాంధ్రకళాపురంధ్రి వజ్రాలతో మేలితొడవులు సుమించుచుండ
ఘనతెలంగాణా కవనరాణికలుకతో పట్టుతివాసీలు పరచుచుండ
సర్కారు గీర్వాణి సర్కారువితలుకతో సింహాసనంబెక్కి చెలగుచుండ.
ఈ విశాలాంధ్ర రాజ్యలక్ష్మీవిలాస వనవిశేషప్రభావమ్ము పరిఢవిల్లి
నాల్గుదిక్కుల కెగదన్ని వెల్గునాడు కవిచరణము పట్టని మొనగాడు లేడు.

5

దోసెడురత్నముల్ కనకదుర్గకు దెచ్చితి కేరనీయుడం
బాసలుపెట్టి చొచ్చితి విరాళులు గొల్చెడి పద్యరత్నముల్
వోసితి తెల్లవోయి ప్రజముట్టడి పైబడి మోసకారినై
ఈసభలోన బట్టువడితేను మఱేమి బహూకరింతురో.

6

కేవాకకోతినై కొంటి నిప్పులలోగల జీడిపప్పు లే
దేనికరమ్ము పట్టుకొని తీయదొడంగితి దీనికింత వ
హ్వా! ననునిల్వనెత్తె బెజవాడపురంధ్రి విశాల విశ్వ సం
స్థానకపీఠగజమ్మునకు సంచులుకోసి మ తెంత మెచ్చునో.

7

పురిటిమంచమునుండి యరటిపిల్కలందీసి వంశవృక్షము పాటపాడినాడు
పల్కరాడెడిమాట చిల్కపల్కులుకేసి వాఙ్మయ బ్రహ్మపేర్వడసినాడు
అరిసెమొగముచూచి మురిసివెన్నెలకాచి వెఱ్ఱిపడుచు లేని జాఱినాడు
కపటరాక్షసులకు త్రిపుటతాళము వేసి వారిచెప్పులుమోసి బ్రతికినాడు
వీడు చేసిన ఘనకార్య విజయమేమొ విశ్వమోహన సౌందర్య విభవమేమొ
యించుకాగడాకేనియు కానరాదు ననుమహాకవియనుకొన్న నాన్నలార.

8

గ్రంథముపూర్తిగాజదివి ప్రశ్నలుకొట్టినవాడగాను దు
ర్గంధముకొట్టుచున్న చెడుకాయను పోచె డిపిచ్చిచెట్టునై
గంధపుచెట్లమధ్యను సుగంధము కొట్టితినేమొ యీ జగ
ద్బాంధవులెల్లదానికి గదా నను నేనుగు నెక్కనిచ్చుటల్.

9

అంబరవీధినుండి విలయమ్ముగ దూకెడి బాకిదారుపై
నంబకటాక్షలేశమున నల్లెడి పద్యముగూడ రెండు పా
దంబులె పూర్తియై పిదప లేటుక యప్పులవాని రెండు పా
దంబులు పట్టినట్టి కవితల్లజుడీతడు సత్కరించుడీ.

10

ఇచ్చుట అచ్చటేమి వినుడీ! బహుమానములెన్ని సంచులో
తెచ్చి కవీంద్రపాణిరిగడేయని చెప్పెడి నాదవాక్కులో
మచ్చునకేని యొక్క యవమానము సల్పినజాడకూడ వా
క్రుచ్చెడి వాడనేని కవికుంజరుడంచిక నన్ను మెచ్చుడీ.

11

పిల్లకు నీడునచ్చి మురిపింగొడి యౌవనరాజధానియై
యుల్లరికిన్నపైడదగ నింక మహూర్తము పెట్టి పెళ్లి యే
పిల్లడకేని యిచ్చి జరిపించనిదే చననీయనట్లు నా
పెళ్ళినిచేయకే వదలిపెట్టరు నాబహుమానమెట్టిదో.

12

సిరులొల్కించెడి లేఁతపచ్చతళుకుల్ సింగారమై మోహనా
క్షరరాజీవదళాయతాక్షి కవితాకాంతార విద్యుల్లతా
హరిణంబై మఱి వేటకాండ్రగురిపాలై చర్మమై యొడి యి
త్తరి కృష్ణాజినమయ్యె పెద్దతలలద్దానిం ధరంవేయఁగా.

13

ఈఁగల కెక్కలే మఱిపు డీగలు నెక్కులుగాఁ దయారులై
వేగి ధరాతలమ్ము వినువీధి ఫిరంగులు మారుమ్రోఁగి వి
ద్యాగళమెంతయోపగిలి తాండవమాడె చతుస్సముద్రముల్
చాగము నేఁడు లేనపుడు సాములు సాముల ? గడ్డివాములా?

14

మాటసహాయమైన బహుమానముగా దయచేయుఁడయ్య ము
క్కోటి సుపర్వరాజబుధకుంజరులార! రసజ్ఞులార! యె
చ్చోట పదమ్ము వెట్టినను చుట్టఱికంబులు భాగ్యమయ్యె నా
నాటికి దివ్యకావ్య భువనంబులుకూడ కృశించునేమొకో.

15

నాకంటే బహుమానముల్ ప్రదమి నీనాఁడిట్లు గైకొన్నవాఁ
డే కాలమ్మున లేఁడటంచనిన నోయీ! విశ్వవిజ్ఞానమూ
ర్తీ! కాదీతని ముష్టిచెంబు బహుభారీదైనదేమో యటం
చాకాశప్రభువాణిపల్కెను గదయ్యా యేలసన్మానముల్.

16

విశ్వముపల్లవించెడి కవిత్వముతో బృహదాంధ్ర రాజ్య ల
క్ష్మీశ్వరుఁడెవ్వఁడో తెనుఁగులిప్పుడు తేల్చెడిరోజువచ్చె కా
శీశ్వర! దేవదత్తము కవీశ్వరులత్తి గజాశ్వధాటిపై
శాశ్వతకీర్తి వాటెడి రసస్వర వజ్రముహూర్తమెన్నఁడీ.

17

కవితాగానము సేయవచ్చితిని సౌఖ్యశ్రీ కళాస్వర్గ మా
నవలోకంబునకేను మీహృదయ కాంతారమ్ములో పూచు గౌ
రవమందార సుమమ్ములో సచివులారా! విశ్వసౌందర్య భా
గ్య వచోద్యానవసంతులై యుడుడి దీర్ఘాయుర్ధనుర్ధారులై.

18

శ్రీతారుణ్యము నీ ప్రసన్నముఖరాజీవమ్ముతోఁ గుల్కు మా
సీతారామవరప్రసాద! మురళీస్నిగ్ధప్రసూనాత్మవై
ప్రాతల్ పండెడిమూర్తివై రఘుమహారాజుం విశాలాంధ్ర వి
ఖ్యాతప్రాప్తికిఁ గన్నవాఁడవయినావయ్యా చిరంజీవివై.

19

గుర్తుగమాడుకోట్ల తెనుఁగుల్ మెఱుఁగుల్ విఱజాజాలై జగ
త్కీర్తికినిన్ను పూచి వెలిగించెను దిక్కులం మూర్తిరాజ ! త్వ
న్మూర్తి జయాభిషేకము లమోఘముగాఁ బొనరించి వాగ్ఝరీ
నర్తకి కిచ్చె, గాన కిరణమ్ములం మీనకిశోర నాట్యముల్.

20

చూచుటకెందరో కలరు సుందరమూర్తులు మూర్తిరాజ ! ని
గాచతికమ్ము నీ బలపరాక్రమ వాక్పటిమమ్ము నీ మహా
ధీ చరితమ్ము నీ చలువతీయఁదనమ్ములం పూచిదేశముల్
నోచెడి మూర్తిరాజయి ఘనుండయి యెవ్వఁడు తేలినాఁడయా ?

21

ఏనుగులెక్కి వెల్గిన కవీంద్రులు చక్కనితెన్గుతోట కృ
ష్ణానదిగట్టుపై త్రిభువనాలు, జయించెడి, వీరశౌర్య సం
స్థాన యశోవిరాజిత ప్రజావిజయుల్ విలసిల్లు వజ్ర సో
పానము నూజవీటి పరిపాలితుడప్పయరావు వేసెరా.

22

అయ్యలఖ్యాతిలోకవికులాభరణమ్ముగ ప్రజ్వరిల్లి ల
క్ష్మయ్య సునామధేయుడయి, శాంతికళాస్తవనీయుడైన త్యా
గయ్యగ తీయతీయని సుధాంజలితో పెనుగొండనెక్కి నా
సెయ్యమునాఁడు నేఁడు గమనించెను మించెను దొడ్డమేరువై!

23

ధీనిధులెందరో పాడమి దృష్టికి సృష్టికి వన్నెదెచ్చి కృ
ష్ణానదియొడ్డుపై శ్రవణసౌఖ్యముగా మృదుమాధురీ కళా
గాన సుధాతరంగము లఖండ మృదంగము లశ్వధాటితో
సేనగదూకజేసి విలసిల్లిరి చల్లని తెన్గుతోటలో.

24

ఏవాడలోనైన దేవాలయములందు మీచేతిచలువ నుమించెగాదె
ఏసంస్థలోనైన మాసంస్తుతులకెల్ల మీకీర్తిలత లెగబ్రాకెగాదె
ఏఘాటిలోనైన పాథోధులై లేచి మీసాహసాలు దమికెనుగాదె
ఏవిద్యలోనైన చేవబట్టి చెలంగి మీమహామేధస్సు మెఱసెగాదె
బహుజగద్బాంధవులయి సంపదగడించి దానధారాధరములయి ధారవోసి
అవనిమీరు లక్ష్మీపుత్రులై సతమ్ము ప్రభవెలుఁగఁ జేసిరయ! ఆర్యవైశ్యులార!

25

దేశము చేతిలోనిడిన దేశికుఁడెవ్వఁడు? రాష్ట్రభాగ్య మే
దేశికుఁడిచ్చె? నీ ఋణము దేశము కాదా జగమ్ము తీర్చునే?
అసలు చెప్పనీయని మహోదయ మహాశయులైనఁగూడ నా
కోశము చెప్పకుండునె రగుల్చు తగుల్చు వైశ్యరత్నముల్.

26

బమ్మకు కన్నకట్టు బెజవాడకు వెంకటరెడ్డితక్క ర
త్నమెవడమ్మ! నా తెనుగుతల్లి! సమస్తమహాఁ కవీద్ధజా
శ్యమ్ములం జోరుచేసి ముంగసాలను కట్టిన చక్రవర్తియై
యిమ్మహి కొమ్ములోన్న బలమేమిటొ చూచె కదించి దంతముల్.

27

విరికూనకు నోరూరఁగడి సిరిజొత్తితి వత్సగాల చిరునవ్వులతో
దొరవైతివి నాకైతకు నరలోకను హాసినీజనక! మణిఫలకా!

28

భారతభారతీ మృదువిపంచికి చక్కని శాంతిసౌఖ్య మం
దారకళా ప్రసూన కిరణమ్ములు పూచెడి వాగవీవు నీ
పేరును మించి కప్పురపు వీడెము విశ్వమువేసి కొప్పగా
పూరి సునామధేయ! సుముఖోజ్వల కావ్యకళామహోదయా

29

ఈ విజయవాడకీర్తికి తావి ఘుమాయించి దేవతలందిగిరపుడో
నా వీరరాఘవసఖా! నీ విరజాజి చిరునవ్వు-నేత్రోత్సవమై.

30

ఏ యొకిమీఁదుగూడ మును పెన్నఁడు ని బెజవాడ పత్తన
చ్ఛాయలు నెచ్చుకొన్న బలశౌర్య కళాప్రభుమండనుండు కాఁ
డోయి త్వదీయ వైశ్యసుముఖోజ్వల భాగ్యకృపాభిషిక్తమై
పాయని వేడ్కతో విజయవాడకు వెల్గితి వీరరాఘవా!

31

చిట్టికిమించినట్టి బుధశేఖరుడే సరదార్గలో జగా
జెట్టిగ కంటికందదు ప్రసిద్ధిగ సర్వజగద్ధితంబుగా
పట్టిన పరిపట్టణ శివార్లకు చేసిన సేవలెన్నియో
కట్టము లేలు నేడు జమకట్టెడి నీకొలబద్ద లెక్కతో.

32

గుబురులువట్టి పచ్చని చిగుళ్లు పసందుగనచ్చి హాయిగా
ప్రబలెడి కూరుముల్ విజయవాడ పురంధ్రికి దెచ్చె నేఁడు బల్
సొబగులు కూర్చుచుంటివి యశోధనముల్ కొలబోసి విశ్వకీ
ర్తిబిరుదు మేల్మితో గణపతీ! గడియించితి వాంధ్రకోటపై

33

గొప్పలకేమిగాని రసికుల్ సుకవుల్ కొనియాడునట్లు సై
దప్పలసామి, ముస్లిములు హైందవులెప్పటికైన నేకమై
చొప్పున పేరుపెట్టుకొని సూరులలో పెనురుస్తుమాచు వేల్
గుప్పుచు నాఁడు నేఁడు నెలకొల్పెనుగుళ్లను గ్రంథసౌధముల్

34

విజయశ్రీ బెజవాడపట్టణము నీవిఖ్యాతిజీమూత శౌ
ర్య జంగంబై కవిదిగ్గజంబులకు వీరాలాప కోలాహల
ధ్వజ విద్యుల్లతలెన్నియో తొడిగిమోదంబిచ్చె ధైర్యమ్ముఁగొ
ల్పు జయోత్సాహమునిమ్ము నా నరసబాబూ! వజ్రపింఛమ్ముతో.

35

కవిగంటములకీవు చవిజూపినాఁడవు వీరభారతము గర్జించుకొఱకు
వన్నెచిన్నెలకీవు వాగ్విలాసుఁడవు ప్రేమమాయతము పుష్పించుకొఱకు
లలితకళలకీవు కలితకోశుండవు విశ్వమోహనము మెప్పించుకొఱకు
బృహదాంధ్రమునకీవు మహదాశయుండవు కృష్ణాతరంగ మ్రోగించుకొఱకు
నిజముగా నగరాలలో విజయవాడ పెద్ద పురపాలకాధ్యక్ష పీఠమెన్న
డైన దక్కెనా నీకు సత్యాలనరసిబాబు! మాకు నుత్యాలమతాబువెలుగు!

36

గట్టివాఁడేకాని పొట్టివాఁడుంతేని అనివార్య కార్యశౌర్యధనులందు
ధనికుఁడేకాని సద్రసికుఁడుంతేనియు ప్రసవమార్గణ పాశబద్ధులందు
మహనీయుఁడేకాని మాటకారింతేని శాత్రవపరిహాస పాత్రులందు
నగరవీరుఁడె కాని తెగవీరుఁడుంతేని దశశిర మూషకాధ్యక్షులందు
వంకలేని పెద్ద పంగనామమువాఁడు కానరాని గాయకైనవాఁడు
బంకబంకకాదు వదలనిబంకరా రాములన్న బంకరాముఁడేర!

37

రాములు! నీయనుగ్రహముగా గ్రహబాధలుతప్ప యెందఱో
స్వాములు కాగితాలపయి-చక్కఁగ ముందు స్మరించినన్ను శ్రీ
రాములుఁగా రచించి ఘనరాసులు ప్రోఁచుకొనంగజొచ్చి ర
య్యా! మఱి నాపరిస్థితి చిదంబరుఁడే కనిపెట్టఁజాలువా?

38

నన్నెరిగించినావు భువనమ్ములకెంతయు దీనికేమి నీ
కెన్నటికేని తీర్పఁగలదేమిటో తోఁచుటలేదు పేరులోఁ
మిన్నవు కొల్లబద్దలను మించెడి సున్నవు సప్తసాగరా
లన్ని తెగించినం వదలనట్టి గృహస్థుడవీవు రాములా!

39

హరిదాసుల్ కవికాళిదాసులు కళాధ్యక్షుల్ విశాలాంధ్ర మం
దిర నాదస్వర సార్వభౌములు మహానిర్వక్ర శౌర్యక్రియా
నరనాథుల్ మొగసాలముందపుడు ప్రాణాచారముల్ సల్పి కిం
కరులై రాములు! నీకృపారసములెక్కెం దిగ్గరె గిద్దరా!

40

అక్షరసరోవరములోఁ యక్షులు రాజీవనేత్రలయ్యేడి కవితల్
నక్షత్రధాత్రిపిండుచు లక్షలు వేదాంతకవి కలమ్మే యిదురా!

41

రాములు రాములా కవనరాణిరసమ్ములు జుఱ్ఱుకొన్న యా
రాములుగాని నేఁడెఁతడు రాయలు కాయలుకాచి యెందరో
స్వాములు దేవదాసులు పసందుగఁబెట్టిన పంగనామముల్
మోమున కొట్టవచ్చినను మోసెడిరాములు గా చిదంబరా!

42

దేనికి సంశయమ్ము తియతియ్యని నానుడులెల్ల విశ్వ వా
ణీ నవరత్నసౌధరమణీయ కళాకమనీయ వజ్రసో
పానములన్న నీమధురభావమదొక్కటె నాకు దొడ్డ స
న్మానముకాదటయ్య భువనమ్ములు మెచ్చెడి నాచిదంబరా!

43

అక్షరవిహంగయానము లక్షలతో సలవికాదు లక్ష్యంబులతో
రాక్షసపీడలు సైపుము వృక్షము పుష్పించుఁగాద వి. యే. రాజా

44

తారామండలమంటిపోయెడి కళాధారాధరుండెన్నఁడోఁ
క్ష్మారాజీవ దళాయతాక్షిపయి ప్రేమశ్రీలువర్షించి వి
ద్యారామంబున నిన్ను స్నిగ్ధమురళీవ్యాపార్త్మగాఁబూచె వీ
ఏరాజా! కవితాప్రవాహములు నూరేండ్లిట్లు దూకించుమీ.

45

మూడుకోట్లప్రకాశమ్ము పోతపోసి ఆంధ్రకేసరి శౌర్యచిహ్నంబు తెచ్చి
విజయవాడలో నీవు నిల్వెట్టినావు నేటితెన్నేటిరాయ! పన్నీటిగేయ!

46

చలపతిరాయ నీచలువ చాల చిగిర్చెను నీ హయాములో
లలితకళానికేతనములం నెలగొల్పి విలాసమెంతయో
తెలుగులకిచ్చినావు కవిదిగ్గజముల్ గరువించు రాజ వీ
థులు కులికించినావు సిరి తొల్కారి నీకుదయించె సేమయా.

47

మితభాషికాని మాధుర్యము పూచెడివాణి రసరాజ్యమేలెడి రాజధాని
నిర్లిప్తుఁడేకాని సిర్లు పాల్గొనిమాని వెల్గెడి సాహిత్య విశ్వజాని
హాలికుఁడేకాని పాలకుఁగొంతేని తన్పెడి దివ్యశతావధాని
చురుకు చూపదుకాని గురుదేవుడీక్షోణి కడిదిదొడ్డను మెచ్చబడెడిజ్ఞాని
పుట్టినది పెదపూడికాపురముకాదు పేరమన్న చిలుకలూరుపేట సుమ్మి
పౌరుషంబునకెల్ల శాస్త్రివంగడంబు సరసుడైన నరసకవి పురుషధనుడు.

48

ఆజన్మబ్రహ్మచర్యము సౌజన్య విశాలవిశ్వసౌభ్రాత్రము నీ
సొమ్మైన శాస్త్రికవి, నా రాజకవనబాల యెట్లు రాణించునయా.

49

అసలు తిక్కన్న కావ్యకన్య మిగులబల ఇల నభినవతిక్కన కృతిలలన 'శబల'
ముచ్చటగ దేనితో ప్రాప్తుఁబుత్తువయ్య శాస్త్రికులవం, శ్రీనరసకవిభూప.

50

పుస్తెనుగట్టమన్న పువ్వుబోడిని సైకానకున్నపోని యీ
పుస్తకకన్యసైన కడుముచ్చటగా గయికొమ్మటంచు ధా
త్రీసవనీయుడై కవనతిక్కన వేడిన వెన్క కావ్య ల
క్ష్మీస్తనసౌఖ్యకేళి తిలకించితి గాదటె శాస్త్రిసత్కవీ.

51

కమ్మని కమ్మ కమ్మని సుఖస్వరకోమలవాగ్విలాస భా
గ్యమ్మెగఁబోయుచుండెడి యఖండమహాకవితాతపస్వి తే
జమ్ములు చెల్వుతో "శబల" చల్వలు తెట్టెలుకట్టి పంచ వ
ర్ణమ్ముల రామచిల్కయయినం గవిమండన పుల్కరించెనా!

52

అదిగో ఆదము పీరుసాహెబులం గావ్యంబైనసవ్వాయి కో
విదులై కోయిల రాగడోలికలతో విద్వజ్జనాఖండల
ప్రదసమ్మోదమహోఘన ద్విరదశౌర్య శ్రీ విలాసైక నీ
రద కాంతారము కుల్కజాస్తికవిధీరత్వమ్ము శ్లాఘించెగా.

53

అప్పురుషోత్తముండు విజయధ్వను లిచ్చెడి మేఘగర్జనల్
గొప్పగచేసిచేసి మెఱుగుల్ పదుగుల్ కోలబోసిపోసి గు
ర్వప్పను అంకవేయు బసవయ్యను తాండవమాడనిచ్చి పే
రప్పడు నించె రాఘవుడు హాయిగ తీయగ నాదబ్రహ్మతో.

54

గోదుమవన్నె త్రాచు నవకోమల రేఖలు విప్పుచుండు నీ
నాదకళాగళమ్ము భువనమ్ములు పండెడి హాయితో మహా
వాదినునామధేయ! గరువంబుగ నైతె ఫలింపజేసె వ
స్తాదుగ లేచి గానకవితాఝరి నీదమూ విశ్వతుంబురా!

55

ఏ తీర్థంబులు వట్టినప్పటికి మే మెన్నాళ్ళు నైమోడ్పులో
నై తల్ వ్రాసినతమ్ము రామునికి వేడ్కల్ గొల్పినం మాకు నీ
సీతారామపదాబ్జ వజ్రకిరణ శ్రీరేఖ లెచ్చోటు ఏ
ప్రాతఃకాలము పూచదేమిటిగి! చిట్టావూరి కామేశ్వరా.

56

శ్రీ లంగిరాల వంశజ! ఖ్యాతికి నీ ఇల్లలక్ష్మి కామేశ్వరి సం
ప్రీతిగ సౌభాగ్యవతిం! మాతృశ్రీగతు నీకు మణిగ్గై కొనుమా!

57

చెలువల్ పూచెడి విశ్వవీణక భవచ్ఛ్రీవత్స గోత్రోద్భవుల్
విలసన్మంగళ మాధురీశ్రుతులు దేవీవ్యవాత్సల్య వా
క్కులు గీలింతురు వీరరాఘవనృపా! గోపాలకృష్ణుండు త్వ
త్కుల మందార మహీరుహప్రసవముల్ కల్పించు వేయేండ్లటుల్

58

నీ నెవరోకనంగొనెడి నేర్పు త్వదీయ సువర్ణవిశ్వ సం
స్థానము వట్టినేని పలుసార్లు పరాత్పరదివ్యపాద ల
క్ష్మీనిలయమ్ము సొచ్చి విలసిల్లెడి ముద్దు కమూరునెంచి నీ
వైనను వచ్చిచూడుము చిరాయువులేలెడి వీరరాఘవా !

59

చదివినవాడగాను విమనన్నుతిజేసినవాడగాను సం
పదలుంగడించినట్టి ధనవంతుడగాను సమస్తవిశ్వముల్
బ్రదికెడితల్లిచల్ల తమపై వెదజల్లెడి వాడనేను దు
ర్మదులన ఒట్టి దుస్మృతి చిరాయువు నీ కిక వీరరాఘవా!

60

శ్రీరాగా మృదుమాధురీ రసము త్రేపుల్ వచ్చు నట్లిచ్చి సం
సారాంబోధి తరంగడోలికలపై జక్కంగ నూగించి కీ
కారణ్యాంబులఁ ద్రోసి మాతమము, నవ్యాజప్రియంబుల్ ఊసేన్
పీరాస్వామి యనుగ్రహించి శివుఁడై వెల్గించుతన్ నానుడుల్.

61

కనకాభిషేకమెంతో ఘనతగ చేయించె నాకు కవిమండలిలో
మానుమూర్తిరాజు ధరపై ప్రణతులకు పఠింతు భోజరాజని కృతిలో.

వేదాంతకవి

# ఆ విషముష్టి నవ్వుకేనా ?

ఆనంద సరోవర మనోహర మరాళం నాట్యం చేసేది? వియ్యాచ్చర పిండుతో పూజించేది ? విమల గాంధర్వగానం ధారబోసేది ? రస ప్రసూన కవితా సుధారసప్రవాహం దేశదేశాలకిదూకి పరవళ్లు త్రొక్కేది ? కోటికంఠాలతో జయజయధ్వానాలు మిన్నుముట్టించేది?

అక్షరదరహాసం అహర్పతి వికాసం కంటే మనోహరమైంది. మహీమహిళామతల్లి నోములతోట కులికించేది. ధర్మదేవతా సువర్ణ చరణ రాజీవ మంజీర మధుర మంగళరావాలు పలికించేది. మురళీ మోహన గాన సుధారస వర్షాలు వర్షించేది.

నవపల్లవ కోమల శబ్దలావణ్యం నవరత్న సౌధ సౌదామినీ శారుణ్యంలో ప్రాప్తించదు. అధికార దుర్హంకార వీర విన్యాస విలయ వికటాట్టహాస మాలిన్యంలో మచ్చుకైనా తెచ్చుకోలేరు.

మంజుల వాగ్విలాస వసంతకోకిల స్వరం, గార్దభ గంభీర కంఠ నాళం నుండిగాని మత్తేభరాజ వీరగళంనుండిగాని కురిపించలేరు. ఒడ్డుపొడుగులుచూచి కోమలస్వభావం అందుకోలేరు.

అక్షరప్రవాహం అనంతకోటి భాగ్యరస సుందరియై చరాచర జీవకోటి హృదయ శయ్యాపై పవళించిన పరాత్పరుడికి పరవశత్వం పుట్టిస్తున్నది. ప్రసన్నరాగ మురళీస్వరాలాపన చేయిస్తున్నది.

రసమురళీపూచిన కులుకు ముత్యాలలో సోయగం రాజస తామస రాక్షస జంఝామారుతాలు విఱ్ఱవీగుతున్న పేరోలగానికి రాదు. తాత ముత్తాతలు పడేసిన మనవత్రితిండి నెమరేసి దవడాడిస్తున్న మొగానికి మొత్తుకొన్నా లేదు.

హిమాలయం మండి పెళ్లునసేట్లు ప్రళయం ప్రగల్భించినా, భూతలం పాతాళానికి అంటుకుపోయేటట్లు ఆకాశం మాడుసొట్టపడినా, అక్షరరాజీవాక్షి అందం ఆరిపోదు. అక్షరకంఠంలో ఊపిరున్నంత వరకూ అక్షరజనకుడే జగదేకారాధ్యుడైన ప్రపంచ సర్వాధికారి.

అక్షరకంఠ స్వరానికి కుసినిస్తున్న మధుర మనోహర మకరంద ధ్వనులు తపోధనులైన మునులు అమృతవాగనుశాసనులు నిర్మల హృదయాలతో గ్రహించి విశ్వవిజ్ఞాన భక్తిరసమాల రచించి ఆనంద శక్తికి అలంకరిస్తున్నారు.

అక్షర సైన్యాలు అనంతకోటి అక్షౌహిణులై దేశదేశాలు ముట్టడించి వివిధ విజ్ఞాన వీరసందేశాలతో పహరాకాస్తున్నై. అందు వల్ల అక్షర సైన్యాధిపతి అక్షరదళాధిపతి, విశ్వకవి.

అక్షర మహారాజు రసలోలుడుకాని రసదూరుఁడు కాఁడు. అంచేత అక్షరశంపాలత చిరునవ్వు పువ్వులుపూచి రసావేశ పరవశు డైన అక్షర కిరీటికి ఆనంద గంధర్వనగరిలో విశ్వప్రేమ కవితాగాన మధురానగరిలో సువర్ణకుంభ కుసుమాభిషేకంచేసి పూజించుకొంటు న్నది. అటువంటి పవిత్ర సంప్రదాయం లీడర్ల యేలుబడిలో నడుస్తున్న మానవసంఘానికి వచ్చిననాడే భూతలస్వర్గం చూస్తారు.

అక్షరసమ్మోహనాస్త్రం ముందు హైడ్రోజన్ బాంబ్ అంకెళ్లు వత్తుకుపోతై. బానిస సంకెళ్ళు పటాపంచలైపోతై. అక్షరసైన్య విన్యాసాలతో ఆనంద జలపాతాలు దుమికి దూకులుపెడతై.

నిరంకుశుడై నిరంతర నిర్నిద్రుడై నిర్విరామ కేళీకళారామ రస కృషీవలుడైన అక్షరఫాలాక్షుడు ప్రసన్న రాగోపాసనతో చుక్కల తోటలో పూలయీలవిని సంధ్యారాగం పుష్పించి ప్రవహించెడి మనో

రమాకుచమర్దన సౌరభసంక్రాంతి కులికిస్తున్న స్రవంతి తీరాన స్వైర విహారంచేసి తనలో పొంగుతున్న అక్షరసముద్రాన్ని అనంత భావాంబర నీలమేఘ మాలాతరంగ తురంగ మాతంగాలతో లేపి అమృత రసవర్షాలు క్రుమ్మరించి సమస్త మనస్తత్వాలు మనోహరజీవిత పారిజాతాలుచేసి విరాజిల్లచేస్తున్నాడు. సమస్త సృష్టి హృదయాలలో ఆనందశక్తి సాక్షాత్కరింప చేస్తున్నాడు. ఇటువంటి కవితాపరమేశ్వరుడే ప్రత్యక్షభగవంతుడు.

అక్షర పరాత్పరుడైన కవితా పరమేశ్వరుడు కని నిలబెట్టిన చిల్లరచిల్లర దేవుళ్లకు కోటానుకోట్లు ఖర్చుపెట్టటం చేతైన సంఘం కవితావతారమూర్తిని తెలుసుకోటం చేతకాకపోగా చులకనగా పారేసిన డక్కన్ సిగరెట్టుపెట్టెలాగా నిరాదరించి నిరాకరించి తీసి పారేస్తున్నది.

ఈ సంఘంలో కళ్ళు పేడకళ్ళుపడి ఒళ్ళు కుళ్ళుపుళ్ళు పడి తెగ బాధపడుతున్న లేకి రకానికేనా? విశ్వసౌందర్య మోహనచక్రవర్తి సొగసు తెలిసేది ?

అక్షరకర్త జగత్కర్తఅని తెలిసిననాడే అరాజకాలణగారిపోతై. జాతిఅప్పలు చెట్టుచేమలు దేవుళ్ళన్న విశ్వాసం పట్టించిన కవిబ్రహ్మ, యుగయుగాలయొక్క జీవితాలు మాసిపోకుండ మనోహరంచేసి చూపిస్తున్న కవిత్రివిక్రముడు, మహాత్ముల్ని, మహా భక్తుల్ని చిరంజీవుల్ని చేసి చూపిస్తున్న కవితామహేశ్వరుడు శివరాత్రిమహోత్సవముల కంటె శ్రీరామనవమి మహోత్సవములకంటె ఏటేటా అనంతభాగ్య వైభవోపేతంగా మహోత్సవాలు జరిపించుకొంటానికి ముమ్మాటికి పూజార్హుడు. దగాబడ్డ జీవితాలు జగాజెట్టెవడో చూపించకపోవు.

# ర స ము ర ళి

ఆనందశక్తి పలికెడి
ధ్యానమురళి పూచుమోహనాక్షరములతోఁ
గానని సౌఖ్యముకలదా
గీనతఁ బడనీని భక్తితీర్థమువలదా ?

2

తీరనిబాధ జీవులకు దేవునిబోధ నిజమ్ము నమ్ము; వి
ద్యారమణీయ రేఖలు సుతారముగా నవరత్న శబ్ద కాం
తారములో సుమించి భువనస్తవనీయుఁడు మెచ్చుచున్న క
ర్జూరములై ఫలించెను వచోమకరందము చిందజేయుడీ.

3

తెలిమబ్బు పరుపుపై నెలకూన బబ్బుండి
ఆలకించెను జిన్ని పూలఝూల
కోయిల యుయ్యాల కొమ్మకొమ్మకు వేసి
గండశిలకులేపె గుండెగోల
చెఱ్ఱాట లాడెడి కుఱ్ఱగాడ్పులఁజూచి
చేలుపండించె వజ్రాలకడుపు
ఏటిగట్టెక్కి నాగేటిసామికిమ్రొక్కి
దుక్కిటెద్దులుసూపె పిక్కబలము

విశ్వసౌందర్యరాశి త్రవ్వించియెపుడు
కోటికెరటాల తోడ నీకుఁ గొలబోసి
ఈశ్వరుఁడు నీయెడఁద నుండె విశ్వసించి
ఏమి యిత్తువో నరజన్మ! యెంచుకొనుము.

4

వసఁదేల్చు వీరపాయసములుడుకువట్టి
అట్టుడికించెడి దిట్టలున్న
దరిఁజేర్చు భక్తి నిర్ఝరులఁ దూకులువెట్టి
గజ్జెఁగట్టించెడి ఘటికులున్న
సిరిపూఁచుకీర్తి కిన్నెర కంఠముచిగిర్చి
తేనె జల్లించెడి జ్ఞానులున్న
దివి దించు నిఖిలాగమ వివేకధనమెత్తి
దారినడిపెడి పెద్దతలలున్న

కడకు నిను చెప్పుకొనుటేమొ యుడుతరాజ!
యెవ్వ ఱెరుగనిదేమిటో యింతవఱకు
సృష్టి పరుగులు దేనికో రేయిబవలు
విప్పిచెప్పుము తలనొప్పి వేపకట్లు

5

ఆకలిమంట కేదయిన హారము, దుఃఖము తాకనీని మా
ధ్వీకరసమ్ము, దివ్యసుదతీమణి, నవ్యరహస్యగేహ కే
ళీ కుశలమ్ములుండిన; సిరిఁపుల రాజ్యము కాలఁదన్ని దు
ర్వ్యాకుల శోకలోక విషవైతరణిం దరియించకుందునా?

6

ఆనంద కిరీటివిరా
మే నున్నంత వఱకే సుమీ గైకొను మీ
యే నరకమంటనీయని
మేనక మధుపాత్ర, నీలమేఘచరిత్రా.

7

నెఱసిన వెన్నెరయో తల లనేక విమర్శల కంబరంబె అ
చ్చెరువుగ తూట్లుతూట్లువడి చిల్లుల జల్లెడ యయ్యెగాని, యె
వ్వరి కణుమాత్రమేని భగవంతుడు మచ్చుకుఁదేలకుండె, ని
ష్కరుషగఁ జెప్పరైరసలు సర్వరహస్యము లెక్కడున్నవో.

8

ఈమెఱుపు లుఱుము లేకొండ కొసనుండి
జాలుకట్టి పడెనో నేలపైన
ఈ పరుగులు తర్గులేఱ్లు పొదనుండి
చీలి పాయలయి లేచెనో జగాన
ఈ సుడిగుండమ్ములే గండముల నుండి
నో ర్విప్పుకొనివచ్చెనో ధరిత్రి
ఈ వెండి కెరటమ్ము లేయొడ్డు విఱగించి
లంకలువెట్టెనో లావుభువిసి

ఈ యనంతగంభీరవాగ్గేయ మాధు
రీ మహాజీవితఝరీ పరీతనడుమ
ఎన్ని పడి బుడుంగుమనెనో యింతవఱకు
నొక్కవడవైన దించలే దొడ్డుపైన.

9

ఈ బృందావన పారిజాతముల కీ వెంతో వసంతుండవై
బాబూ! యేలుము దానికంటె కలదా స్వర్గంబు? చెల్వైనము
స్త్రాబుల్ తీర్చి వరాలపూలిడెడి మద్యం బీవు సేవించుచో
గూబల్ కూసెడి గ్రుడ్డినమ్మకము లేకోశమ్ములో జేరవే.

10

ఎక్కడనుండి రాకతు రవీంద్రుడ! లేఖలులేవుమధ్య! నీ
వొక్క డవెట్లు వచ్చితి? మహోజ్వలశాంతినికేతనంబు నీ
కెక్కడనైన దాకెన? కవీంద్ర! సురేంద్రపురంబులోన నీ
చక్కని కైతసేమములు సౌఖ్యముగా వినవచ్చుచుండెనా?

11

ఆ మధురమ్ము లుమ్మరుఖయాము హయాము తయారుచేసెనం
చే మధురాధరమ్ములు కవీంద్ర! వచింపక పోవుగాని యో
షామణి చేతితో మధురసమ్ము గ్రహించి తదీయ దేహవ
ల్లీ మృదుపల్లవాశలు ఫలించి రచించిన కావ్యమున్నదా?

12

ధరఁ బల్కించు రవీంద్రుఁడు
దరహాస విలాస వాక్సుధారస ఘనుఁడై
స్వరవర్షము వర్షించెను
హారుఁడై ఉమ్మరుఖయాము హర్షించునటుల్.

13

ఓయి రసస్వరూప! జయమోయి కళామధుగ్రవలాప! స
న్నాయికి లేని హాయి కవనస్వరమాలకుఁ దెచ్చితోయి; పా
పాయి, తుపాకిపట్టినసిపాయి నినుంగని మ్రొక్కునోయి; కం
దోయికి నీవు దక్కటు మనోహరుఁ డొక్కఁడు లేడు నమ్ముమీ.

14

శారదరాత్రిసౌఖ్యము రసజ్ఞులు మెచ్చెడి స్వర్గధాత్రి నీ
పేరిటు విన్నదో కవనవీర! సురేంద్రునిమాటద్రోసి ద
ర్బారులు కట్టిపెట్టిన నెపంబున నే నిటువచ్చి యెన్ని యో
స్వైరవిహార భాగ్యములు వట్టితి తావక పుష్పగీతితో॥

15

ఆ యమునానదీ తట వనాంతర దివ్యమయూరనాట్య రా
ధేయుడు కానివాడెవడు? తేలకపోయినగూడ పైకి నా
నా యుగకర్త తద్విధము నందన పుష్పకిశోరి కెంతయో
సాయము తన్మయుండయి యజస్రము సేయు రసాభిలాషతో.

16

గడబిడలేపి తుమ్మరుఖయాము! సమస్త రసాతలంబు లె
వ్వడదరగొట్టి యీ యమరభూమి సమీపముఁ జేరినాడవో
గొడవనికొంద ఱందమనికొందరు వేలుపులొండొకళ్లు నీ
నుడులకు కీచులాడుచు వినుం పెనురచ్చకు లాగినారయా.

17

ప్రేమోపాసన లేనిదే భువనకర్తృత్వంబు రాణించు టె
ట్లో మార్తాండకవీ? విలాస మధుపానోత్సాహ భాగ్యంబుతో
చీమల్ జెట్టుల ప్రాకులాట కన కీ చెల్వైన పూఁదోటలో
ఖామందెంత వసంతుడై గడపెనో కాలమ్ము వీక్షించుమీ.

18

ఆసవమెంతయో మఱగి హాయిగ పల్లవపాణి కౌంగిలో
వేసవిగాడ్పుదెబ్బలకు వేగక గ్రీష్మమనోహరుండు స
న్యాసికిగూడ పెండ్లి స్మరణమ్ము ఫలించెడి మేళతాళవి
న్యాసములెల్ల లేపి భువనస్తవనీయుడు కాఁడె ప్రేమతో.

19

ఎన్ని యుగాలనుండియొ విహీనములైపడి పెంకుపెంకులై
మన్నయిపోయి దిబ్బలయి మారినలోకము లేవనెత్తగా
దున్నుచు చక్కఁగా నడుసుఁ ద్రొక్కుచుఁ గుమ్మరి పాత్రలెన్నియో
వన్నెగఁ జేసి నింపె రసవర్గము మేఘ మహోదయమ్ముతో.

20

నందనమునుండి యూర్వశి నవ్వులొలికి
ఆ శరద్రాత్రి పుష్పించె దేశములకు
పాత్ర లమృతమ్ముతో నిండి పరవశమున
తొణకితొణకింక గంతు చిందులను ద్రాక్ష.

12

సుఖదుఃఖాశ్రుకణస్వనప్రణవతేజోవంత మీ ధాత్రి; స
మ్ముఖమం దెమ్మెయి గాడ్పుదెబ్బ నిఖిలమ్మం లేపి యే చిత్ర ఘో
ష ఖనిం బ్రద్దలు కొట్టికొట్టి వణకించం జొచ్చెనో తద్విధం
బఖిలాత్మేచ్ఛకదా ప్రపంచ మెపుడల్లాడించె హేమంతమై.

22

విలసత్ప్రేమకథాసుధారసజగద్వృక్షంబు శాఖోపశా
ఖలుగాఁ బెంచి కళాప్రసూనఫలసౌఖ్యశ్రీశకుంతస్వర
మ్ములతోఁ గులికెడి పెండ్లిగూర్చి శిశిరమ్ముం గంతువేయించి కే
వల మాత్మేచ్ఛకదా యథేచ్ఛగ సదా పాలించె సౌందర్యముల్.

23

ఇంత మనోహరంబయిన యింతి కృపారసపానశాల దూ
షింతురు బుద్ధిజాడ్యవృషభేంద్రులు; యౌవనరాజ్యదివ్యశు
ద్ధాంతనితాంతజీవితలతాంత మనోజ్ఞవసంతభాగ్య ము
న్నంతటి ద్రాక్షతోటదొరనై తులతూగెద నేను దానిలో.

24

అతిరకకంఠస్వరాలాపనకు చుక్క
దిగనిచ్చితేని బుద్ధి వికసించు
ఘోరనరకముతో పోరెత్తిపోయెడి
గొంతు కింతిడితేవి శాంతిచెందు

ఈశ్వరేశ్వరునికై యెండి మండెడతండు
గుటక వేసిన కొంతగోలతగ్గు
అసహనప్రళయరాక్షసుడై దురాశతో
పడినవానికి బొట్టుపడిన లొంగు

ద్రాక్ష రసధారకమ్మ రుద్రాక్షయిడదు
దాని కే పుణ్యరాశి యెంతేని చేసి
పెద్దతలలు చేరినవి దివిపయి నేడు
స్వర్గమిచ్చుటే కలదు దుర్భ్రమలువిడిన.

25

హాయిగప్రాణికింత మధు వామృదుపల్లవపాణియిచ్చుచో
రేయిఁబవళ్లు నా నయనరేఖలు దేవునిదివ్యపాదమం
దేయిడి, భిన్నదృష్టిపడనీయని లక్ష్యమునట్టి; జీవితా
ధ్యాయముధారఁబోతు నులివై నలివై యిక కర్మభూమికై.

26

ప్రాణములేచివచ్చు మధుపాత్ర సమస్తపిశాచ సంకట
శ్రేణిలవిత్ర చక్కని శిరీషకిశోరి వినోదసౌఖ్య ని
ర్మాణముచేసియిచ్చిన పరాత్పరుడెప్పుడుకానవచ్చు, ని
ద్రాణజగమ్ము మేల్కొలుపు దానిని యేల నిరాకరించిరో?

27

సుర సేవించి దివమ్ముపై సురలు పూజ్యుల్ మాత్రమైరి? యీ
నరులద్దాని గ్రహించుచో ధరప్రియంబై పోవునంచెంచి ట
క్కరులై పాపమటంచు శాసనముభూఖండంబుపైమున్న చే
సిరికాఁబోలు ధరాపురందరులు కచ్చెల్ మాని చర్చింపుడీ.

28

ఇనుఁడే ముక్కున్రవేలువైచుకొౌన నే నేకేశ్వరోపాసకుం
డను, నేనింకఁ జెలింపనెవ్వనికి, దణ్ణంబేనుకైమోడ్చి వె
ట్టను; నాదేహముదేవళమ్ము కడువేడ్కల్ తీర్పువాడిక్కడుం
డెనుగాదే, మఱిదిన్నబుచ్చఁదగునా? నే నాప్రభుం డీనిఢీ.

29

ఈదేవాలయమందు దేవుడమృతంబెల్లప్పుడాశించి నా
కాదేశంబిడుచున్న హేతువున కే నత్యంతభక్తుండనై
యేదో వేళ రసాభిషేకము మనోభీష్టంబుగాజేసి స
మ్మోదంబందుచునుంటి ఘోరధరణీభూపాలకశ్రేణిలో.

30

చెవిఁబడ వీ నుడుల్ చపలచిత్తుని కెన్నడు, లుబ్ధబుద్ధి కం
ట వసలు, బ్రహ్మదేవుని కటాక్షగవాక్షము వీరికోసమే
అవసరమున్నచో తెఱచునంచు జపించి తపించి యెంతయో
తెవులుగ్రుళ్ళిగ్రుళ్ళి గతింతురకే మధుపాత్రసౌఖ్యముల్.

31

మైమఱపేల మున్నెపరిమట్టిని బెట్టి తయారుచేసిరో
యీ మధుపాత్ర; దీని మధువెంత సువాసనగొట్టుచున్నదో
మామక వర్ణనంబులకుమాత్ర మసాధ్యము, దానిమాదికే
స్వామి! ఘటంబులన్నియు నిజమ్ముగ బ్రద్దలుకాకపోవునా?

32

ఉమ్మరిఖయాము నుడులకు
కమ్మని పరిమళము లేచి కవిరాజెంతో
చెమ్మగిలిన వాడయి, వి
శ్వమ్ములు మార్మ్రోగునట్లు పల్కెను ధ్వనితో.

33

ఆహా! యెంతమనోవికాసము జగద్వ్యాఖ్యాతమై చూపి వ్యా
మోహోద్రేకము క్షీరసాగరముపై పొంగించి చిద్రూప! స
న్నాహంబంతయు స్వర్గనందనములోనంజేర్చి సౌఖ్యమ్ముతో
సోహంబంచుఁ జరింపమంటివి; తపస్సుల్ స్వప్నసంతోషముల్.

34

వర్షించెనే ప్రేమపల్లవామృతములు
సమ్మోహనాస్త్ర విస్పష్టగళము
పుష్పించెనే విశ్వమురళీస్వరమ్ములు
రాగసుహాసిని ప్రణయ పూజ
చిత్రించెనే స్నిగ్ధధాత్రీతలమ్ములు
బ్రాహ్మ ప్రసన్నాత్మ బాహుబలము
ఆర్జించెనే పౌరుషార్ణవపదములు
నిర్వక్రవీరడిండిమ రవమ్ము

యుగయుగమ్ములుచీల్చి యాయుర్ధనమ్ము
తెచ్చిపోసినచో స్వర్గతీర్థమేల?
నాకు దేవేంద్రసింహాసనమ్ములేల?
పద్మగంధి యిచ్చెడి మధుపాత్రచాలు.

35

అస్మదభీష్ట ముమ్మరుఖయ్యాము! ముదమ్ముగదీరెగాని, ము
న్నే స్మరణమ్ముతో ఘనులనేకులు నాకముచేరినారలో
విస్మయులై మఱిప్పుడు వివేకములోబడి లేచి జీవిత
శ్రీస్మితగాత్రులై నినువరించి తరించుట కెంచి రేలుమీ.

36

నావెంటం జనుఁదెంచి చూడుమదిగో! నాకమ్ములో ప్రేమకే
ళీవిద్యానవమోహనాంగులయి యేలీలం నిరీక్షించిరో
దేవత్వమ్ము త్యజించి నీకొఱకు సాధ్వీరత్నమాణిక్యముల్
లావణ్యమ్ములు శుద్ధిచేసుకొని కళ్యాణమ్ము లాశించిరా?

37

తరువుల్ పచ్చని లేఁతపట్టునలువల్ దర్పంబుతోఁ దాల్చి య
ప్సరసల్ వోలె కళావిలాసములు దివ్యంబైన భాగ్యంబు ల
చ్చెరువుల్ గొల్పుచుఁ ద్రవ్వి మున్నెచట తెచ్చెం స్వామి? తద్దీఛుతో
నరులేలా సిరులొల్కఁబోయరు? ప్రపంచంబెల్ల స్వాధీనమై.

38

ఎవరో యిచ్చిన మొక్క కుల్కె దమటం చెల్లప్పుడల్లాడుటా?
భువిపై నిల్కడగాఁ జెలంగి దృఢకాముల్ తర్వాతైనప్పు డా
ల్ల విలాసమ్ములు తెచ్చుకొందురు; మనోల్లాసమ్ముకై కామినీ
స్తవమేలా? మధుపాత్రయేల? భగవద్ధ్యానమ్ము లాభించదా?

39

కాముకులై సదా సుఖముగాదిని హాయిగ ప్రొద్దుఁబుచ్చి యే
జామున లేకపోయిన విచారదవాగ్నిని మాడిచచ్చుటా
యేమి మహాసుఖైకదివిజేంద్రపదంబు? మనుష్యధర్మ దీ
క్షామహిమంబు? చాలు మధుశాస్త్రపురందర విశ్వసుందరా.

40

ఎపుడో యింక ఘటమ్ము పెంకులయిపో కేమౌనుగానీ, విలా
సపిపాసల్ పడకుండ చూడగలవా? చావన్న దానిం మతే
చపలత్వంబున గెల్వలేక వనితాసౌందర్యమాధుర్య ది
వ్యపదార్థంబులు వట్టి నిల్పితివయా? ప్రాణమ్ము మద్యమ్ముతో.

41

పంజరమందు చిల్క రసపల్లవకోమలవాగ్విలాస భా
వాంజన మాశ్రయించి, విజయస్వర కంకణ కింకిణీ మనో
రంజనియై నటించి, నవరత్నలతాకవితాప్రసూనగీ
తాంజలితో వరించి, పరమాత్ముని జేరి తరించవచ్చునే.

42

బంతి పదాలుమట్టి పలుపాట్లకుఁ దిన్నది తన్ను లెన్నియో
చింతిలకుండ; పట్టిచట చిక్కక తేలెడితావునుండి వి
భ్రాంతిగ దూకి గంతులనువైచి మఱెప్పటికో కదయ్య! వి
శ్రాంతికి వచ్చి యూపిరి పిశాచజగమ్మున పోసుకోతగన్.

43

కిసలయోష్ఠికి మేలి కెంపులు కుసుమించి
యెల్లటికేల ముద్దీయవలయు?
కోకిల జిహ్వకు కులుకులు చిగిరించి
సృష్టి కేల సొగసు లియ్యవలయు?
శంపాలతకుఁ జిన్ని చక్కిలిగిలి పుట్టి
మొయిలు ముట్టడి కేల మురియవలయు?
జ్యోత్స్నమణికి చక్కనొయ్యార మొలికొల్కి
వెండికొండల కేల వెట్టివలయు?

హిమవిభూషితాంగికి వలపింత రేగి
పురుషసింహుల కేల కాపు లిడవలయు?
దీనుగాలికి మనసేల దిక్కవలయు?
తద్విధమ్ము దేవుని నీవు తలఁచుకొమ్ము.

44

ఏవిధ మగచాట్లున్నను
త్రోవలు తప్పవు మహాపురోగమనములో
కేవల మవతారమ్ములు
దేవునియడుగులు సమస్తదేశమ్ములలో.

45

చేరినబండినుండి విలసిల్లెడివారు మఱే యెడారిలో
యీ రమణీయ విశ్వవృషభేంద్రులఁ ద్రోలి; సువర్ణదివ్య శృం
గారములిచ్చి బండికి సుఖమ్ముగ మేతలుమేపినట్లు వి
స్తారధనమ్ములో మతము చక్కగ మేపెడి లోకమాయెగా.

46

అటు స్వర్గంబునగుల్కువార లిటువిద్యాప్రౌఢులై నిక్కు వా
గ్ఘటు లేమింక జగత్సతీమణి విలాపంబింత విన్నట్లు తో
చుటలేదేమిటొ! విన్నచో నిగమతేజుల్ కర్మశూరుల్ మఱిం
తటి కష్టమ్ములలోఁ గృశింతురఁట సౌందర్యప్రసంగోదయా.

47

ఆలోచించుడు వచ్చెద
వీలైనప్పుడు కవీంద్ర! వినిపించుడు నీ
నీలాల కటంచు జనియె
కేళీక్రియ రవీంద్రుడస్త గిరికిం త్వరగా.

48

చుక్కల నీలిచీర కడుసొంపుగదాలిచి పానపాత్రతో
ఒక్క మలాయతాక్షి సుముఖోజ్వలయై యరుదెంచి యెంతయో
మక్కువతోడ నివ్విధము మంజుల పంచమ కోకిల స్వరం
బక్కవిసార్వభౌమునికి హాయిగ వీనుల కెక్క బల్కెరా.

49

ప్రళయగళము పగిలి రాగవహ్నిరగిలి
మండుచున్న మంటెన్నాళ్లనుండి మ్రింగి
శోకభీకర నీలమేఘాకృతి వయి
యీ చతుస్సముద్రము లూపితీవుసుకవి.

50

అంత మైమఱపుతో నెంతెత్తుపోతివో
హాయి యేకొమ్మలో కోయిలోయి
వింత మెలుకువతో చింతించుటెక్కడో
చెల్వులేపూదిగ చెల్వాలోయి
కపటాకునుడులతో నవసిపోతేలకో
విందు లేకెమ్మావి చిందులోయి
చిరునవ్వుపువ్వుతో మఱగక్రాగితివేల
నుడుకు లేబడబాగ్ని దుడుకులోయి

తీయతీయని సంకెళ్లువేయవోయి
పూలవెన్నల కెరటమ్ములేలవోయి
మధుసముద్రరక్తము పిండి మాన్పవోయి
విధినిషేధాలులేని కవివికదోయి.

51

శ్రవణసౌఖ్య మధురసప్రసంగవిహంగ
రాజ! కవనభువన రథ బిడౌజ!
ముద్దులొలుకు కులుకు ముత్యములుకురిసి
మొన్న తెనుగుతోట మొగ్గతొడిగె.

52

తలఁపుగుంపులు మేలికలపు కెంపులు చేసి
బృందావనాలు లేపించినావు
కూనరాగమ్ములు కొమ్ముటేన్గులజేసి
గజయీతగాళ్ల నిగదిపినావు
అక్షరమ్ములు చిట్టియప్సరసలుజేసి
కావ్యరాసక్రీడ గఱపినావు
యుగయుగమ్ములు సేత బిగబట్టి పాడిజేసి
వింతచరిత్ర పుష్పించినావు
అవని నెంత తలనయిన నణచినావు
చిన్నితలనైన పెన్నిధిజేసినావు
విశ్వకర్త నెదుట నిలబెట్టినావు
నీకెవడు సాటి కవిరాజ! లోకమందు.

53

గర్జింతివిగాధ కంఠీరవమ్ముతో
శార్దూలమత్తేభ సంఘమందు
వెల్గించితివి కీర్తి వీర శౌర్యములతో
దిగ్దంతిదంతభిత్తికలమీఁద
మురిపించితివి మూర్తి మోహనాక్షరములతో
కావ్య గంగాతరంగములపైన
శాసించితివి ధాత్రి సౌందర్యరచనతో
ప్రకృతి లక్ష్మిమణివలపులోన
చక్కిలిగిలి మఱుఁ గెక్కడెక్కడబెట్టి
పండువెన్నెలింత పిండినావు
కవికులజనకా! జగత్పాలకుడవీవు
నీకసాధ్యమే ధ్వనించదెపుడు.

54

ఉమ్మరుఖయాము; కోమలి
కమ్మని వాగ్వైఖరి కెల్ల కౌతూహలివై
ఇమ్మెయి పల్కెనుహృదయము
చిమ్మిన భావమ్ములెల్ల చిరునవ్వులతో.

55

ఏ సరసప్రసంగము సహించను శీధువు ముందు తెమ్ము నా
కోసి విభావరీ! మృదుమహోజ్వల దివ్యకిశోరి! యీకళా
భ్యాసము కోస మీ తనువువన్నెలుచిన్నెలు తెచ్చుకొన్నదో
హాసిని ! పానశాలకెవ్వరైన సరే! మఱిరాక తప్పదే.

56

ఇదిగో! యీ మధుపాత్రలో వరిమళంబెచ్చోటలేదింక, ని
య్యది యెన్నెన్ని తపంబులోసలిపి దివ్యక్షేత్రమందెన్నడో
కద సంప్రీతిగఁదెచ్చుకొన్నది; కళాకాత్యాయనీ! దీనిలో
మృదుమాధుర్యరసమ్ముఁ గైకొనుటకే యీ పుట్టువుల్ ధాత్రిపై.

57

నిర్మలరాగభాగ్యరమణీమణి! నీకు రవీంద్రుడెకడో
ధర్మరహస్యభాష్యము సుతారముగా వినిపించెనేమొ త
న్మర్మము నీవుడాచినను నాకది తేలకపోదు కంటిలో
ఘర్మజలమ్ము పూచెడి నిగారపు సంజవెలుంగు మేలిమై.

58

నాకే కారము కొట్టి పోవుటకు చానా! యెంత చాతుర్య లీ
లా కేళీప్రతిభాప్రభావములు సల్లాపమ్ములోఁదేల్చినా
వే కర్కటకరాక్షసీ! ప్రళయపృథ్వీమండలాభీల కాం
తాకాంతారములో విలాసవతివై నాట్యమ్మొనర్పించవే.

59

అనిమిషైకమ్మున మధు పా
త్రను గైకొని విసరికొట్టి దద్దఱిలెడి ని
స్వన గాఢనిశీథిని విఱి
గిన వృక్షమువోలె తూలి క్రిందకొఱిగెరా.

60

దెబ్బతిన్న తమస్విని బొబ్బరిల్లె
విసరికొట్టిన మధుపాత్ర పెంకులయ్యె
వెఱ్ఱిమధుపాన మత్తుకు గుట్టువెట్టె
స్వప్నమై జగజ్జనని యిప్పగిది చెప్పె.

61

నాయెద రుద్రభూమి; భువనస్తవనీయుడు భర్గుడచ్చటె
న్నో యుగరాజదేహములు నోర్వని రక్కసిమొండెముల్ జగ
చ్ఛ్రేయముగూర్చి కాల్చిమసిజేయదొడంగె మహాభయాన కా
ధ్యాయము లెల్లజూతురుసుమా! బహుజాగ్రత నన్నుగాంచుచో.

62

నాయెద రుద్రభూమి! దహనంబయి పోయెడి జన్మలెన్నియో
రేయిబవళ్లు మండి చెలరేగి పెరిల్లిన చిట్లి పెట్లి ప్రో
గై మెఱిరించి బొగ్గు బ్రతుకై నివురించెను బూదికుప్పలై
యే యవతారమూర్తి తలయెత్త తరంబెటుగాదు నమ్ముడీ.

63

నాయెద రుద్రభూమి; ఖననంబయినట్టి సహస్ర భాగ్య ధా
రేయులు విఱ్ఱవీగి తెగ ప్రేలిన ప్రేలుడు నీరగంధ మే
మై యణగారెనో కని జయధ్వజమెత్తుడు ధూళిధూమమై
పోయెడి సర్వగర్వబలముల్ కలుముల్ నిలబెట్టగల్గునే.

64

నాయెద రుద్రభూమి నయనంబులు పూడి మదించి ధార్త రా
ష్ట్రీయులు క్రుళ్ళిక్రుళ్ళి గవులిప్పుడు కాకలుతీరినట్టి దే
శీయుల కిచ్చిరేమొ దరిజేరిన నక్కలు పైకిలాగి పై
వాయసకోటికిం విసరివై చుటచూడుడి డాగబోకుడీ

65

నాయెద రుద్రభూమి జననంబు విచిత్రచరిత్రనాటకంబై
యెవరెవ్వరిందు తగినట్లుగ పాత్రలు దాల్చుచుందురో
తీయనిరాగ మూర్తులయి తేల్చిరికాని మఱింత నాటకా
ధ్యాయమునుండి యెచ్చటికి తర్లుట? నాటకమాడబోకుడీ

66

నాయెదరుద్రభూమి రతనమ్ములు కుల్కెడి పూర్వ పుణ్య గం
గాయమునా తటీకట వనద్రుమ పుష్పసుగంధ మాధురీ
గేయ లతాద్విరేఫ మృదుకిన్నరకింపురుష ప్రలాపముల్
మాయము కాక మానవు సుమా! గతిలేవిట వాటికాగుడీ.

67

నాయెద రుద్రభూమి మఱునాటికి డాచెడి లుబ్ధమేళముల్
దోయిలియొగ్గి డాచుటకు దోచిన విచ్చుటకేమి నేను తే
నీయను తెచ్చినం మొదలనీయను తొల్లిటి పుష్ప వాసనల్
పోయినవెన్నడో మురిసి పోకుడి కూలెడిగాలి మేడతో.

68

నాయెద రుద్రభూమి శ్రవణస్మరణీయ కథాకళాపగా
తోయ మనోరమాంచమధుపర్కమార్ద వమర్ద నవ్రతా
ధ్యాయనిమగ్నులైన వివిధాగమవేత్తలు భస్మధారులై
పోయిరి మాధవీప్రణయపుష్పపరాగము మంటలార్చునే?

69

నా యెదరుద్రభూమి నవనాగరికుల్ చుఱుకైనచూపుతో
కోయిలగొంతుకోసి తళుకుల్ బెళుకుల్ కొలబోసి వ్రలో
ప్రేయసికై మనోహరపరిమళహర్మ్యముకట్టవచ్చు, గా
నీ యెపుడైన, నొక్కమణినేని మఱిక్కడ లేవదీతురా?

70

అందములో మెఱుగులకై
నందనమై మొల్కనవ్వనవ్వేడి నా ఆ
నందనటపత్రశాయివి
కుంది తెపుడు నన్ను గూర్చి నోలెత్తి కవీ!

71

కవితారాజ్యముకట్టబెట్టితిని నాకవ్యగ్రణీ! యెంతయో
స్తవనీయప్రభురాజమండనుఁడవై త్వచ్ఛౌగ్యచాతుర్యవి
శ్వవివేకోదయ దివ్యకావ్యమురళీవాత్సల్యముల్ పల్లవిం
తువటంచాశలు పెట్టుకొంటిని మఱుల్ దోసిళ్లతో దోతువా?

72

అదిగో! యెన్ని మహానదీనదములాహ్లాదప్రవాహమ్ములై
యుదయశ్రీనవరత్నమీన శివనాట్యోత్సాహభాగ్యమ్ములతో
హృదయాలెమ్మెయిధారఁబోసెనో కవీ! యీక్షించుమీ! నీవు నీ
చదువుల్ శోకపయోధులై బ్రతుకు భిక్షాపాత్రఁగావించుటా?

73

దోరలై నీగ్గెడివారిపజ్జఁబడి వీధుల్ వెంటవ్రేలాడి యు
త్కర రాజీవదళాయతాక్షికి మహాసహ్యాంబుపుట్టించి దు
ర్భర దారిద్ర్య దవాగ్ని కాష్టములుగా క్రౌర్యంబుతో మండి ని
ష్ఠురముల్ గ్రక్కెడి యీ బకాసురులకై శోకింతువా సత్కవీ?

74

అందఱికంటెనిన్ను మహితాత్మునిగాఁగని విశ్వమాత సం
క్రందనవజ్రకార్ముకపరాక్రమవాక్కునొసంగి సంతతా
నందరసాభిషేకనయనమ్ములతో భువనైకమోహన
శ్యందన మెక్కఁజేసెనుగదయ్య! కవీశ్వర! విస్మరింతువా!

75

అని జగన్మాతయు నదృశ్యమైనవెనుక
మెల్ల మెల్లగా తొలికోడి మేలుకొలిపె
కాకిగోలలు దిశకెక్కి కలవరించె
తూర్పుకొండపై నినుడు ముద్దులు చిగిర్చె.

76

అంత విచిత్రమైనకల హాయిగఁజూచి కవిత్వరాజు వి
భ్రాంతిగలేచునట్లుటు ప్రభాతముపూచిన పూలతోటలో
నింత కళారవీంద్రుడు కవీంద్రమునీంద్రసురేంద్రకోటి రా
ద్ధాంతముతోడ నుమ్మరుఖయామ సమీపము జేరెవింతగా.

77

పగిలినపానపాత్రఁగని పక్కననవ్వె ఖయామ దానిపై
నిగనిగలాడుచున్న కమనీయలతా రమణీయ శిల్పముల్
మిగులుట దేనికో యని నిమీలితుఁడై కవితాసుధారసా
పగ దుమికించుచుండె నవపల్లవ విశ్వవిపంచి కుల్కతో.

78

పగిలిపోయిన యీ మధుపాత్ర నౌర!
ము న్నెవరిమన్నుతో చేసుకొన్నదో కద!
యిన్ని నగిషీలకే ముద్దులెల్ల రిచ్చి
పెంకులైనవెనుక విడిచిపెట్టి రకట.

*

అసలు శిల్పమ్ము కుల్కుచున్నందువల్ల
మట్టిపాత్రయే మధుపాత్ర పుట్టువేళ
శిల్పమే లేనిచో నన్ని యల్పమగును
చెప్పు మే మహాశిల్పిదో చిత్రశాల.

80

శిలలు కోమలములై చిరునవ్వు చిగిరించి
నీ యులిముందు వంచినవి తలలు
మణులు రాజిలి రాజమస్తకంబుల కెక్కి
నీచల్వ నేలించె రాచకొల్వు
చట్టుదేవుడు దొడ్డకట్టడమం దుండి
నీదయచే పూజనీయుడయ్యె
మరలు ప్రాణమువచ్చి కఱవుకాటకమూడ్చె
నీపున్నెమున నేడు నెగడినవయ
నిన్ను కన్నులకద్దుకొనినపు డింక
కుంచెతో స్వర్గ మవనిపై దించగలవు
సృష్టికర్తపుష్టి మాఱి నీదృష్టిఁ గలదు
జీవధనహంస! శిల్పకళావతంస.

81

ఉమ్మరుఖయ్యామ! అదిగో!
క్రమ్మర యేతెంచుచుండెఁగ రవీంద్రుడు చి
త్రమ్ముగ వేల్పుల గైకొని
రమ్మని లెమ్మని యుషుతదార నుడివె వడిగా.

82

ఉడుతదారా! మఱచ్చటికి నొక్కడ వేగితి? గంతుచిందులె
వ్వడరిగనేనికూడవు; సభాసదులందరితో రవీంద్రుడి
క్కడకరుదెంచుచుండులకొ కాంతువుసీవని లేచి మద్యముల్
గడగడ త్రాగి త్రేపుచు పకాపకనవ్వుచు విప్పకంఠముల్.

83

అచ్చటికింక చేరు సురలాగి మొగాడిగచూచి యేమిటో
ముచ్చట? యేమిచూచుకొని పొంగుట? పొర్లుట? వీనిచెల్వులే
యచ్చరగుంపువచ్చి కొనియాడి వరించిరటంచుఁ గాలుఁద్రిం
దెచ్చట నిల్వకుండినదొ? యేగి కనంవలెనంచుసాగిరే.

84

ఈవిధమెన్నడో నుదుట యీశ్వరుడే లిఖియించినాకు రా
జీవదళాయతాక్షిని రుచించుసుధారసపాత్రనిచ్చి నాఁ
డీ వసుధాతలాన, పరమేశ్వరుడిచ్చిన యాజ్ఞమీరుటా?
దేవుని వజ్రశాసనముఁ ద్రిప్పెడివాఁడిల పుట్టలేదురా?

85

ఇచ్చిన తన్వుదేనికిమహీ స్థలి పెంచుట? క్రుళ్లుబుద్ధితో
పుచ్చుటకా? చలించెడి గుబుళ్లకు తోళ్లయి హీనమౌటకా?
వచ్చిన యింతియిచ్చు మధుపాత్రను గైకొని ప్రొద్దుబుచ్చరా?
చచ్చినవెన్క-నిన్ను నిముసమ్మిక నీగృహముండనిచ్చునా.

86

సుఖమేదో కలుషమ్ములంచనెడి శిష్టుల్ దీవెనల్ దివ్యస
మ్ముఖులై యిచ్చుటదేనికే? యఘచయమ్ముల్ మోముపైరుద్దనా?
నఖపర్యంతము సౌఖ్యభాగ్యఘనసౌందర్యమ్ముకై యా చతు
ర్ముఖుడే నాకు ఘటించి యిచ్చెనని బాబూ! నీవు భావించుకో?

87

అంతమధుపాత్ర కే తీర్థయాత్రతూగు?
ఇంతకుసుమకోమల గాత్రి కెంతమురియు?
విశ్వవీణాస్వరాలాప వివరమేమొ?
ఉమ్మరుఖయాము లేనట్టియూరు కలదె?

88

ఈ సుధలెల్ల వచ్చిన రవీంద్రమునీంద్రులు విన్నవారలై
పానవిలాసమూర్తిని సెబాసని మెచ్చిన బుద్ధిమంతులై
వేనకువేలు చుట్టుపరివేష్టితులైన ముహూర్తమందు ప్ర
జ్ఞానిధియై రవీంద్రుడు రసజ్ఞునికిట్లని చెప్పె వేడ్కతో.

89

వక్తలువచ్చినారలు సభాసదులందరినుండు మాధురీ
సూక్తులుకొన్ని తెల్పుకొనుచొప్పున చెప్పెదరంట, మీర లా
సక్తిగవిన్నచో నిక ప్రసంగము సేతురటంచు మాల్మితో
వ్యక్తము సేయ నుమ్మరుఖయామిటులాడెను మందహాసుడై.

90

వక్తలులేకపోరు; నవపల్లవవాక్కులు కులుక్కొట్టఁగా
వ్యక్తముఁగాక కంఠములు బ్రద్దలుకొట్టుకొనంగఁ జొత్తు రే
ప్రోక్తములో వచించి పదభోక్తలు; ధోరణివండి ధారుణీ
రక్తముపిండి రాగమధురమ్ములు పాకముపట్టుమాటలా?

91

ఆగుము కొంచె ముమ్మరుఖయామయ! వ్యాసమునీంద్రుడెంతయో
వాగనుశాసనుండు కవిపండితలోకవిభూషితుండు స
ర్వాగమవార్ధిఁ దచ్చి పరమార్థరహస్య జగత్కథాకళా
రాగరసప్రవాహములు రాసులుపోయును జెప్పనీయుమీ.

92

చెప్పుటకేమి! పూర్వమువచించెనుగాదటె! రాగభోగముల్
తప్పనివ్యాసమౌని, మునితల్లజులందఱు, స్వర్గభూమిపై
నిప్పుడు సేయుచున్న పనియేమిటి రంభసుఖమ్ములెక్కటా; నో
ర్విప్పుటదేనికింక? పృథివీతలమేలుఁడి పానపాత్రతో.

93

వ్యాసుఁడు కోమలుండయి కృపారసపల్లవ వాగ్విలాస బ్రా
హ్మీసుముఖోజ్జ్వలుండయి రవీంద్రుని కిట్లనె, దేవతామహో
ల్లాసకళాకలాపజయలాలసమానసరాజహంస లె
న్నో సుకుమార మంజులమనోహర నాట్యము సేయునట్లుగా.

94

పూచినచెట్లు ఝొమ్మ్మువిఱపుల్ కొఱకే పడికొట్టుకోళ్ళ పై
శాచికకామరోగ మధుశాల వసంత శకుంతకోటికే
వీచక గాలి జాలిపడి విశ్వకుటుంబముకోసమెంత వీ
రోచితమైన సేవ ప్రతిరోజొనరించెనో పారజూడుడీ.

95

భోగపరాయణుండయిన భూపతివల్ల దరిద్రులై ప్రజల్
వేగినగూడ, రాజ్యపదవీవ్యసనోజ్జ్వలనాయకాళితో
ప్రేగులు త్రుళ్ళిపోయినను విద్యలు నేడు, రవీంద్ర! కానరా
దే! గణుతించుటల తిలకించకుడీ మధుపాత్ర సౌఖ్యముల్.

96

మందాకినీ కళానందోదయకిశోరి
విశ్వవిజ్ఞానవివేకభిక్ష
నందనోద్యాన వనలతాసుహాసిని
నిర్మలానిలదివ్యధర్మరక్ష
శుభగీతికాలాపశుకపికార్యకలాప
ప్రేమాభిషేక పవిత్రదీక్ష
కర్మయోగవిశాలఘనకౌశలవిశేష
శౌర్యసౌందర్యవృషభతితిక్ష

పగిలి పెంకులయ్యెడి మధుపాత్ర యిదునె?
పాత్రధారులందఱు భక్తిపరవశు లయి
సృష్టికర్తదయారసదృష్టి కెక్కి-
వెలుగుడీ! త్వమే వాహ మన్వాలుగు నింక.

97

వ్యాసుని కడ్డము వచ్చి మ
హాసాహసమున ఖయ్యాము వ్యాఖ్యానముతో
శాసించువానిమాదిరి
వ్యాసంగ మ్మిట్లు చేసె బ్రహ్మాండముగా.

98

కుండకు సొట్టపడ్డ దనుకో యది కుమ్మరివాని లోపమా?
కుండది లోపమా? యనిన కుమ్మరిదే యని చెప్పకుందువా?
గుండెలు జారనేల? మఱి కుమ్మరి తప్పును తీర్చి దిద్దుకో
కుండునె? వ్యాసమాని! కను లుండినవానికి లోటు తీరదా?

99

చెప్పులు వాకిటంపడలి చేరుదు రేమిటి దేవళమ్ములో?
గొప్పలు తేకపోగ మఱి కుక్కలులాగెడి చెప్పులే గదా
యిప్పురుషోత్తముల్ తొడిగి రెప్పుడు బైటికి వచ్చి గైకొనుం
డప్పరమాత్ము డిచ్చిన ననాంతలతాంతరసాభిషేకముల్.

100

ఈ సెలయేటిప్రక్క- మొలకెత్తిన చక్కనిగడ్డికూన లె
ప్డో సొగసైన మేలితలపుల్ వలపుల్ పువుబోడు లేము; వి
శ్వాసము నూపుచున్నవి గభాలున ద్రొక్కి- తుపాను లేప కు
ల్లాసిని యిచ్చు మంజులకళామధుపాత్రను స్వీకరించుమా.

101

మక్కువపుట్టునట్లు ప్రతి మద్యఘటంబు పడంతి కాంచి యే
చిక్కులు చూడనీని సరసీరుహలోచన మాధురీకళా
దృక్కులు చిలుక్కునప్పుడు విధేయుఁడు విశ్వమనోహరుండు; కై
పెక్కెడిదాఁక ద్రాక్షరసమిచ్చెడి కామిని యున్న చాలదా?

102

మధుపానంబు దురంతపాప మగుచో; మాత్సర్యదుర్బుద్ధితో
రుధిరాన్నంబు గ్రహించు టెంత యఘమో, క్రూరస్వభావమ్ముతో
వధ కేమాత్రము నేను కాలిడక శుభ్రజ్యోత్స్న కెమ్మోవితో
మధువుంగ్రోలి చరించుచుండెదను రమ్యాలోకసౌఖ్యమ్ముతో.

103

మధురస్మేరకపోలపుష్పవనసామ్రాజ్యంబు పాలించుచో
అధికారాతిశయమ్ము వోయి పదవీవ్యామోహముల్ స్రగ్గి స
ర్వధరామండలమైన తుట్టతుదకుం వర్జించఁడే త్యాగియై
మధుసే వెంత మహోపకారకళయో మర్యాదగా జూడుమా.

104

సభ రాణించెను గాని లెండి; కవితాసంస్థానమం దెందఱో
సభికుల్ సద్రసికుల్ మహామహులు స్వేచ్ఛల్ వచ్చి దర్బారుతీ
ర్చి భరోసాలువెలార్చి విశ్వమురళి ప్రేమాభిషేకమ్ముతో
విభవంబుల్ మినుముట్టునట్లు జయముల్ ప్రేలించుచున్నారయా.

105

ఆకాశవాణి యెచటో
ఆకైవడి విన్నవించినంతనె సభికుల్
చీకాకై పయనించిరి
యీకవితాజైత్రయాత్ర యీక్షించుటకై.

106

ఆ గొడవెందుకే మనకు హైమవతీ! మధుపాత్ర యిమ్మి నేఁ
డీ గుబులెత్తిపోయెదఁగదే వధుశాలకుఁ దిర్గి దివ్యలే
ఖాగమవేత్తలెల్ల రుచిరామృతపాత్ర ధరించకుండ ఏ
యోగముఁ బట్టలేరు కనలోకెడి కలెకెడి వెంత తీపియో.

107

నా రతనాలమొలకా! వలచినా డెచటో బ్రతుకింక ఈఊహాం
గీరుఫలమ్ము నేఁడు తిని నీవు మనోహరమైనచో సమా
చారము నీ పరిమళము చప్పున జెప్పు సమస్త మీవు నా
కై రుణపడ్డ మాడ్కి నిను హాయిగ కమ్మగ కోసి తిందుగా.

108

అసలు లతాంగి! నీ చిగురుటాకు దుకూలము తాకినంతనే
ముసరిన దేహతాపములు మొత్తముమొత్తము జారిపోవు దు
ర్వ్యసనము దుష్టదుర్మదము రాగపిశాచము నీవె మైనచో
దెసలకుఁ దెల్లవారగలదే యిఁక? ద్రాక్షరసమ్ము నీగదే.

109

ఇచ్చట చింతచెట్టయితి నేను సుహాసిని! ఏదుచెల్వలో
ముచ్చట నాదుదేహమున బుల్బుగఁ బట్టెనుచింత చచ్చినన్
మెచ్చెడి పుల్లు చావదుసుమీ! శతకోటి సహస్రజన్మలై
వచ్చెడి యీప్రసూనమధుపాత్ర పరీమళశక్తి యేమిటో?

110

రసహీనం బయి మొండిజన్మ యయి నిర్వ్యాపారనిద్రాణమా
నసమై కన్పడు ఱాతిబండలను విన్నాణంబుగా వేదుకం
టె సదా ప్రేమరసాభిషేకమురళీ నిర్వ్యాజ సౌందర్య సౌ
ఖ్యసరోజాక్షివి నిన్ను వేడిన మహాకైవల్య మబ్జాననా!

111

తపసుల్ కైవడి తిష్టవేసి భగవద్ధ్యానమ్ములోఁ జొచ్చిన
ప్డు పగధ్యానము మీఁదుమిక్కిలయి వేపున్ గాని నాదివ్య సౌ
ఖ్య పరిష్కారిణి నిర్మలంబయిన నీ ధ్యానమ్ములో మున్గుదో
నపు డేమాత్రము నన్ను ముట్టదు పరధ్యానమ్ము నిక్కమ్ముగా.

112

అవిగో! పుష్పము లెన్నియో హృదయసౌఖ్య శ్రీసుగంధమ్ముతో
భువనంబుల్ కుదియించి మేలికవనంబుల్ చిల్కనే కొంచె మా
యువో యీ కాయము నంటియుండగనె నేఁ గుత్సాహ బృందావనో
త్సవ మం దిర్వుర మట్లు తన్పుదము కాంతా! విప్పు సౌందర్యముల్.

113

ఏ క్షణమైన నిన్ను గననేని మహాప్రళయస్వరమ్ముతో
వీక్షణ కింక నా హృదయవీణయతంత్రులు మారుమ్రోగునో
యిక్షులతాంగి! యే అలికి డేని జనించిన నీ పటం చెటో
పక్షిగ లేచుచుందు భగవంతునికై యిటు లేడ్చుచుందునా?

114

కలికీ! నీ అపురూపసౌఖ్య రస మాకంఠమ్ముగాఁ ద్రాగినం
దుల కేమీ యెటువైపుఁ జూచినను విద్యుద్దీపికా రత్న పు
ష్ప లతాతన్విగఁ గాంచవచ్చితివి యీ సౌందర్యపట్టాభి షి
క్తుల కే దిక్కున గిట్టునట్టి దీక్ష లేదో స్వర్ణ సౌదామినీ.

115

అన్నిట యోగభోగవరుఁడై ప్రతిరో జపరంజి కేసులే
తిన్న నవాబు మన్నయి గదే కనిపించెసతమ్ము మంటినే
తిన్న గులాబు లెంత కళ తేలి మనోహరమొల్కఁబోసె నా
అన్నువమిన్న! పేదతిక మన్నది ప్రేమకు వంక బెట్టునా?

116

సుక మిచటే గడించుటకుఁ జూడు మజస్రముపీటవైచుకొం
టకు సహితమ్ము భూమియు కనంబడ దక్కఁడ బొందియున్న దే
యిఁక కనిపించ దేమియు మఱేటికి స్వర్గము? దానిగూర్చి వే
గక తలలేనియప్డు తలక ట్టిటువైపు బిగించు టంగనా?

117

ఈవు రసప్రవాహమయి యింపులు కెంపులు రాశిపోయు చు
న్నావు కిశోరి! నీ మనమునం బ్రతిబింబితమైన నేను సం
జీవసుధామయూఖుఁడను నిర్మల ప్రేమ తరంగడోలికా
భావ మనోహరం బయిన స్వర్గముఁ జూతము కౌఁగిలింతలో.

118

మేరువువంటి ధీరుఁడును మెల్లగఁ జారును పంచబాణ తు
ష్కారములైన కీరబలగంబులు ముట్టడి వేయువేళ ధి
క్కారము సేయలేఁ డెవఁడు కామిని! నీవు త్వదీయవీర శృం
గారబలమ్ము నా వెనుకఁ గావలి యున్న జయింతు లోకముల్.

119

పైకముతో వసంతవనవల్లభుఁడై రసికుండు దివ్య సు
శ్లోకము లెన్నియో మృదువచో మధుభాష్య మరందబిందు వా
ల్మీకముగా రచించు మురళీ! మెగబోతును నీదుమాధురీ
పాకముతోడ నేను రసవంతముచేసి చతుస్సముద్రముల్.

120

శ్రీగళశోభినీ! మొగలిరేకులు అంపములైనఁగూడ ని
న్నాగటు లున్నదో యచట నక్కి మదీయ విలాసజన్మ యు
ల్లో గడుపంగ లేనె? కలహించెడి నొచ్చెడి వెన్నియున్న నీ
రాగ నికేతనామృత పరాగపరీమళ సౌఖ్యకేళిలో.

121

అతిరథులు మహారథులు జయమ్ముకొఱకు
ఎత్తు లెత్తి కోపులుకాది యల్లగడులు
గజ తురగభటశకట వర్గములు నడుపు
పెద్ద "చదరంగబల్ల" యీ పృథ్వియెల్ల.

122

కణకణ మెల్ల తొల్చి త్రిజగమ్ము లమాంతము దద్దఱిల్లగా
గణగణ మ్రోగి జీవులకు కళ్ళెము లాంగి యెడారి కేగి ధా
రుణి నణగారిపోయెడి స్వరూప మనోహరభాగ్య మీవు నీ
మణినిలయంబు చేసితివి మాధవి! ప్రేమకు మించి చూతునా.

# తోరణాలు

1

ఈ యుగభాగ్యరేఖ లుదయించెడి కన్నుల వెన్నెలందు గం
గా యమునా సరస్వతులు గంతులు చిందులు ద్రొక్క కావ్యకే
ళీ యువతీలలామలయి లేచి ముదమ్ముగ కృష్ణమేఘ ధా
రేయములై స్మరించుచు వరించుచుఁ జేసె జయాభిషేకముల్.

2

ఇంత రసజ్ఞుడింక నుదయించుట దుర్ఘటమేమొ తెన్గు చా
మంతికి నేఁడు తన్మధురమాడను డాంధ్ర పురంధ్రి సౌఖ్య శు
ద్ధాంతము కులుకతో రసవిహారిగ మారిన కృష్ణరాయలై
చింతలుతీర్చు కమ్మని కృషీవలరత్నములిచ్చెఁ గానుకగా.

3

ప్రతిభల్ పండెడి విశ్వమోహనుఁడవై పట్టాభిషేకమ్ములోఁ
గృతికన్యా పరిణేతవై సుమకళా కృష్ణుండవై శ్రావ్య కా
వ్య తురాషాడ్విరదమ్ముఁ దెచ్చి భవనీయ ప్రేమసౌందర్య వా
ర్ధి తరంగమ్ములు రాశిపోసితివయా కృష్ణాయపాలెమ్ములో.

4

ఈ పాపిష్టియుగమ్ములో తెనుగుతండ్రీ! విశ్వబృందావన
శ్రీ పుష్పాకర రమ్యసౌఖ్య కవితా సింహాసనాసీనుడై
యీ పుణ్యాత్ముఁడు నిర్మలాశిషవచః కృష్ణాప్రవాహమ్ములో
నీ పన్నీటిమనస్సులోఁ గలిసెనో నేనెంతు నీ శాంతముల్.

5

గోపాలకృష్ణదేవా !
యే పట్టాలు సరిపోవు హితమందీ చె
ట్టా పట్టాలకు; నిఖిల
శ్రీపుర పట్టాభిషేకకృతిఁ గైకొనుమా.

రసపల్లవపాణీ! అదిగో! ఇన్నాళ్ళెక్కడెక్కడో దాక్కొని దాక్కొని ఈగండుకోయిలెట్లా గొంతు చించుకొని వూరూరా వూరేగుతున్నదో చూడు.

నీచక్కదనానికితోడు కోకిలా! అసహన వికార స్వరూపిణివై కుల మత జాతి రసాల తరువెక్కి మెఱమెచ్చు చిగురుటాకులు మెక్కి నీ కంఠస్వరంతో వైకుంఠం కడదామని కులుకుతున్నావటే కోకిలా? కాకమ్మ కథలతో తన్నులతో ఎంతదానవైనావే !

వినేచెవికిగూడా అసహానం బహూలీపిదని ఋజువుచేయటానికా కోకిలా! గొంతుచించుకొంటున్నావు? నీ అసహన స్వరాలావన ఎంత మకరందం కురిపిస్తున్నప్పటిగ్గూడా నీరూపాన్ని మార్చటం లేదు. తాపాన్ని తగ్గించటంలేదు.

మధ్య నీ గొడవెందుకు? అద్దానికి వెనక వైపు నల్లని కళాయి పట్టివుంటేనే అందచందాలన్నీ అద్దంలో కనపడుతున్నట్లు నీవంటి అసహన జాడ్యోన్మాదులు వెనకవుంటుంటేనే, మాలో అందచందాలు కనిపించేది. అనుమానాల్ని విచ్ఛేదం చేస్తుంటేనే అనంతవిజ్ఞాన భాగ్యం రాశిపడేది. అసహానం పుట్టిస్తుంటేనే అసమానప్రజ్ఞావిశేషం అసలున్నట్లు విస్పష్టం అయ్యేది.

గోలేందుకే కోయిలా — గొంతెండదే కోయిలా
ఆమోడుమోకపై — నాముద్దులొలికించి
తీగ పసికూనలై — త్యాగములు పూయించె ॥గోలెం॥
ఇగురు మామిళ్ళపై — ఎగిరెగిరి వాగావు
వడగాడ్పుదెబ్బతో — పానకము త్రాగావు ॥గోలెం॥
నామహాశక్తితో — నీ మహీతలముపై
గంగవెట్టిత్తావు — కడకట్టు వంచావు ॥గోలెం॥
నా చండశాసనము — నాల్గుదిక్కులకెక్కె
ముక్కోటిదేవతలు — మొక్కిపోవాలింక ॥గోలెం॥
సన్నాయి పూచిన — చిన్నారి నవ్వులో
బ్రహ్మాండకర్తయే — పరవశత్వమునొందె
గోలెందుకే కోయిలా — గొంతెండదే కోయిలా

# ఏం చూచుకొని?

ఇది రసమనోహరగోళం. సుఖసౌందర్య మాధుర్య జీవిత శాకపాకం.

అంతర్ముఖరాజీవకిరణాలు కుసుమించి గుబాళించి, అతిరమణీయభాగ్య విశ్వవిజ్ఞాన ప్రాలేయశైల పీయూషప్రాసాదం ప్రసాదిస్తున్నై.

సుశ్లోక సువిశాల ధర్మక్షేత్ర శతసహస్రకోటి వజ్రవైడూర్య మరకతమాణిక్య కేళీకళావిలాస విరాజమాన సువర్ణశోభిత విప్లవ విశ్వభారత వీరక్షాత్రం మెఱపించి అరిలోకభయంకర శరవీరకృపాణాలు ఝుళిపించి రసాలు కురిపిస్తున్నై

దీన్నే ప్రజలు బహిర్ముఖపాకశాసనపారీణులై ఆనందనాట్యమయూరిణులై స్త్రీ పురుష రేఖావిలాస విశ్వాసవిశేష విద్యుల్లతా కళాకాంతులతో నానాకథాకలాప విలాస పరిభ్రాంతులతో పట్టుకొని ప్రాణప్రదంగా నిలపెట్టుకొని విఱగబడి పగలబడి తన్నుకొని దున్నుకొని మూటకట్టుకొని పోవటానికి మురిసిపడుతున్నారు. ఎగసిపడుతున్నారు.

ఇంత గలభా చెలరేగుతున్న భువనంలో శలభాలై ఎగిరిపడుతున్న గోలతో కలభాలై బలిసిపోతున్న గర్వంతో మహాకీకారణ్యమై వృథాశోకానంతవలాహకమై సర్వసర్వంసహాస్థలి పర్వత పంక్తుల్ని క్రూరమృగనివహాన్ని నిఖిలక్రిమికీటక నిశితనిశీథ ఘోర కాటక రాక్షసుల్ని లేవదీసి దిక్కూ మొక్కూ లేని పక్షిసంఘాల్ని భయంకర సంక్షోభ చేసి దుర్భర విషాదవైతరణి పొంగించి వరదలు పట్టించి లోక భీకర వీరభయానక భీభత్స మహార్ణవం ఘూర్ణిల్లునట్లు

పగిలించి ప్రళయకాలరాత్రి ధాత్రిపై దించి బ్రహ్మాండం గుండె జారి పోయేటట్లు చేస్తున్న మహాదారుణస్థితి చూస్తున్నారు.

అతిలావణ్యమైన హాయులు వొలికించి లయలు తొణకించి విల సిల్లుతున్న యింత అంతరిక్ష వజ్రనక్షత్ర బృందావనోద్యాన మధుర కవితాగాన మందాకినీతరంగ డోలికానంద రసకిశోరి!

ఈ శోకభీకర ఘోరారణ్య భేతాళ పాతాళరాజ్యంలో తెగించి నీవేల కాలిడితివో!

ఇంత అనివార్య శౌర్య విలయ వికటాట్టహాస విషపురుషులు నిన్ను గుర్తించగలరా? నీ సుకుమార శృంగార నయనవీధిలో జాగ్ర త్తగా సుతిమెత్తగా వర్తించగలరా ?

ప్రభాతపార్వతీ! తోవలేని ఆకాశంలో దృష్టిలేని సందేశంలో కపోత విఖ్యాత వ్యాఖ్యాత విద్యా వనవిహారుడైన ఆ మహావిద్వజ్జన సార్వభౌముడు చతురబ్ధిసంక్షోభ శబ్దజాల కల్లోలుడై అమాయక ప్రజానీక సంహార బల ప్రౌఢ బ్రహ్మరాక్షసుడై జడిపించి కాళ్ళు ముడిపించి గడగడలాడించగలడుగానీ సువిశాల విశ్వశబ్దవాహిని జగ న్మోహిని జేసి మంజుల మనోహర భావ కవితా మధురానగరిలో లలిత కళా విలాస బృందావనంవేసి నీచకోరదనాలు కమ్మదనాలు చల్ల చల్లని మలయపవనాలమీద ఆనందనాట్యాలు చేయించగలడా ?

శబ్దగౌరవం తెలియని మూఢుడు భావసౌందర్యం గుర్తించని కిరాతకుడు ప్రయోగమనోహరం ఏం కనిపెట్టగలడు? మహాజనాన్ని ఏం కట్టుకోగలడు?

శబ్దజీవిత పారిజాత శాఖోపశాఖ విశ్వవిజ్ఞాన కళాప్రసూనాలు శతశతాబ్దాలుండు నిఖిల మహదైశ్వర్య నిర్మల చైతన్యాలు పోసి

పేర్వాసి వెన్నెలరాశి చేస్తున్న మహావిషయం మఱచి మందులై పిఱికి పందలైమహీమండలాన్ని మోసి పోషిస్తున్న మాటసాగను కుక్షింభరత్వంకొఱకు ఉదరకళ్యాణప్రీతితో నేలపాలై పోయేటట్లు నీచాతి నీచులకు కీచకులకు కట్టబెట్టి చూర్లు పట్టుకొని వ్రేలాడుచున్న సూరిజనప్రముఖులు భావిభాగ్యోదయానికి విముఖులై కాళ్ళు సాచి కూర్చున్నారు చూడు.

వీళ్ళకా? నీ అనుపమానమైన అతిలావణ్యం నీ అనన్య విశ్వవిజ్ఞాన కళాప్రావీణ్యం?

రసమహాసరస్వతీ! నుడులలో మహత్తు కిమ్మత్తు తెలుసుకొన్న చుఱుకైన చూపుకే సమస్త విశాల ధరాచక్రం స్వాధీనం అయ్యేది. సర్వ ధరణీసామ్రాజ్య చక్రాన్ని అవలీలగా తన కోమల వాగ్విలాసంతో నడిపించువాడే జగతీ కర్త్రి కిరీట కవితాసామ్రాట్టు.

మాటకుల్లెకంటే మాటవల్లే సమస్తాధిపత్యాలు సౌందర్య కళాసందసత్వాలు సంప్రాప్తిస్తైయన్న వివేకధనులు ఈనాడు విద్వాంసులు కాకపోబట్టే వజ్రాలకోట కట్టేమాటల్ని బజారు పాలుచేసి మాటమహత్తు కిమ్మత్తు మఱచిపోయినారు.

మదగజేంద్రాల్ని నిలవేశిన మాటలో నిషా పసా తానీషా మాటలో లేదు. మాటలో ఘోర్సు మసీవస్సులో లేదన్నవాడే మహామహులయ్యేది.

రసధునీలలామ! నీ అనంత మధురవసంత ప్రకృతి సౌందర్యసౌధాంగణం చూచి బిచ్చగాళ్లై ప్రొద్దు బుచ్చు కొంటున్న ప్రజ్ఞావంతులే కనిపిస్తూన్నారుగాని నీ అతివైశాల్యమైన ప్రకృతికళా మనోహర వైభవానికి మెఱుగు తెచ్చిపెట్టే జగాజెట్టివంటి కళో

పాసకులు సౌందర్యోపాసకులు నేడు శబ్దగహ్వారం కుదించి భావకుహారం పగిలించి బహువాఙ్మయం గాలించి చూచినా ఎక్కడా తేలటంలేదు

ఇటువంటి గోళంలో రసగౌరీ! నిన్నూ నీ ప్రఫుల్ల సౌందర్యరాగమహోజ్వలం తెలుసుకొనేదెవరు? కలుసుకొనేదెవరు?

మాటలో అనంత ప్రళయశక్తి వుండబట్టే మాట పడ్డవాడు మానుషంతో రోషావేశ ఫాలనేత్రుడై నిప్పులు చెఱుగుతున్నాడు. మాటలో అఖండ సౌందర్య మకరంద భాగ్య దివ్యౌదార్య సౌఖ్య రసానంద స్వర్ణలతారాజ్ఞ్యమహాదేవి వుండబట్టే మాట పాటించి జవదాటనివాడు త్రిజగన్మనోహరుడై కళకళలాడుతున్నాడు

కోట్లు ఖర్చుపెట్టి తయారుచేసిన మహాజన మారణాయుధరాక్షసియైన హైడ్రోజన్ బాంబును చూపిస్తే కోపంరాదు. బాంబు వేస్తానన్నమాటకే ఉగ్రుడౌతాడు.

అంటే మాటలోవున్న సహజ చైతన్యశక్తి మఱేపదార్థశక్తిలో లేదని తేలుతున్నది. అంచేత మాటలే మంత్రాలవుతై. మాయలవుతై మారణయంత్రాలు కాలేవు.

కనుక మాటలో ఇంత శక్తివుందని గాఢవిశ్వాసం ఘనీభవించిన విద్వాంసుడు కడుపుకక్కుర్తికోసం గడపగడపా త్రొక్కి చిలుతలు పట్టుకొని కణతలు పగులగొట్టడు.

అంత నిరంకుశ కళాసౌందర్య జగదేకాంమధ్యుడైన ప్రాజ్ఞుడు రసతరంగిణీ! మచ్చుకు నీ కంటికొకడైనా కనిపించెనా ?

వెంటపడితే పెంటపడుతుందని తెలుసుకోని విద్వాంసులు మాత్రం వెంటబడి వెంపర్లాడి గుమ్మాలు పడుతున్నారు. ప్రాణాచారాలు పడుతున్నారు.

ఈ లేకీమూక రసమనోహార్! నీ తారుణ్యాం లావణ్యాం కాపాడ కలదా ? కలరా పుట్టించగలదా ?

మధురమధురవసంత కవితావన కోకిలస్వామియైన వాల్మీకి అశేషశేముషీప్రపంచవాగనుశాసనుడైన వజ్రవాఙ్మయ వేదవ్యాసుడు భారత భాగవత రామాయణాల్లో సమస్త మనస్తత్వాలు పోతపోసి సౌందర్యరాశిచేసి చిత్రించిన పనితనం నేడు కనిపిస్తున్న అధునాతున వాఙ్మయపు మూసివాయనముతాలో చూపించగలవా ?

ఆ విశ్వవాఙ్మయ కథావిధాత్రులైన వాల్మీకవ్యాసులెట్లా తుదకు కుక్కమనస్తత్వంలోగూడా భారత భాగవత రామాయణ భాగ్యాలు పల్లవింపజేశారో చూశావా ?

అతిప్రేమతో పెంచిన యజమాని కనిపించకపోతే అన్నహారా లుమాని రాత్రింబగళ్లు నానాప్రదేశాలు తన యజమానికోసం కుక్క వెతకివెతకి సీతాన్వేషణతో తిప్పలుపడ్డ రామాయణగాథ తనలో చూపిస్తున్నది.

శృంగారకేళీకళామనోహరులైన రాధామాధవులు గోపికా గోపాలకచక్రివర్తులు ఒకరినొకరు కామోత్కంఠతతో ముద్దులు పెట్టు కొంటున్నట్లు కుక్కగూడా "త్వమేవాహం త్వమేవాహం" అని తన యజమానిని ముద్దుపెట్టుకొంటున్నది అట్లే యజమానిగూడా ముద్దు పెట్టుకొని ద్వైతవిశిష్టాద్వైత అద్వైత భాగవతతత్వాం ఒకశకన్ తన కుక్కలో చూస్తున్నాడు.

ముదిరిపోయిన స్వార్థబుద్ధితో పులిస్తా్రకులమీద కలియబడ్డ కుక్కల్లో కురుపాండవేయులయొక్క మహాభారత సంగ్రామఘట్టతత్వాం చూస్తున్నాడు.

మేఘాలు క్రుమ్మరిస్తున్న అమృతధారలు పరిగ్రహించి మహానదులు ఆనందభక్తిపారవశ్యంతో నేత్రోత్సవములు జగత్కల్యాణమహోత్సవములు చూపిస్తున్నట్లు పత్రికలు కూడా మహామేధావులు అనంత భావాంబర మేఘవిహారం చేసి క్రుమ్మరిస్తున్న వ్యాసాలు మహోపన్యాసాలు ప్రపంచకళ్యాణంకోసం భక్తిశ్రద్ధలతో పరిగ్రహించి రమణీయంగా ప్రచురించాలి. అంతేకాని, ఎలెక్షన్ల పండగ పబ్బాల కోసం, సంక్రాంతికోడిపుంజులమాదిరి పెరిగి యెగిరెగిరి, తనాతన కత్తై తుంపులు తుంపులు కాకూడదు.

|

కలవాళ్ళు కాస్త తెలివిగలవాళ్ళని కుమ్మ్రాంముందు కట్టేసుకొని అపార వ్యాపారలాభాలకోసం ప్రభుత్వాదరాభిమానాల కోసం పత్రికలు పెట్టుకొని బాజాభజంత్రీమేళాలుగా తయారు చేశారు. ప్రభుత్వాధికార్లుగాని, తమ అభిమానపాత్రులుగాని వస్తున్నారంటె యీ రాంభోలుపత్రికలు ఈ బాకాకొట్టుపత్రికలు ముందుపోయి చాలా హడావుడిచేస్తై. ఈ బాపతు సరుకందరికి అవసరమైందేగా !

ఇజముల్ భుజముల్ కలిసిన
ప్రజలో సన్‌లైటుకంటె పబ్లిసిటీలైట్
నిజముగ చాలా ముఖ్యం
అజరుద్రాదులకుగూడ

అంటే పత్రికలన్నీ పబ్లిసిటీ దివిటీలైనై అన్నమాట. ప్రస్తుతం ఏటి సత్తాయింతే. అనాదినుంచి పైకి అయిపూ అజా లేని భగవంతుణ్ణి అందరి మెదళ్ళకి నానారకాలుగా పట్టించ యెన్నెన్నో ఖర్చులు పెట్టేస్తున్న మాటల్లో చైతన్యశక్తి సమ్మోహనశక్తి పత్రికారచనల్లో

పత్రికాసంపాదకులు ప్రపంచ భావిభాగ్యోదయ బాలసూర్యరాజులై కడలిరాయుణ్ణి గడగడలాడిస్తున్నారు. రసభాగ్య సౌదామిని! అయితే పత్రికాసంపాదకవృషభులు కూడా మధురమనోహర హావభావజీవరచనావైదుష్యం మఱచిపోయి కేవలం ఉదరప్రక్షాళన రచనాభాగ్య సంపాదకత్వం చూపిస్తున్నారు ఊకదంపుడు సాగిస్తున్నారు. రామరామ ఏపత్రికచూచినా రుచీలేదు పచీలేదు. పత్రికాలేఖిని రసపటుత్వంతో రాళ్ళేడ్వాలి. మోళ్ళుగుళ్ళుపెట్టాలి. నక్షత్రమండలాలు నల్లపూసలై రాలాలి. సూర్యచంద్రగోళాలు గందరగోళాలు కావాలి. చతుస్సముద్రాలు గుండె పగిలి గుండాలు పడాలి. ప్రపంచదోషవైతరణి క్షీరసాగరమై పొంగాలి. ఇంత అసాధ్యమైన కార్య కౌశలం మేధస్సులో ఇంద్రధనస్సులాగా మెఱవాలి.

అప్పుడు పత్రికావ్యాసమహోపన్యాసం మిన్నుముట్టి సుపర్వకోటి కన్నుకుట్టి పత్రికావిశ్వవిజ్ఞాన సావిత్రీచరణ రాజీవమంజీరాలు చూచి సిగ్గుపడి నిగ్గుచెడి వందిమాగధబృందంమాదిరి గుమ్మాల ముందు చతికిలపడాలి.

రసజగన్మోహినీ! పత్రిక చిత్రికపడితే ధాత్రి ధళుక్కునమెఱిసి విధాతృడులిక్కిపడు అంత ప్రజ్ఞావిశేషవిలాస ఫాలాక్షుడై ప్రకాశించాల్సిన పత్రికా సంపాదకులు పాలడబ్బాలతో తామరడబ్బాలతో యగ్జిబిషన్మార్కెట్లు కేట్లాగుగా బొంతవి భుజాలమీద వేసుకొని సంతలో పంచలచాపులు కొల్లాయిగుడ్డలమ్మేవాళ్ళమాదిరి ప్రతి ప్లాట్ఫారంమీద పాట్లుపడుతున్నారు కునికిపాట్లు పడుతున్నారు. వాల్పోష్టర్లు యాక్టర్లపేర్లు ఊరూరా వూరేగిస్తున్నట్లు ప్రస్తుతం పరస్పరద్వేషరోష పాశుపతాస్త్రధౌరేయులైన పత్రికాసంపాదకులు వారి వారి కులమత జాత్యభిమానుల్ని వారివారి కీర్తిప్రతిష్టలు వెంటబడి

వసూలుచేసిపెట్టే నక్షత్రకుల్ని జగజ్జేగీయమానంగా ప్రకటించి యీ నాటి ప్రజారాజ్యంలో కలహాభోజన ప్రియులై పొట్టనింపు కొంటున్నారు.

ఇటువంటి అభినవ నారదపాత్రధారులైన పత్రికాసంపాదకులకు స్వయంప్రకాశమాన ప్రజ్ఞాపరమేశ్వరులైన జీనియస్సులను కనిపెట్ట గల మనోహర చమత్కారదృష్టి లేదు. బిల్లేగద్దాలు తగిలించుకొన్న పెద్ద చత్వారం పట్టుకొన్నది. వీళ్ళచూపుకి తారతమ్యాలు తెలియవు. వీళ్ళే దేశాన్ని అధోగతిమార్గంలో పెడుతున్నారు. కబోది పక్షులు వ్రేలాడుతున్న వృక్షాలకు భూతప్రేత భయంకర భేతాళ రాక్షసుల గోలే కాపు దిగేది.

ఈ తరహా కాపు దింపుతున్న పత్రికాసంపాదకులకు మృదు మధుర విశ్వకవితాగాన చిత్రనాట్యకళామనోహర వచన రచనా సంపాదకత్వం, ప్రపంచప్రజాజీవిత రాజకీయ ప్రజ్ఞాప్రభుత్వం యెట్లా ప్రాప్తించి మకరందాభిషేకం చేస్తారు ?

అంత విజ్ఞాన ప్రజ్ఞాన చతుర్ముఖబ్రహ్మలై సర్వ జనాకర్షణీయ మధురకవితాగాన లలితకళానంద నాట్యగర్వబర్హిణీపింఛరింఛోళిస్నిగ్ధ గంభీర సహస్రాక్షులై పత్రికాసంపాదకులు పరిఢవిల్లాలి. పుటకలన్నీ ప్రకృతిమనోహరాలు, భగవచ్చిద్విలాసాలు కులికించు ప్రకటనల కోసం వచ్చినైయని అమృతలేఖినీ హస్తలాఘవంతో అమోఘంగా పత్రికాకుసుమ కోమలగాత్రీ మధురమనోహర వసంతనాట్యంతో ప్రకటించాలి. ఆ ఘటికులేరి ? ఎక్కడ ? పవిత్రనదీ ప్రవాహాలు సమస్తభువన జీవనోపాధులకు సౌందర్యకళా చాకచక్యాలకు ప్రాణ ప్రదంగావున్నట్లు పత్రికలు ప్రకాశించాలి. అనంతవిహంగయాన

మేఘాలు క్రుమ్మరిస్తున్న అమృతధారలు పరిగ్రహించి మహానదులు ఆనందభక్తిపారవశ్యంతో నేత్రోత్సవములు జగత్కళ్యాణమహోత్స వములు చూపిస్తున్నట్లు పత్రికలుకూడా మహామేధావులు అనంత భావాంబర మేఘవిహారంచేసి క్రుమ్మరిస్తున్న వ్యాసాలు మహోప న్యాసాలు ప్రపంచకళ్యాణంకోసం భక్తిశ్రద్ధలతో పరిగ్రహించి రమ ణీయంగా ప్రచురించాలి. అంతేకాని, ఎలెక్షన్ల పండగ పబ్బాల కోసం, సంక్రాంతికోడిపుంజులమాదిరి పెరిగి యెగిరెగిరి, తునాతున కలై తుంపులు తుంపులు కాగూడదు.

కలవాళ్ళు కాస్త తెలివిగలవాళ్ళని గుమ్మాలముందు కట్టేసు కొని అపార వ్యాపారలాభాలకోసం ప్రభుత్వాదరాభిమానాల కోసం పత్రికలుపెట్టుకొని బాజాభజంత్రీమేళాలుగా తయారుచేశారు. ప్రభుత్వాధికార్లుగాని, తమ అభిమానపాత్రులుగాని వస్తున్నారంటె యీ రాంభోలుపత్రికలు ఈ బాకాజోళ్ళపత్రికలు ముందుపోయి చాలా హడావుడిచేస్తై. ఈ బాపతు సరుకందటికి కవసరమైందేగా!

ఇజముల్ భుజముల్ కలిసిన
ప్రజలో సన్ లైటుకంటె పబ్లిసిటీలైట్
నిజముగ చాలా ముఖ్యం
అజరుద్రాదులకుగూడ

అంటే పత్రికలన్నీ పబ్లిసిటీ దివిటీలైనై అన్నమాట. ప్రస్తుతం వీటి సత్తాయింతే. అనాదినుంచి పైకి అయిపూ అజా లేని భగవం తుణ్ణి అందరి మెదళ్ళకి నానారకాలుగా పట్టించ మెన్నెన్నో ఖర్చులు పెట్టిస్తున్న మాటల్లో చైతన్యశక్తి సమ్మోహనశక్తి పత్రికారచనల్లో

కెక్కించి సంఘసంసారాలు జగన్మనోహరాలు చేయువచ్చు. అది మాత్రం ఇల్లే.

రసకల్లోలినీ ! ఇంత వాఙ్మయ జగచ్చక్రం ధరించి సమస్త మనస్తత్వాలు గుర్తించి వివిధ వేషధారణ లతిచాకచక్యంగా వహించి రంగభూమిపై నాట్యనటనా నైపుణ్య లావణ్యం నటించి చూపించే నటకాగ్రేసరచక్రవర్తితో విశ్వమహాజనజీవితకల్పవృక్షం కుట్మలించి కుసుమించి పుష్పఫలభరిత శోభాయమానంగా విరాజిల్లుతుంది.

అయితే నాటకాలకు నాటకాలు భట్టీపట్టి అనర్గళ గఙ్గాప్రవాహాలవంటి జటిలపదభూయిష్టమైన సమాసాలు పుక్కిటబట్టి మాసాల తరబడి గండూషించి నఖశిఖ పరీత సమస్తశల్యావశీకృత కరచరణాది నయనాభినయభంగిమాలు విజృంభించి గొంతుచించుకొని జుట్టు విరబోసుకొని కడవపోతగా కన్నీరు కురిపించి గ్రుడ్లురిమి పిడుగులు రాల్పించి రంగమంతయూ నిశ్చేష్టనిశ్శబ్దనిర్జీవమయంచేసి అయోమయావస్థ చూపిస్తున్నప్పటిగ్గూడా అది నటనా కౌశలం కానేకాదు.

అసలు నాల్గుపద్యాలుగాని నాల్గుగేయాలుగాని నల్గురు నటీనటులు తీసుకొని ఖండాన్వయం చేసుకొని యేపాత్రకు ఆపాత్ర తమకు కావల్సిన డైలాగ్సు పాత్రౌచితీభాగ్యంతో అప్పటి కప్పుడే యెవరికివారు కల్పించుకొని నటించి చూపించాల్సిన నాటకాలు చూపించటంలేదు.

భాషాపుష్టి భావనాదృష్టి మృగ్యమై లలితకళా ప్రపంచ నిర్వీర్యులై కేవలం యీ నాటి నటులు తండ్రి కలిపి ముద్దచేసి పెడుతున్న విస్తరిదగ్గఱ పిల్లవాళ్ళమాదిరి అన్నిరకముల మాటలూ వ్రాయించుకొని వల్లించుకొని జల్లించుకొని సందర్భశుద్ధిలేని సంగీ

తాన్ని రాతుసిబొగ్గు పోగమల్లే భూమ్యాకాశాలునింపి కళాప్రళయం చూపిస్తున్నారు.

ఈనాఁడు నాల్గుపద్యాల్లో భావభాగ్యం గ్రహించి వాటికితగ్గ రంగాలు వేషాలు విభజించుకొని నటించటానికి గుండెలున్న నటు డొకఁడు లేఁడు. వారసత్వంగావస్తున్న బానిసత్వం చూపిస్తున్న భటుఁడున్నాఁడు. తండ్రి పెట్టిన ముద్దల్ని నోట్లోపెట్టుకొని పలురకాల అభినయాలతో దవడాడిస్తున్న పిల్లలమల్లే, కవి తయారుచేసిపెట్టిన వాటిని నమిలి నటిస్తున్న మహానటీనటులున్నారు. అట్లాకాదని ఛాలెంజిచేసి కవ్వించే నటకాగ్రేసరుడున్నట్లైతే, ఈ "పట్టాభిషేకం" తీసుకొని, ఋతువర్ణనందగ్గఱనుంచి పాత్రలు విభజించుకొని డైలాగ్సు కలిపించుకొని నాటకంగా ప్రదర్శించి నటనాకౌశలం చూపొచ్చు. ఈ కావ్యంలో ఆసత్తాగూడా చూపించా. ఇంతసత్తాచూపించలేని, పరాధీనమైన నటుల్ని బట్టే కవులుకూడా వాళ్ళకుతగ్గ నాటకాలు వ్రాసి పెడుతున్నారు. మోసి పెఢుతున్నారు.

నాల్గుపద్యాల్లోగాని నాల్గుగేయాల్లోగాని నటీనటులకు కావల్సిన నాటకసామగ్రి పట్టించియివ్వటానికి కవులకేమో వ్యంగ్యభావ సంధానచాకచక్య శబ్దసౌందర్యమహాధ్వనిపుష్టి రసదృష్టి కావాలి. కవులపసగూడా దీంతోనే తేలేది. "నాటకాంతానికవిత్వం"

అట్లా కవిసామ్రాట్టు తయారుచేసి నాల్గుపద్యాల్లో బిగించి యిచ్చిన నాటకకథాసృష్టిపై చిత్రి తెల్సుకొనే పదునైన మెదడు నటీనటులకుండాలి. అటువంటి కవులతో నటీనటులతో సంఘానికి వీర విజ్ఞానచైతన్యభాగ్యం బాగావస్తుంది. స్వతంత్ర జ్ఞానపుష్టిపడుతుంది.

లేకపోతే పరాధీనమైన హీనాతిహీనమైన బ్రతుకులు మెతుకుల కోసం ఎగబడతై. అధోగతిలో దిగబడతై.

నటరాజు తనముందు కళకళలాడే అమూల్యమైన లలితకళా రామసీమ సౌందర్యరసమనోహరప్రకృతిస్వభావచైతన్య పరిణామా లెప్పటికప్పుడు గుర్తిస్తుండాలి. దాంతో తమలోవున్న ఆనందరసాను భూతి కళాప్రసూనవిన్యాసములు పూయిస్తుంది. నటుడు, కవితా ఘటికుడు పిసినిగొట్టుగా వుండరాదు. దయాదాక్షిణ్యాలు దర్జాలు చూపాలి.

సంధ్యాలతాంగి నారింజరంగుచీరెతో తేలిపోతున్న నీలిమబ్బుల్లోంచి మెల్లగాచల్లగాదిగి నవరత్నమీనకిశోరాన్ని కడలికెరటాల తూగుటుయ్యాలల్లో బుజ్జగించి గండుకోయిలస్వరంతో జోలపాడుతున్నసోయగం నటసామ్రాట్టు మహాసముద్రుడై కనిపెడుతుండాలి.

సముద్రగర్భితమైన సమస్తమహదైశ్వర్యాలు శతసహస్రకోటి తరంగాలతో విలసిల్లుతున్నట్లు, విశ్వమానవమనస్తత్వాలు, అపూర్వ ప్రకృతిరమణీయకళాసౌందర్య శౌర్యగాంభీర్యాలు నాట్యాచార్యులు నటీమతల్లులు తమతమహృదయ సరోవరాల్లో మనోహరజలక్రీడలాడేటట్లు రసపరవశులుకావాలి. కళాగీర్వాణీసువర్ణ చరణకమలాలు మధురభావకిరణాలుపూచేట్టు రసపిపాసకులు కావాలి. ఉపాసకులు కావాలి.

పాత్రౌచిత్యం గుర్తించకుండా రంగసందర్భం పాటించకుండా శ్రీకృష్ణపాత్రధారి శయ్యాతలంమీద శంఖచక్రగదా పద్మధారుడై భుజకీర్తులతో నవరత్నకోటీరంతో తయారుకాగూడదు. రారాజైన దుర్యోధనపాత్రధారి, కట్టెలు నరికేవాడు గొడ్డలి భుజంమీద పెట్టుకొన్నట్టు గదాయుధాన్ని భుజంమీద పెట్టుకొని రారాదు. కూడా

సేవకుడిచేత పట్టించుకొనిరావాలి. పోలీసినెస్పెక్టరు తుపాకి భుజం మీాద పెట్టుకొని కేసు పట్టుకొంటానికి రాడు.

మహావీరుఁ డేసమయంలో ఎట్లావుంటాడో, మహాభీరు డేసమ యంలో ఎట్లావుంటాడో నటుడు తెలుసుకొంటుండాలి.

సహజస్వభావం అచ్చుగ్రుద్దినట్లు చూపటానికి స్త్రీ వేషానికి స్త్రీనే తెచ్చి వేషంవేయించి చూపటం కళారంగానికి నగుబాటు. సహజసౌందర్యం చాతుర్యంతో చిత్రించడానికి చిత్రకారుఁడు శ్రమ పడకుండా, తుమ్మచెట్టు డ్రాయింగువేసి చూపించటానికిబదులు చిత్ర కారుడు తుమ్మచెట్టుకి తుమ్మచెట్టే పెళ్ళగించితెచ్చి ఇదే నా చిత్ర లేఖనాశిల్పవిశేషమని బోకరిస్తే వొప్పుకుంటారా ?

దీనికొప్పుకోనివారు ఆడపాత్రకు ఆడదాన్నే తెచ్చి బులిపించి చూపిస్తున్నారు "కవితల్ సెప్పిన పాడనేర్చిన వృథాకష్టంబె; యీ బోగపుంజవరాంగ్రడేగద భాగ్యశాలినులు" ఈమహా దారుణ కామినీ దుర్వ్యసనకాలమహోత్స్యానికి చూడు శ్రీనాథుడెట్లా చింతించాడో పూర్వం.

మగవాఁడే తన నటనాశేముషీపటిమతో ఆడపాత్రవేసి అత్య ద్భుతంగా వొప్పించాలి. దానికి బుర్రకావాలి. పొడుంబుర్రకాదు.

కాగితాలమీాద సుతారంగా తయారైన జపాను నీటిబొమ్మల్ని కాస్తఉమ్మి ఖర్చుపెట్టి సునాయాసంగా పిల్లలమాంతం కాగితముల మీాద చూపిస్తున్నట్లు నాట్యాచార్యులు నటీరత్నాలు కవులు వ్రాసి పెట్టిన నాటకకథాభినయ పద్యగద్యగేయవిషయాలున్న పుస్తకాలు కొనుక్కొని వల్లించి పుక్కిటబట్టించి నానా రంగులహంగులతో నగి

షీలుతీర్చిన చమికీదుస్తులతో ప్రేక్షకమహాజన ప్రోత్సాహ కరతాళ ధ్వనులతో చుట్టూతా మద్దతిస్తున్న సనంతమైన వాద్యాలతో తెర చాటునుంచి రంగంమీద దిగి తైతక్కలాడి చెమ్మచెక్కలాడి గొంతులుకోసుకొని సంగీతాలు క్రుమ్మరించి భూజనధనమానప్రాణాలు కుదించి కొల్లకొట్టుకొని పోతున్నారు. అవలీలగా అనాయాసంగా అరగంటలో అయిదువందలరూపాయలు నటీనటులొక్కొక్కరు వర కట్నాలమాదిరి పట్టుకొనిపోతున్నారు.

రాత్రింబవళ్ళూ గొడ్డూ బిడ్డా పాటుబడి పెట్టుబడి పారబోసి రైతురాజు సంవత్సరానికి వందరూపాయలు మిగలక పునూరుమని అసువులు విడుస్తున్నాడు. ప్రతి ఉద్యోగధర్మ నిర్వహణ కర్మశూరుడి గ్గూడా సంవత్సరం మొత్తంమీద యిట్లా రాబడి ప్రోగువడటం లేదు. చూడు

తమాషాగా నాటకాలాడితే యెంతగొప్పగా ధనం ఘనం ప్రోడిపడుతున్నదో ఇదే తెల్సుకోవాలి. పైగా ఈ నాటకకళాసార్వభౌములు తమ శల్యగతమైన నాటకాలే ఆడటానికి జబ్బలుకొట్టుకొని బొమ్మలుపెట్టుకొని పట్టపగ్గాలేకుండా మహాజగద్విఖ్యాత బిరుదులతో సంచరిస్తున్న మొనగాళ్ళు భటుడువేషందగ్గఱనుంచి పాదుషావేషందాఁకా ఔచితీసౌందర్యంతో వొప్పించటానికి గుండెలు జారిపోయి బాగా నెమరుకొచ్చిన పాత్రేదైతేవుందో అదే నానా తికమకలతో చూపిస్తున్నారు.

రససుందరీ ! ఈ నటీ నటులు వాళ్ళపై ముద్రపడ్డ పాత్రతోనే నాటకకళకు పులిష్టాప్పుపెట్టి, అతి మనోహరమైన నాట్యకళల్ని

ముందుకుపోనీయకుండా బందిరిదొడ్డికిత్రోలి కళలు బక్కచిక్కి బొమికల ప్రోగయ్యేటట్లు చేస్తున్నారు.

కేవలం డబ్బుకోసం నాల్గురకాలైన నానా దేశ వేషగాళ్ళని పాటగాళ్ళని బిగించుకొని తులాభారమో ఇలాభారమో చూపి పోతున్నారు. నాటకం ఆడతామని ప్రకటించి అడిగే దిక్కులేదని నాటకం పాడి పోతున్నారు.

అసలు ప్రజలెంత అమాయకులైపోతుంటే ఈబాపతు నానా నాటకాలాడే వాళ్ళకి అంత మెఱుగ్గావుంటుంది.

వీళ్ళు సావిత్రి సీత దమయంతి మొదలైన వీరసాధ్వీమణుల్ని సంఘంలో తిరిగి తలెత్తకుండా, ఆ నాటకాలు కట్టిపెట్టి ద్వీపాంతర వాసాలకి తరిమేశారు. లేక ఆనాటకాలే ఆడిఆడి మళ్ళీమరామత్తుకు రాకుండా హాజామత్తు చేశారేమో! బహుశా అదే అయివుండవచ్చు. కురుక్షేత్రసంగ్రామంమాత్రం మిగుల్చుకొన్నారు. దాంతో సూర్యోదయందాఁకా గొంతులుచించుకొంటున్నారు. చివరికి పుస్తకాల్ని చూచుకొనినైన సంతోషించటానికిలేకుండా చేస్తున్నారు. నాటకాలాడుతుంటేనే నాటకాలచ్చుబడి ప్రజల్లోకొచ్చేది. విజ్ఞానాలిచ్చేది.

అయితే! నేను మొదటచెప్పినట్లు నటీనటులు జ్ఞానధనులై నాటకకళ చూపించటానికి కవులు నాటకం కొద్ది పద్యాల్లోనే మాట లేమాత్రంలేకుండా వ్రాసివ్వాలి. వాటిని చక్కగా ప్రదర్శించి సంతోషపెడుతున్న నటీనటులు నాటకాల్ని చదువుకొని సంతోషపడటానికి పద్యగద్యగేయాలతో నాటకాల్ని రెండోరకంగా కవులు

వ్రాసివ్వాలి. ఈబాపతు చదువుకొంటానికితగ్గట్లు వ్రాసే నాటకాలు కేవలం గద్యంతోనే పూర్తిచేసి సంతృప్తిపడవచ్చు.

ఈనాటకాలాడే నటకాగ్రేసరచక్రవర్తులంతా సమైక్యతతో లలితకళాప్రపంచభాగ్యోదయానికి సంఘంగా నిలబడి ప్రభుత్వంవారి ద్వారా వజ్రశాసనం పుట్టించి ప్రతివూరి సినీమాహాలువారిచేత విధిగా నెలకు రెండునాటకాలేవో ఆడించుకొంటున్నట్లైతే యిట్లా నాట్యకళకి చీడ పట్టేదికాదు. సినీమాలిట్లా మెగబడేవికావు

సినీమాహాలువాళ్ళు వాళ్ళస్వంతఖర్చుతో నెలకు రెండునాటకాలేవో తప్పకఆడించేటట్లయితేనే, సినిమాహాల్సుకి, సినీమా డిస్ట్రిబ్యూటర్సుకి, సినిమాలు తయారుచేయిస్తున్న ప్రొడ్యూసర్సుకి లైసెన్సు లిచ్చేటట్లు గవర్నమెంటువారిద్వారా నాటకకళాపరిషత్తువారు నటీనటులంతా కలసి శాసనం పెట్టించుకొని అమలు జరిపించుకొని తీరాలి.

అంతపని కట్టుదిట్టంగా జరిపించుకొన్ననాడే యీసినీమా యుగంలో నాటకకళ నాట్యకళ బ్రతికేది. నాటకాలు తలెత్తేది.

ఆనందరససుందరీ! గ్రీజ్ రూమ్మీదా ఆర్చిస్ట్రామీదా ప్రాణాలుపెట్టుకొని కోటాలుకొట్టుకొని పటాటోపాలు బిగించుకొని, కంట్రాక్టర్ల కృపారసప్రసాదం పరిగ్రహించి, డ్రామ్‌టర్లని రెండువైపులా భుజకీర్తులమాదిరి తగిలించుకొని ఆడుతున్న సావిత్రినాటకంలోంచి తారాశశాంకంలోకి బొబ్బిలియుద్ధనాటకంలోంచి గయోపాఖ్యాన నాటకంలోకి బదిలీలుకొడుతున్న నాట్యాచార్యులు రంగమార్తాండులు జగజ్జేగీయమానంగా చెలామణి కాబడుతున్న రోజులలో నాటకం కేవలం కబళం కోసంకాదు నాటకం కళకోసం అని నవరత్నస్థగితవాగ్వి

లాసంతో విశ్వాసం విజ్ఞానం వట్టించి చెప్పేమహోపన్యాసకులు నాటక కళోపాసకులై బయల్దేరని కారణంతో సుతారమైన సున్నితమైన నాటకకళ బహుగిరాకియై నాటకకళామనోహారి యేకాకియై యేడుస్తున్నది.

ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడన్న సంగతి తెలిసికూడా తన అప్రతిహతమైన గదాకౌశలాన్ని ధృతరాష్ట్రుడి దగ్గఱ ఏవిధంగా చూపాలో తెలిసియేద్వాక, గ్రుడ్డిరాజుముందు పంగిడిగూడెం గారడీ సాహెబు మాదిరి సాముగరిడీలు చేస్తున్న నాట్యాచార్యుల్ని చూచి యెంత సంతోషించాలి ?

తన పోర్షన్‌లో గుర్తుకోసం బ్రాకెట్టువేసి వ్రాసిన విషయాల్తో సహితం భట్టీపెట్టి రంగంమీాద యథేచ్ఛగా స్వేచ్ఛగా జలద గంభీర స్వనంతో విశదం చేస్తున్న నాటకరంగ భేతాళసామ్రాట్టుల్ని చూచి కలానికి వస్తున్న నవ్వులు నాల్గు సముద్రాలైనై.

ఈ బాపతు కవి పండిత వేదండాల్లోంచి, పత్రికాసంపాదక లలితకళాతుషారాట్టుల్లోంచి నటనా ప్రపంచ రావణ మైరావణ బ్రహ్మల్లోంచి తయారైన మహానుభావులు అజానుబాహులు మానవ సేవా పరాయణులై నిలసిల్లుతున్న యీనాడు

నాయకులెందఱో పొడమినారు వినాయకులై కళా జగ
న్నాయకులై మఱెందఱు ఘనంబుగ లెక్కకు వ్రేళ్ళకెక్కిరో
యీా యుగవాణి వేయు చెవినింక మహాజనులార. సూర్యనా
రాయణమూర్తిలో వెలుఁగురాఁగల నాయకుఁడేడి చెప్పుడీ!

రసరాణీ! ఇట్లా నీ అద్వితీయ కళా మనోహార భువనంమీాద తండులధ్వంస కర్తలై దిగజారుతున్న బొాగ్రలతో కనిపిస్తున్న వివిధ

విజ్ఞాన ప్రజాప్రపంచనాయకులు నీకూ, నీ నిష్కామయోధులకూ ఎంత బాకీ పడినారో చూచుకో.

నిర్వాణహాసుహాసినీ! పిచ్చిమారాజులై వీరమూర్తులై తమతమ వీరనారీమణులైన యిల్లాండ్రతో వజ్రాల కొడుకులతో మండిపోతున్న ప్రళయ మారణహోమగుండాల్లో దూకి ఉరికంబాలకెక్కి, ఇనుప కోరలమధ్య నొక్కిపట్టి ప్రాణాలు పోనీయకుండా హింసిస్తున్న కారాగారములలో తిండికిమాడి చలికి వాళ్ళు ల్లులుపడి సమస్త జగదేక వీరజీవితాలు పగులకొట్టుకొని, రసవాణీ! శాసనలెట్టివో యెఱుగని యీ నిరంకుశ ధన భోగలాలసులకు, ప్రపంచ మహాజనసేవ గిట్టక యేటవాలు తత్వాలు బిగ్గబిగిసి బలిసిన యీ హేమాహేమీలకు సుకుమార సువర్ణ సింహాసనాలు తయారుచేసిన మహాత్యాగాలు శౌర్యాలు నీవుకూడా మఱచిపోలేదుకదా!

రసభవానీ! కులపర్వతాలు గిరగిరా తిరిగినప్పటికీ, సప్త సముద్రాలింకి నిర్జలప్రదేశాలై పెద్ద యెడారులై యెండి మండి పగిలిపోతున్నప్పటికీ యీ ప్రపంచాధీశులైన నాయకులు పాలకులు ఉదయం శాసించిన శాసనం సాయంత్రానికి నాశనం కావాల్సిందే అజీర్తి రోగపై శాచికి పల్లెపట్టాణాలమీద పడకుండా రేషన్ బాంబు ప్రయోగించి మహోపకారం చేసిన యీ నాయకవరేణ్యుల్ని మఱువలేరు దుష్ట దైత్యులు జన్మించిన పాపిష్టి విషయఘడియలే యీ మహా నాయకులు యీ పెద్దతలలు సింహాసనాసీను లైనప్పుడు మళ్ళీ కనిపిస్తున్నై.

రస జగజ్జననీసంతానములారా !

పాతర్లు జాతర్లు — బ్రహాండంమట్టుకొన్నై
తల్లడిల్లి దడ్దరిల్లి — వల్లకాళ్ళు మండుతున్నై
నదీనదాలు మహావనాలు — అధోగతులతో వృధాలయిపోతున్నై
ఆపండి ఆపండి — ఆపండి జాతర్లు
దిక్కులన్నీ పిక్కటిల్లి — ముక్కచెక్కలవుతున్నై
ఫెళఫెళా ఫెళఫెళా — ఫెళఫెళా విఱిగిపడె
నక్షత్రగోళాలు — నల్లబై ఖగోళాలు
లేవండి లేవండి — లేవండి చావక
పాతర్లు జాతర్లు — బ్రహ్మాండం ముట్టుకొన్నై
బలాబలాలు — కళేబరాలు
బలేగతేలెనై — జిలేబిచుట్టలై
చూడండి చూడండి — చూడండి చుట్టూ సముద్రం
గిరగిరా గిరగిరా — గిరగిరా తిరిగెరా
సుడిగుండం — యమదండం
గుడిపిండం — బ్రహ్మాండం
హరహరా — హరహరా
పాతర్లు జాతర్లు — బ్రహ్మాండం ముట్టుకొన్నై

ఇంతమహాఘోర ప్రళయతాండవాలు ఈప్రపంచప్రజాప్రభుత్వ మహోదయమంగళారావాలుకాబోలు. ఈప్రభుత్వ నియంతలు.

కులంనిషా — మతంనిషా
అహర్నిశా — ఎక్కించి
ఎక్కించి — ఎక్కించి

ప్రజలకు — అధికారులైనారు
బధిరాంధులైనారు — జోగులార
ప్రేగులార - ఎండిపోయిన - ఎముకలార.

రసలహరీలలామ! ఏ ఆఫీసుల్లో చూచినా ఏ దొడ్డిలో చూచినా బెత్తెడుజాగా కూర్చునిజావ త్రాగటానికి లేకుండా చెట్లునాటారు. పళ్ళికలెత్తుకొని తట్టలెత్తుకొని పాట్లుపడుతున్నాగా ఇనా వంట చెఱకు వ్యాపారంకూడా చేసి ప్రభుత్వాధినాగారం భక్తి చేయటానికి నాయకులంతా గొడ్డళ్ళధరించి మొక్క మొక్కనాటుకొచ్చిన మొక్కల్ని పడగొట్టటానిగ్గానుల్లు సుముహూర్తాలు పెట్టేస్తున్నారు.

అన్నపానాలకు ప్రాజెక్టులు ప్రారంభించటానిగ్గామల్లు మహా నదీప్రవాహాల నోళ్లొత్తబోతున్నారు. అమాయక ప్రజానీకంలో అఖండ విద్యాసాగరుల్ని తయారుచేసి పెట్టటానిగ్గాను పల్లెటూరు బడిపంతుళ్ళచేత చెత్తా చెదారాలూడ్పించి రాసులు రాసులు పోయిస్తున్నారు.

రస కళాకుసుమ కోమలగాత్రి! ఈ నాయకుల హయాంలోనే హరిజన సేవ హరిహర సేవైంది. వీళ్ళ పెత్తనం పెట్టిపోతున్న రోజుల్లోనే వీళ్ళధర్మమా అంటూ ఊరూరా క్షయరోగ ఆస్పత్రులు విరివిగా నెలకొల్పుకొని వస్తున్నారు. వీళ్ళ యేలుబడిలో ప్రజలెంత ఆయురారోగ్య భాగ్యవంతులై వర్ధిల్లుతున్నారో యింకా వేరే చెప్పక్ఖర్లేదు విదేశీ వస్తువస్త్రాలకంటే స్వదేశీ వస్తువస్త్రాలెంతో గిరాకీ చేసి పరిశ్రమలన్నింటిని మళ్ళీ యే శ్రమలేకుండా ప్రోత్సహిస్తున్నారు

మద్యపాన నిషేధచట్టాంతో కట్టుబెట్టంగా భట్టీలింటింటా జోరు చేసుకోనిస్తున్నారు. రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్య విస్తరణ

కంటే బ్లాక్‌మార్కెట్టు విస్తరణం లంచగొండి విస్తరణం ఎక్కువ చూపిస్తున్నారు అధికార్లంటే నిర్భయం అవినయం అతిసులువుగా నేర్పి ప్రభుత్వాన్ని పెళుసు చేసి పారేస్తున్నారు.

ప్రళయలోక భైరవీ! అవ్యాజ కరుణా కటాక్షంతో కారాగృహాలన్నీ ఖాళీచేసిపారేస్తున్నారు. నిమిషం తీరికలేని నిరంతర నిర్నిద్రావస్థలో అనిమిషత్వంతో భువన పర్యటనంచేసి వస్తున్నారు. ప్రపంచ ప్రళయాలుచూచి విశ్వవిద్యాలయాల్ని తిరుపతి వేంకటేశ్వర స్వామికి మీదుకడుతున్నారు. ఎప్పుడేవేవి తారుమారయ్యే పరిస్థితి విరచుకొని పడుతుందో అని తిరిగి సరిహద్దులన్నీ బందోబస్తు చెయ్యటానికి బౌండరీరోడ్లు నగిషీలు చెక్కి తయారుచేస్తున్నారు.

కొన్నాళ్టికి ఆయుధ విసర్జన శాసనం బిగించి సైనికులందటి చేతికి నాశికా కేశోద్ఘాటనచేసే తంటసాల్ని సమర్పించే జ్ఞానమార్గం త్రొక్కపోతున్నారు. రామాయణంలో రాముడొక్కడితోనే కథా వస్తువు తయారుకాలేదు. రావణాసురుడితోగూడ కథరక్తికట్టింది కనుక, రామరాజ్యంతోనే మహాత్ముడికథ రక్తికట్టదని, రావణ రాజ్యం రామరాజ్యంకలిపి చూపిస్తున్నారు. ఆర్థిక మంత్రులు అవస్త్రమంత్రులు విద్యామంత్రులు ఫిర్యాదుమంత్రులు సమావేశాలు చేసి సమాలోచనలెన్ని జరిపినా దేశానికి చేయాల్సిన చికిత్సలు శత సహస్రాధికంగా వచ్చి మీదపడుతున్నై.

విచక్షణాస్వరూపిణీ! విశ్వవిజ్ఞాన దాక్షాయణీ! భావిభాగ్యోదయ బాలసూర్యరాజులైన విద్యార్థుల్ని రాజకీయాల్లోకి రాకూడదని రాజకీయ సమస్యలెత్తుకొని నాటకాలాడగూడదని చండశాసనాలతో ముళ్ళకంచె లేస్తున్నారు. తమకవసరమైన ఉద్యమాల్లోకి విద్యా

ర్థుల్నే బాలశూర వీరాభిమన్యుల్ని చేసి దుమికించి దూకులు పెట్టించారు.

రథసారధి - రథసారధి - రథసారధి
విద్యార్థి - స్థిరశౌర్యంతో - శరవేగంతో
చెకచెకచెకచెక - పుడమిరథాన్ని - నడిపిస్తాడు ॥రథ॥
ఉద్యమాలు - సుహృదోదయాలు - హృదయంలోంచి
ఉరికిస్తాడు - నడివడిగా - వరవడిగా
ముందడుగు - అందంగా - వేస్తాడు-కవ్విస్తాడు ॥రథ॥
నాళాలికి - గోళాలికి - గంగాళాలకి
బంగాళాలకి - గందరగోళాలకి - క్రిందిపాతాళాలకి
ఉడుకురక్తం - ఎక్కిస్తాడు - కడలిగొంతు-నొక్కిస్తాడు ॥రథ॥
అక్షరకుక్షికి - యక్షులపక్షికి - ప్రాణంపోసి
గానంచేసి - ఉపాధ్యాయుడై - యుగాధ్యక్షుడై
కళాశాలలో - పరిజాశక్తిలో - ఉఱుములు
మెఱుపులు - ఉఱుములు - మెఱుపులు - పరుగులు
పెట్టిస్తాడు - బ్రహ్మాండ భాండం
పగిలిస్తాడు - భగవంతుని - గుండెలు - కరిగిస్తాడు ॥రథ॥
అధికారికి - రుధిరోద్గారికి - సభికులలో
ప్రభవలలో - చిట్టచివరలో - గట్టిపవరులో
కుర్చీలన్నీ - పర్చేస్తాడు ॥రథ॥
పవిత్రధాత్రికి - ప్రఫుల్ల నేత్రం - ప్రచండధాటికి
ప్రపంచగాత్రం - ఫిరంగిగుండ్ల కు - సివంగిగండ్లు
మనోహరంగా - మనోబలంగా - ఎగబడి

తెగబడి - త్వరబడి - చొరబడి - తెస్తున్నాడు
వస్తున్నాడు - రథసారథి విద్యార్థి ॥రథ॥

రసభారతీ! అంతఅనంతప్రజ్ఞావంతులైన విద్యార్థుల్ని అవసరాల పట్ల ఈ ప్రపంచనాయకాగ్రేసరులు ఎంతో అప్యాయమానంగా వాడుకొని కృతార్థులవుతున్నారు. చరితార్థులవుతున్నారు. అవసరం లేనప్పుడేమో, ఈ విద్యార్థి ప్రహ్లాదుల్ని హిరణ్యకశ్యపులు చండామార్కులకొప్పగించి, చండాలమైన మార్కులతో రిమార్కులతో నానాబాధలపాలు చేస్తున్నారు. ఇటువంటివన్నీ యెప్పటికప్పుడు విచారించుకొని, సరిదిద్దించుకొనటానికి, విశ్వవిజ్ఞాన భాగ్యాలు దినదినాభివృద్ధిగా విరాజిల్లుటకు గాను, విద్యార్థి ఫెడరేషన్ వారు గూడా పట్టుపట్టి తమతరఫున ప్రతిరాష్ట్ర అసెంబ్లీలలో శాసనసభ్యులుగా మంత్రిపుంగవులుగా విద్యార్థుల్ని నిలపెట్టుకొని తీరాలి.

రసప్రసూన కోమలీ! మొన్నమొన్న రాష్ట్రావతరణ కోసం ప్రభలుకట్టి సభలుజరిపి ఉపవాసములుచేసి ఉద్రేకాలూపి పంచభూతాల్ని పంచేంద్రియాల్ని నిర్బంధించి విశ్వమహాజన సముద్రంలోంచి విప్లవబడాగ్ని విద్యార్థికోటితో చిట్లించి పెట్లించి చివరికి డొవిజాన్నిగూడా సిద్ధం చేసుకున్నారు.

విశ్వమాత ముద్దుబిడ్డలారా!
పైమెఱమెచ్చుమాటలకు వాములువాములు మేసి నాయక
స్వాములు రాజకీయ బలపౌరషముల్ దుమికించి రాష్ట్రసం
గ్రామ సముజ్వలాగ్ని శరకాండముపై నవలీల పొట్టి శ్రీ
రాములు ప్రాణముల్ వఱచి రాజసముల్ కొలఁబోసినారయా!

నగా నాణానికి కావల్సిన బంగారాన్ని కుంపటిలో వేసి గొట్టాలతో వూగి కరగించి దిమ్మపైకి తెచ్చి సాగగొట్టి యెవరికి కావల్సిన నగా నాణెం వారు తయారుచేసుకొన్నట్లుగా బంగారంవంటి త్యాగధనుఁడైన ప్రతిఫలవాంఛారహితుడైన పొట్టి శ్రీరాములు జీవితభాగ్యానికి రాష్ట్రోద్యమ ప్రళయవహ్ని ముట్టించి పవిత్రసువర్ణదేహం కరగించి యీనాఁటి ప్రజారాజ్యధౌరేయులైన నాయకులంతా పసిఁడికోటలు సువర్ణ సింహాసనాలుతయారు చేసుకొని పొట్టి శ్రీరాములు ధర్మమా అంటూ ఆంధ్రరాష్ట్రలక్ష్మీవల్లభులై పాలిస్తున్నారు గాని యుగాలు జగాలుపడ్డ యీబాకీ యేనాటికీ తీర్చుకోలేని అమరజీవి పొట్టి శ్రీరాములుగారి అఖండ ప్రాణత్యాగానికి వారి పవిత్రాత్మ శాంతికి భగవత్ప్రీతికి అందటికి ప్రకాశవుండింకూడా "శ్రీ రామ రాష్ట్ర" వల్లభులై ప్రకాశించలేక పోతున్నారు బెజవాడ విజయవాడగా మార్చినట్లు ఈ ప్రజానాయకులు సమస్త దురితదోషపరిహారార్థమైనా ఆంధ్రరాష్ట్రాన్ని శ్రీరామరాష్ట్రం చేసుకొన్నట్లైతే రామరాజ్యాన్ని సంస్థాపింపదలచుకొన్న గాంధీ మహాత్ముని విశాల పవిత్రాత్మకూడా శాంతిస్తుంది.

ఇంత స్వార్థం కరడుకట్టి గడ్డకట్టి మనుషులు విషపుదినుసులై డిప్లమసీ తంత్రజ్ఞులుగా తయారవుతున్న రోజల్లో అంత పరమార్థమే.
రైల్లో జాగా ఇస్తే — జైల్లో స్వేచ్ఛావిహారసౌఖ్యం తెస్తే
అల్లాస్వరాజ్యమొస్తే — ఖిల్లాలన్నీ వరాలక్షేత్రాలేగా !

శాంతరసస్వరూపా ! నీపవిత్రశాంతి సత్యాగ్రహ యాగంతో ప్రపంచాన్నంత పండువెన్నెలచేయటానికి బోసినోటిముత్యాల తొలకరి కులికించావయ్యా?

శస్త్రాదుల్ తెలతెల్లఁబోయెడి యహింసాజ్యోతి వెల్గించి, భూ
చక్రం బీ వాకరాట్సుచక్రముగ నిష్టం ద్రిప్పి యీ సృష్టి ని
ర్వక్రప్రేమ హిమాలయాగ్రమున లేపం దర్శినావయ్యా! రా
జక్రీడాధరణీత్రివిక్రమ భుజస్కంధమ్ముతో బాపుజీ !

రసమందాకినీలలామ ! ఈ మహాత్ముఁడు అహింసావజ్రకవచ ధారుఁడై పశుఒలహింర్యాత్ములిన్ని యెదిరించి జయించి సంపాదించి యిచ్చిన స్వతంత్రవీరభారతక్షేత్రం దురాశాపీడుతులై పరస్పర ద్వేష రోషావేశ నిరంకుశపిశాచనిశాచరులై కుల మత జాతి పార్టీ పక్షు కత్తులతో యెవరికివారు స్వాధీనంచేసుకొనటానికి విడివిడిగా చీలి ఒండొకళ్లు ప్రేలిప్రేలి భూమ్యాకాశాలు ధూమస్తోమ ధూళిధూసరిత భయంకర యుద్ధక్షేత్రాలు చేస్తున్నారు.

మహామేఘమండలాలువర్షించిన కృపారస వర్షధారలతో ప్రపంచభవనం చూరులు కడవపోతపోసి, యీనాఁటి యీవిపరీత దుస్థితిగ్గామల్లు చింతించి చిటపొటి చినుకులు రాలుస్తున్నై.

ఇంట్లో ఎలుకలబాధ ఎక్కువైందని పొలం చొడేసి కలు పెక్కువైందని వృథాగా వొదలేసేవాళ్ళున్నారా? లేనప్పుడు ఈనాడు ఈ వీరభారతదేశాన్ని ఎంతో తపస్సుధారపోసి సంపాదించిన వీర సాహసాలు మహాత్యాగాలు మరచిపోయిన హేమాహేమీల్ని చూచి ఏమనుకోవాలి?

ఒక యింట్లో ఎన్నో గదులున్నట్లు ఒకస్కూల్లో ఎన్నో క్లాసు లున్నట్లు ఒక దేశంలో గూడా అనేక పార్టీలుండవచ్చు. అయితే గదులన్నీ యింటికే అండగావున్నట్లు క్లాసులన్నీ స్కూలుకే పుష్టిగా

వున్నట్లు వివిధవర్గాలు పార్టీలు దేశాన్నే అంటిపెట్టుకొని అందగా వుండాలి.

విశాలభూమండలంమీద ఎన్నిపల్లెపట్టణాలనైనా కట్టుకోవచ్చు మార్చుకోవచ్చు, కానీ భూమివదలి దానికంటె అతివైశాల్యమైన ఆకాశంమీద పల్లెపట్టణాలు కట్టటానికి ప్రయత్నించరాదు.

విశ్వమహాజన ధనుర్బలా!
నీచముగ నిందించకన్నా - అన్నదమ్ముల మాదుమన్నా
కూలిరైతుల కూడదీసి - ధాత్రియే తలక్రిందుచేసి
దివిని భువిపై - దించినాడోయ్
మరువలేని మార్క్సు గురువోయ్ ॥నీచ॥
దేవునికి దేశమ్ముజూపి బోసినోటితో పూజచేసి
జాతిగుండెను కరగినాడోయ్
ఖ్యాతిగా మనగాంధితాతోయ్ ॥నీచ॥
రోసగాడయి చురుకుగాను దేశదేశము తిరిగివచ్చి
తరుముకొని భవితవ్యమునకు అండ జవహారుండుండెనోయ్ ॥నీచ॥
పిడుగుమాదిరి అడుగువేసి పుడమి గడగడలాడ జేసి
దొరలగుండెకు దూసుకొనెనోయ్
బోసువీరుడు పూజితుండోయ్ ॥నీచ॥

ఋష్యాదుల్ని పూజిస్తున్నతత్వాలు రష్యావాదుల్ని పూజిస్తున్న తత్వాలు ప్రజాప్రభుత్వాల్లో జీర్ణంకావాలి.

ఋష్యాదులహృదయం రష్యాదేశాభ్యుదయం
పేలినదిక్కుల్లోంచి కాలినడొక్కల్లోంచి
దేశములన్నిటికీ దూసుకువచ్చిందోయ్
ఋష్యాదులహృదయం రష్యాదేశాభ్యుదయం.

రసవాక్యచమత్కారిణీ! లలితకవితాగానమురళీధరుఁడైన పరాత్పరుడు గోపాలకృష్ణ కిశోర చక్రవర్తియై ఇంత ఘాళ్ళవానలో తలలు చిల్లులుపడుతున్నవాళ్ళదగ్గఱకొచ్చి గోలపడి జాలిపడి గోవర్ధనగిరియెత్తి క్రూరరాక్షసులచేతిలో నలిగినలిగి బలియైపోతున్నట్టి ప్రకృతి రమణీలలామమైన రసకిశోరిని కాపాడి కట్టుకొంటానికి యేయేమహామహుడు యేయేటికెక్కట్టుతీసుకొని యీపట్టాభిషేకానికి వచ్చాడో ఒక్కొక్కర్ని బాగాతనిఖిచేసిచేసి థరుడుక్లాసుటికెక్కల్లే రాశి పడ్డదానికి ఆశ్చర్యచకితుడై నిమీలితనేత్రుడై "పట్టాభిషేకం" ఎవరికో ఎవరికో అని విజ్ఞానభువనం పండిస్తున్న ఋషులనూ విశ్వంభరాస్థలిపండిస్తున్న ఋతువులనూ చూచి తూచి తెలుసుకొంటున్నాడు. త్రిజగన్మనోహరుడై రసకిశోరి నయనవీథిలో కలుసుకొంటున్నాడు.

ఇహాపూర్వంనుంచి బేళ్ళకు బేళ్ళుగుతున్న ప్రబంధ రచనావైదుష్యాలు వాటివాటి గంభీరభావభాగ్యక్రమవినమ్ర చరణకిరణ మనోహరభాష్యాలు సాహిత్య సంక్రాంతి విక్రాంతి కళాదిగ్భ్రాంతి గొల్పుతున్నై.

అతిరమణీయమైన రసప్రకృతి గమనించినట్టి చిన్ని ప్రసన్న కావ్యసృష్టితో సుకుమారసౌందర్యకళాదృష్టితో సంఘ విజ్ఞానమేధా పుష్టి వస్తుంది. అటువంటి కావ్యాలు ఈవినోదవివాద విభేద విశాల రంగంలో కులుతున్నవెన్నో ప్రేళ్ళకెక్కించి చెప్పే నిర్మోహమాట

మైన విమర్శనాఖండలుడు రావాలి. శబ్దఛందస్సు పగులకొట్టించే కావ్యాలుకాకుండా భావమేధస్సు పగులకొట్టించే కావ్యాలేవో చూడాలి. ఇల్లువాకిళ్ళు వాహనాలు నికేతనాలు వర్ణించటానికి, శబ్దజలధి కవిపండిత దేవదానవులు మథనచేసి కథాకథనలావణ్యంకోసం, మనోహరశబ్దచమత్కారవిన్యాసంకోసం, బహుపాట్లుపడ్డట్లు వళ్ళు బిగించి ప్రాణాలు బిగపట్టి వ్రాసిపడేసినగ్రంథాలు చెబుతున్నై. శబ్దనాడిపట్టిచూస్తున్న పండితుడికి శబ్దసందర్భాలు బాగాతెలుస్తున్నై. సమన్వయజ్ఞానబృందావనభాగ్యం ప్రాప్తించటానికి విజ్ఞాననాడి పట్టుకోవాలి. దానికి తరిఫీదైన విద్వజ్జన విజ్ఞానదుందుభి పుట్టలేదు. అందుచేతనే మేధస్సు ఖర్చుపెట్టి తెలుసుకొనే ధ్వనిమనోహరం రసచమత్కారంగలకావ్యాలు సుతారంగా సుకుమారంగా పుట్టటంలేదు. శబ్దాడంబరం, కథాకాలక్షేపజ్వరం గలపుస్తకాలు పురాణాలు విరివిగా విఱగకాచినై. వీటి పుష్టితో సాముగరిడీలుచేస్తున్న సహస్రఫణిఫణాగ్రవేదాంతశాస్త్ర పురాణ హరికథాగానకళాగంధర్వసార్వభౌములకు ఈ "పట్టాభిషేకం" చెప్పుకోలేనంత విపరీత బాధ పుట్టిస్తుంది. అణువులో అనంతమహాశక్తి యిమిడినట్లు బహుసున్నితమైన యీ చిన్నికావ్యంలోగూడా అనంతదిగంతకవితానందనందనోద్యాన మధురవసంతశకుంతమనోహరాలు సరోవరాలున్నై. చిరంజీవివై రసవిహారి! హాయిగా ఇందులోషికారుచేయవోయి.

సమస్తచరాచరజీవకోటిలో ఆత్మప్రవేశించి ప్రకాశించి తనకు కావల్సిన నిర్మలం తన సృష్టిస్థితిలయకారణాలవల్ల, తన మధురాతిమధురసౌందర్య శౌర్య సౌఖ్యపరిణామసంఘట్టనలవల్ల దేనిలో కనిపించక ద్వైత విశిష్టాద్వైత కర్తవ్యాలతో అద్వైతమై అద్వితీయమైన ప్రేమవీరగళంతో "పట్టాభిషేకం" ప్రకటించి ప్రబలించి ప్రదర్శించింది, దానికేనా ఈత్రొక్కులాట? కీచులాట?

నడుంబిగించి పడండిరైల్లో - కేకలుపెడుతూ
దూకులుపెడుతూ - రైలొచ్చింది
మేలొచ్చింది - నడుంబిగించి పడండిరైల్లో
ఐక్యం లౌక్యం - సౌఖ్యంయిస్తే
వాదం భేదం - ఖేదం తెస్తే
నడుంబిగించి పడండిరైల్లో - పిల్లాజెల్లా జాగ్రత్త
మూటాముల్లే జాగ్రత్త - మంచీచెడ్డా లేదా?
ఏంచూచుకొనిపోదా? - నడుంబిగించి పడండిరైల్లో.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## 1

### తో డి మ లు

ఋషులన్నింటిని అలంకారాలుచేసుకొని కులుకుతున్న నీ చక్కదనాలు కవనభువనాలైన శతసహస్రకోటిజీవరాసులకు అపేక్షణీయమై ఆకర్షణీయమై ఆలవాలమైన అమృతప్రకృతీ! వివిధవిధివిధాన విఖ్యాతవిజ్ఞానవేత్తల్ని విలాసాలతో దిలాసాలలో బులిపిస్తున్న నీవు రసకిశోరివి. అవసరాలకోసం ఒకరికొకరు భద్రాజుస్తోత్రాలు చేసుకోకుండా అంతానికే భద్రాజులయ్యేట్లు అందరిజిహ్వాగ్రములందు నీవు మరాళనాట్యంజేసి రసగంగాధరుణ్ణి మురిపించినమాదిరి కులికించు.

### ర స కి శో రి

శ్రీజగదేకసూత్ర! సరసీరుహాపత్రి
విశాలనేత్ర! అ
వ్యాజ కృపాకటాక్ష ఘనభావ
విహార మనోజ్ఞపాత్ర! భ
ద్రాజులు కాగనీకు మృదురాగ
సుధారస బ్రహ్మలెల్ల! సా
మాజిక జిహ్వాలందు రసమాని
మరాళమ! నాట్యమాడుమా.

2

## తొడిమలు

దూరంనుంచి చూస్తున్న మనోహరభావదృష్టి కేమో యీ అనంత ప్రకృతి అప్సరసలాగా రసకిశోరియై, రసికులై మొగబడ్డవాళ్ళ కేమో బ్రహ్మరాక్షసిలాగా మహాంధకారమై కనిపిస్తున్నది. ఈ మహాప్రళయగాఢాంధకారానికి పూచినపువ్వుమాదిరి అభ్యుదయ విశ్వకళ్యాణకళాప్రభాతలక్ష్మి ప్రసన్నురాలవు టెప్పుడో ?

## చీకటిపువ్వు

అణచి పెట్టిన నణగారని యలజడి
వివిధతరంగవార్ధి విలయాలు
చిక్కచీకటిముద్ద గ్రక్కిన గడబిడ
గండశిలలగుండె గాబరాలు
పెరిగి ముదిరి భయంకరమైనయెద రొద
క్రూరఘోరారణ్య రోదనాలు
జడిపించి వణకించు జడివాన దడదడ
నిర్ఘోష జీమూత నిస్వనాలు

ఈ యెద ఝంఝానిలోద్ధూతపటలిపగిలి
కర్మసాక్షి మెల్లగజారి కన్నుమూసె
అభ్యుదయమార్గ నవయౌవనాంగికొఱకు
ప్రేలుచున్నదో తొలికోడి మేలుకొలుపు.

3

## తో డి మ లు

అవస్థలణగారని బ్రతుకులకే కమ్మనికైతపూచినట్లు, అగ్నిదుమారాలు లేపే వెచ్చవెచ్చని కినుకల్లోంచి తొణికిసలాడు వసంత ఋతువు కోకిలస్వరమై మధురసృష్టి పల్లవింపచేస్తున్నది. మండుటెండకు మలయ మారుతం పూయిస్తున్నది.

## కో కి ల స్వ ర ం

అలుకల్ ప్రేల్చెడి దోరటెండపయి
బ్రహ్మాండంబు వేగించి గా
డ్పులు తూర్పారనుబట్టి నిర్ఘరుల
కమ్మో డొక్కలెండించి, చిం
దులు త్రొక్కించెడ వేల నీచిగురువిందుల్
కులుక్ క్రొందళ్కుతో
కలవెన్నో సుఖదుఃఖముల్
మధురతరంగస్వామి! నీగొంతులో.

## 4

## తొడిమలు

ముదిరిపోయిన స్వార్థబుద్ధి పెంకుకట్టినవాడు ప్రతిసంసార సముద్రం లుబ్ధుడై పొట్టపెట్టుకొని రాండోలుపొట్ట దిగజారి నోటమాట రాక కళ్ళుకనిపించక చెవులు వినిపించక దిగజారిన బిరుబొర్రతో లేవలేక ఆవసోపాలతో అఘాయిత్యాలతో తూలుతూ సోలుతూ నానా వీధుల్లోంచి తిట్ల దుమ్ముదుమారాలు నెత్తిమీదపోసుకొని అగ్నికిరీటధారుడై గ్రీష్మఋతునామాంకితుడై ప్రళయకాలవాయుదేవుణ్ణి హడలుగొట్టి యెక్కడా ఆకును కదలనీయటంలేదు.

## అగ్నికిరీటం

స్తంభించెం ప్రళయప్రభంజనునితో
సైతమ్ము; లంబోదరుం
డంభోధుల్ తెగపొట్టఁబట్టి
విపరీతాయాసముల్ త్రోపుతో
సంభావించక యే దుమారములు
విశ్వంబందు లేపించెనో
శుంభత్సౌధములెల్ల మాసి ధనరాసుల్
తీసి తీవ్రమ్ముతో.

## 5

### తొ డి మ లు

కూపస్థమండూకాలైన సనాతనతత్త్వాలు వినూత్నవిప్లవవర్షాల్ని చూసి విశ్వవిప్లవయుగభాగ్యవిశేషసంతోషాల్ని చూచి సహించలేక ఓర్వలేక ప్రేలిప్రేలి పెద్దగోలపెట్టేట్టు ఈవిశ్వవిజ్ఞాన మేఘా లుఱుములతో మెఱుపులతో ప్రళయాంధకారంలో పాతుకొనిపోయిన ప్రవాహాల్ని పర్వతాల్ని కుదించి తొల్కరితల్లియైన వర్షఋతువును చూపిస్తున్నై.

### తొ ల క రి త ల్లి

పిధులుపాడ్లి భీకరములు ప్రేలెడి విప్లవ విశ్వశౌర్య ధా
రాధరపంక్తి గర్జనలు రక్కసిరాజ్యము చిట్లగొట్టి బల్
క్రోధము దూసిపోసి పిడుగుల్ చెడుగుల్ ప్రళయాగ్నిధూమకే
ళీ ధవళాయతాక్షి పగిలించి కుదించె మహాఝరుల్ గిరుల్.

## 6

### తొడిమలు

చల్ల చల్లని దయారస నీలమేఘుస్వాములైన విశ్వకళ్యాణ మూర్తులు సమస్త సంఘాల్లో రంగాల్లో పాల్కడలి కెరటాలవంటి పండువెన్నెలకాయించి చక్కచక్కని శరదృతువును వెల్తురుపిల్ల జేసి చిందులు త్రొక్కిస్తున్నారు.

### వెన్నెలపిల్ల

ఆపద్బాంధవులైన చల్లని ఘనశ్యాముల్ ప్రభాత ప్రభ
త్వోపన్యాసకులై సుధారస తరంగోత్సాహ భాగ్యోదయ
శ్రీపుణ్యంబులు క్షీరసాగరములుద్వేందిఁచెఁగాఁబోలు; నా
నాపాడైన ప్రదేశముల్ సహిత మానందోత్సవాలేలెరా.

## 7

## తోడిమలు

విప్లవకాలమేఘపంక్తి ప్రళయనాట్యాలతో భువనం దద్దరిల్లి దిక్కులు పిక్కటిల్లి సుకుమార నిరంకుశ సుఖభోగలాలసులైన రాజ ప్రముఖుల్లో తీవ్రక్రోధాగ్నిజ్వాలలు చప్పగా చల్లారిపోయి గడగడలాడుతున్న భయం, దురాక్రమణదారులై దురాశాపీడితులై బలిసిపోయిన వాళ్ళు పిల్లగొబ్బెమ్మమొహాలుపడి వణకుతున్న భయం బలగర్వంతో బరాయికోరులై యెగిరిపడి తునాతునకలై కోడిపుంజుయీకలై దూది పింజాలవంటుమబ్బులై తేలిపోయి గోలపెడుతున్న గొప్పవాళ్ళభయం, పట్టపగ్గాలేకుండా మహాధనగర్వంతో పరుగులువెట్టి గుండాలువేసిన వాళ్ళు గుండెలు పగిలిపోయి గ్రుడ్లనీరుగ్రుక్కుకొని గోలపెడుతున్న భయం యేకమై చలికాలమైన కారణంతో హేమంతఋతువు హేమాహేమీలైనవాళ్ళందరి కాళ్ళు ముడుచుకొనేటట్టు చేసి సంగీతరాణి నాట్యం చూపిస్తున్నది.

## సంగీతరాణి

మండి గుండెజ్వాల పండునిప్పులకొండ
చల్లారి నుసియయి జారెనేమొ
కొండంత మనవర్తి తిండిమఱగి మోము
పిల్లగొబ్బెమ్మయై వెలిగెనేమొ
పుంజు ముదిరి మాడు బొచ్చదరి బెదరి
వెయ్యిమెబ్బుతునకలయ్యెనేమొ
పరుగులతో పెద్దనురుగులు చెడగ్రక్కి
గుండాలు, గ్రుడ్లనీర్గ్రుక్కెనేమొ
పసిడిరాసులయిన మేలిపంటచేలు
దక్కనో దక్కవోయని దిక్కులెల్ల
మంచుముప్పటితో లేచి మంచెలెక్కి
గడగడవణకి కాళ్ళేయి ముడుచుకొనియె.

8

తొడిమలు

లోకకంటకులైన రాక్షసులు బొమ్మలు విఱచుకొని మహా ఘోరఘాతుకచర్యలు విపరీతములుచేయటంవూలాన సమస్తైశ్వర్య పత్రపుష్పఫలరసాలు భువనైకరక్షకునికి చెట్లుచేమలు ధారబోసి ప్రశాంతనితాంత తపోధ్యానపరవశత్వంతో శిశిరఋతువును చూపిస్తున్న ఎండుకొమ్మమీద సత్యమూ ధర్మమూ అనే రెండుపిట్టలు తమకింకా ఈలోకంలో పరమేశ్వరుడే దిక్కని బహుజాలిగా చెప్పుకొంటున్నై.

హరేరామ హరేరామ

తొడిమలు తున్గి రాలెడిగతుల్ విపరీతముతొటజేసి అ
ట్టుడికెడి దెబ్బతోడ తరువుల్ బహుమోడయి బోసిపోయి వ
చ్చెడి భువనైకమోహనునిచే చిగిరించెడి యెండుకొమ్మపై
జడిసిన రెండుపిట్ట లతిజాలిగ వాకొనుచుండె గాంచుడీ.

## 9

### తొడిమలు

జగచ్ఛాసన పాలకత్వాలకోసం బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురు (అంటే సత్వరజస్తమోగుణాలు మూడు) మహాసరస్వతి, మహాలక్ష్మి, మహామహేశ్వరీమణుల్ని ఒక్కొక్కరు యిల్లాండ్రుగా తీసుకొని ఆరుఋతువులతో వ్యవహరించి కాలచక్రరథారూఢులై పాలిస్తున్నారు.

ఇక్కడ రసకిశోరి కిసలయపాణియై వసంతఋతువుగా కులికి గంభీరమూర్తియైన సప్తాబ్ధిబడబాగ్ని చతుర్వేదరాజీవముఖుణ్ణి బ్రహ్మగా గ్రీష్మఋతువుతో తేల్చి ప్రేమించి పాలిస్తున్నది.

నీలమేఘాలమధ్య నిలకడలేకుండా కులుకుతున్న మెఱుపుతీగె వంటి చపలయైన మహాలక్ష్మి వర్షఋతువుగా మెరసి సహకార సౌందర్యకవితాగానబృందావనంలో భువనమోహనుడైన నారాయణున్ని ప్రేమించి లక్ష్మీనారాయణున్ని చేస్తున్నది.

దురాశాదురాగ్రహ దురాక్రమణ దుర్నీతి దుర్వ్యసనరోగ సంగ్రామవిహారాలతో మహామహేశ్వరి మహాకాళియై తేజరిల్లి శ్మశానరాజ్యపట్టాభిషిక్తుడై త్యాగరాజైన శివుణ్ణి విశ్వకళ్యాణం కొఱకు ప్రేమించి భువనం పాలిస్తున్నది.

ఈవిధంగా త్రిమూర్తి దాంపత్యాలు త్రిజగన్మనోహరములై కులుకుతున్నై.

## త్రిమూర్తి దాంపత్యాలు

శుద్ధాంత శుభ్రాంశు సుస్నిగ్ధ శృంగార
కిసలయ మృదుపాణి రసకిశోరి
సప్తాబ్ధి బడబాగ్ని తప్తావనీక్రాంతి
భీష్మప్రతాప గంభీరమూర్తి
నీలనీరదరమ్య నిర్మలామృతహార్మ్య
సౌఖ్యసౌదామిని జలజనయన
నవమనోహరగాన భువనబృందావన
రత్నమాణిక్య కిరణధనుండు
శతసహస్రరోగభయ సంసారవనిత
హేయగుణజీవిత కిరాతహితుడు కనుడు
యుగయుగప్రఫుల్ల చిరాయురోన్నతులయి
కాలచక్రశకటమెక్కి యేలిరవని.

10

కథాతలంత్రాలు

కర్ణానందముసేతు సర్వజగదేకచ్ఛత్ర ! శ్రీమన్ మహా
స్వర్ణోత్సాహ కథాసుధార్ణవ కళాసౌందర్య సామ్రాజ్య సం
కీర్ణాశాలత లెన్ని యోకులికి లక్ష్మీరత్న మాణిక్యముల్
వర్ణప్రీతి సుమించి ఘోరభయజిహ్వాల్ విప్పుసందర్భముల్.

11

ఈధాత్రి కీర్తి పూయించి శరద్రాత్రి
పచ్చి నెత్తురుబొట్లు వెచ్చబెట్టి
ఆ రుధిరజ్వాల వీరపాయసమేలి
దుబ్బుకట్టి పొలాలు జబ్బుదట్టి
ఈ యభూత ప్రతిజ్ఞ వేయిపడగలెత్తి
నటనలన్నియు జిత్రపటమునింపి
అంత పద్మవ్యూహమైన ప్రపంచమ్ము
నాల్గుగోడలమధ్య వెల్గజేసి

ఇక జగచ్చక్రవర్తి వాహినిపయిబడి
శాకినీ ఢాకినీ మృదుస్వర విభావ
రీ ప్రఫుల్ల సుహాసినీ ప్రియుడొకండు
నా నయన వీధికరుదెంచె కానుకలకు.

12

ఇతణ్ణిగురించి యిరుగుపొరుగు అమ్మలక్కలు

ఇతఁడకే గ్రామమందింపైన సొంపైన
యిలుకట్టిన ప్రముఖుడెత్తులెత్తి
ఇతఁడకే పెళ్ళింట చతురబ్ధి చతురోక్తి
సిరినింపిన ఘనుఁడచ్చెరువు గొల్పి
ఇతఁడకే కొలములో శ్రుతిచూచి గతిమాచి
పీరమెక్కినదొర విఱ్ఱవీగి
ఇతఁడడే నుడులకున్నతదృష్టి రఫుష్టి
తెచ్చిపెట్టినధట్టు డచ్చుగుద్ది
సీసములుకాచి చెవులకు పోసినట్లు
ఈ యఖండవదంతి బాహిరముకాఁగ
కోటగుమ్మమాతడు దాట గుండెలేక
రంగమార్తాండులను త్రోలె ప్రజలపైకి.

13

ఆ మొనగాండ్రు గ్రామజనులందు జపానుతుపానులూపి సం
గ్రామ పయోధి సంకులము రక్కసులై మినుముట్టజేసి, మొం
తో మొహరీల కాపురముఁద్రోసి విషాదదవాగ్ని విశ్వవా
ణీ మహిళాలలామ కరుణించెడి మానిని బట్టిరక్కటా!

14

గుండెధైర్యం తెచ్చుకొని దుష్టకిరాతకుల్ని పైకిత్రోలిన కౄర నాయకుడు

క్రకచదంష్ట్రాభీల వికచనేత్రాలోల
శౌర్య పాండిత్య శౌండీర్యుడాచు
ప్రళయసింహనినాద భయదమూర్ఛోన్మాద
ఛిద్రముద్ర సముద్రరుద్రుడాచు
కుటిలకర్కశమహా జటిలతర్కవిదాహ
హస్త విన్యస్త మోహాంధుడాచు
విరహజాడ్య వరాహ విలయ మౌఢ్యకరాళ
మక్షిక మధుపానమత్తుడాచు

విదళిత దయాప్రయాగ దుర్మదపరాగ
విషకషాయ దైత్యేభ్యుడై ప్రియుడు గయుడు
కష్టసంసార తిమిరాంగి కలచి తొలిచి
అంత క్షయరోగపీడితుడయ్యె తుదకు.

15

ఈ కిరాతకుడికి చిక్కి రసకిశోరిమైన ప్రకృతి యీవిధంగా శోకాగ్నిలో కుమిలికుమిలి అన్యాపదేశముతో భగవధ్యానమునకు దిగి

రత్నాలుపూచి చిత్రవిలాసములువీచి
కులుకుచున్నది వీనికోఅకుగాదె
వీరమాగాణమ్ము దోరబారి ఫలించి
పరిమళించుట వీనికోఅకుగాదె
నీలిమబ్బులు పైరగాలి చల్వచిగిర్చి
ధరబట్టుట వీనికోఅకుగాదె
చక్కనయ్యలచెల్వు దిక్కులకెగదన్ని
సిరిమెఱయుట వీనికోఅకుగాదె
తునిగి తుహినాద్రి పడినదెవ్వనికోఅకిల
చెట్టుచేమ నోమేజగాజెట్టికోఅకు
ఇంతప్రకృతిసౌందర్య మేనెవనికిడుదు?
జతకురమ్ము కృష్ణకిశోరచక్రవర్తి !

16

రసవిహారి

చిన్నిసన్నాయి మొన్నోయి విన్నదోయి !
సన్నవిఱజాజి చిఱునవ్వు కన్నదోయి !
ప్రళయములు లెక్కబెట్ట వీప్రణయులతలు
రసకిశోరి మనోవీధి రసవిహారి.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# చినుకు తులుకులు

మహాకవి, మహోపన్యాసకులు, శ్రీ వేదాంతకవిగారి పరిచయభాగ్యం నాకు కల్గిననాటినుండి వారి మృదుమధుర వాగ్విలాస ప్రతిభను, వారి కావ్యగానముద్వారా, మహోపన్యాస విన్యాసముల ద్వారా తరుచు విని ఆనందించు మహదవకాశములు కలుగుచున్నవి. వారు రచించిన "తెనుగుతల్లి" మహానాటకము యావదాంధ్రదేశమునకు చిరకాలపరిచితమే. ఈ నాటకంలోయున్న కవితాప్రభుత్వం వారి రచనా నైపుణ్యానికేగాక రాష్ట్రరాజకీయ గోళానికిగూడ పెట్టనికోటగా ముద్దులమూటకడుతున్నది. వారు కష్టకాలం, ఆకలిమంట, విశ్వస్వరాజ్యవిజయాలు, యుద్ధభూమి మున్నగు నాటకములనేకములు రచించుటచే వారికి నాటకరచనలో అశేషానుభవమున్నట్లు తేట తెల్లమవుచున్నది. వారు రచించిన కల్పతరువు, మాఇలువేల్పు మున్నగు మహాకావ్యము లత్యంతభక్తిరస ప్రధానములై మోటుబారిన ప్రజాహృదాయాలను చిగురొత్తింప జేయుచున్నవి.

"ఘుమఘుమలాడు పదము లేరికూర్తును కవనంబు దవసంబు కరణినేను" అని వారు సగర్వంగా సహేతుకంగా చెప్పుకున్నారు. వారి కలము నడకా, నోటి మాటా మధురాతిమధురమై గంభీర భావగర్భితమై యొప్పుచుండును. వారు ఉపన్యాసము నడిపించునపుడు పొంగి పొర్లివచ్చు భావపరంపరతో యే చాటుమాటున డాగియున్న పదజాలములూ కందత్రొక్కలేక బాగా పూతపట్టి, కాపు విరగకాచి, గుత్తుగుత్తులతో సోయగం వొలకపోస్తున్న తీయమామిడి గున్న కొమ్మలవలెవంగి మకరందభంగిమాలు కులికిస్తూయుండును.

వేదాంతంవారంటె విద్వత్కుటుంబ సంస్థానాధీశ్వరులు. వేదశాస్త్రపారీణులు, లలితకళానాదోపాసకులు, ధర్మనిరతులు, దేశసేవా దురంధరులు. బ్రహ్మశ్రీ శంభుశాస్త్రిగారు వీరి జనకులు. శ్రీ వేదాంతకవిగారు సారస్వతసేవేకాక, దేశసేవకూడా చేసిరనుటకు వీరి విశ్వరాజకీయ చైతన్యపుష్టిగల రచనలే తార్కాణం.

వీరు వ్రాసిన "కవితాసంస్థాన్" అను విమర్శక గ్రంథము వీరి అనంతవిజ్ఞానపుష్టిని, స్వతంత్రవిచక్షణాదృష్టిని నిరంకుశ విమర్శనా సృష్టిని నిరూపించుచున్నది. ఈ మహాకవి నిరంతర నిర్నిద్రావస్థతో అకుంఠతపస్సుచేస్తూ "కవితాసంస్థాన్" సంస్థాపించి దానిద్వారా ప్రతి మాసము కవిపండితులను, దేశారాధకులను రప్పించి వారి నుచిత రీతిని సన్మానముచేయుచూ విశ్వవాఙ్మయోద్ధరణ గావించుచున్నారు.

ఈ "పట్టాభిషేకం" అనే కావ్యమును వీరు పదిహేను పద్యము లలో యిమిడ్చి అత్యంతమనోహరముగా వ్రాసి తమ నిరుపమాన కవితాప్రతిభను చాటుకున్నారు. "తరతరమ్ములదాక తరిగిపోని యశస్సు"ను ఈకావ్యం "తలదాల్చు" కుంటున్నది.

వీరిని "జన్మతః కవివీఁడు, సాహసికుడు"; "కొత్తపోకడ వీని కూర్పులోకనుపట్టు" అని అంటూ "తెనుఁగుతల్లికి వీఁడు తెనుఁగుతండ్రి" యని వీరి గురుదేవులు శతావధానులు కీర్తికాంతులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు చెప్పిననుడులు వీరి నిరంకుశస్వరూపమును చిత్రించుచున్నవి. "తెనుఁగుతల్లి"ని రూపొందించింది వీరేగా ! వీటినిబట్టి వీరు నిజముగా తెనుఁగుతల్లి నోచిన నోములపంట యని చెప్పక తప్పదు.

"నా ఆకృతినిబట్టి మీరు యీకావ్యాన్ని నాకు కృతి యిచ్చు చున్నారా?" అని నేననగా వారు "మీ ఆకృతినిబట్టి కాదు ఆ కృతినే మీకు యిచ్చుచున్నాను. వేఱే కృతికాదు" అని వెంటనే చమత్కరించారు. యావద్విద్వజ్జనులు యీ కావ్యాన్ని సహృదయంతో గ్రహించి రసాస్వాదనం చేస్తారని నేను విశ్వసించి, కృతజ్ఞతాంజలితో యీకృతిని మహద్భాగ్యముగా స్వీకరించుచున్నాను.

ఇట్లు,

మేడిచెర్ల గోపాలకృష్ణమూర్తి, బి. ఎ.

# నా గురుదేవులు

తిరుపతి వేంకటేశ్వరుడు
పరపతి గల గురుదేవుడు
ధరలో అతనికన్న మొనగాడూ
తరువాత ధాత వ్రాతకు లేడూ ॥తిరు॥

అతడు వడ్డికాసులవాఁడూ
ప్రతిభ కేడుకొండలవాఁడూ ॥తిరు॥

శ్రుతి కలువని కవులకు నేఁడూ
బ్రతుకు తెరువు చూపెడి ఱేఁడూ ॥తిరు॥

ఏజగాజెట్టులైనను మీరూ
మీజుట్టిచ్చిగాని పోరూ ॥తిరు॥

కవితా సంస్థానములందూ
కలముల కొనరించెను విందూ ॥తిరు॥

గోదావరి వాహినిలో
వేదాంతకవికి దొరికెను
తిరుపతి వెంకటేశ్వరుడు
పరపతి గల గురుదేవుడు॥

మంజులవాగ్విలాసం, మనోవికాసానికిమార్గం. అంటే మాట పసందులో మనస్సు పుష్పంమాదిరివిచ్చి వికశిస్తుంది. అప్పుడు ఆలో చనసుతారమై హావభావపరిమళాలువీచి అంతరాత్మని ఆనందడోలిక లూగిస్తుంది ఈపని ఎంతరమణీయంగా, సురుచితంగా చేస్తైతే దాంతో అప్పుడు విశ్వబృందావనాన్ని కవివృషభులు అంతమనోహరంగా కులి కిస్తారు. పలికిస్తారు.

ఈసత్తా కలవార్ని మనహయాములో ఒక్క తిరుపతి వేంకట కవుల్నే చూచాం. వీరుభయులు అఖండగౌతమీ మండలవాస్తవ్యులు. దివాకర్ల తిరుపతిశాస్త్రిగారనీ, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారని వీరిని విడివిడిగా పిలుస్తుంటారు. ఐతే యావదాంధ్రదేశంలో వీరిద్దరూకలసి కవితాసామ్రాజ్యంపాలిస్తున్నప్పుడు తమగురించివారు "తిరుపతియతండు వేంకటేశ్వరుడనేను" అని వెరసి "తిరుపతి వేంకటేశ్వరులమేము" అనియెంతో రమణీయమైన ధ్వనితో నిరంకుశవాచా వైదుష్యంతో వినిపించి ముక్కోటి తెలుగు దేవతల్ని ఆనందపరవశుల్ని చేశారు. ఈనాటికిలెక్కకొక్కరైన యిట్లాపేర్లు కలసిగాని యింతరస మనో హరంగాగానిః జంటకవులై కవితాచాతుర్యాన్ని చూపి, కవితామాధు ర్యాన్ని కురిపించి మురిపించినవాళ్లున్నారా? సందేహమే; శ్రీవారు పైచెప్పినట్లు "తిరుపతియతండు వేంకటేశ్వరుడనునేను వెరసి తిరుపతి వేంకటేశ్వరులమేము" అన్నదానిలో చమత్కారం ఎంత రసవంతంగా వుందో చూడండి. ఎంతో డబ్బు ఖర్చుపెట్టు కొని ఏడుకొండలెక్కి పెద్దశ్రమతో ఆ తిరుపతి వేంకటేశ్వరుడికి మ్రొక్కివచ్చేబదులు అంతా అహ్లాదకరంగా అనాయాసంగా మా దగ్గరకొచ్చి మా పాదాలు పట్టి మీ మ్రొక్కుబళ్లన్నీ చెల్లించుకొని

పొందని చక్కగా చమత్కరించారు. ఇటువంటి చమత్కారమే రమణీయం. ఈ అర్థ్ణతప్పుట్టువుతో రావాలికాని పట్టభద్రులైతేనూ నలుగుర్ని కూడగట్టుకొని బహుమానాలు సన్మానాలు పడితేను రాదు.

నిజంగా జాతి దేవుళ్లని మ్రొక్కితే ఏముంది? జాతి దేవుళ్ళని మ్రొక్కండని చక్కని ధ్వనిగల కవిత్వంతో హెచ్చరించారు. జాతికి దేవుళ్లు కవులు. సంఘానికి కవులెంత ప్రధానమో శ్రీ తిరుపతి వేంకట కవులు కలసి చెప్పిన పైపద్య పాదంతో విశదమౌతున్నది. కవితల్లజులు ప్రజల మ్రొక్కులన్నీ వినిపించుకొని ప్రజాజీవిత పారిజాతాన్ని మహదైశ్వర్య విశ్వ విజ్ఞాన సౌందర్య కిరణాలతో విరాజిల్ల చేస్తారని బోధపడుతున్నది కవితా పరమేశ్వరులు దేశానికి కాలానికి పాత్ర వైభవానికి ప్రాణంబోసేవారని, జ్ఞానం ధారబోసేవారనీ, దేశభావి భాగ్యోదయానికి దేవదత్తాలంటి వారని ప్రజాసంఘాలు గుర్తించాలి. అంతేగాని కవులు కేవలం పిల్లి పేరంటానికి పద్యాలు వ్రాసిపెట్టేవారని భావించకూడదు.

అట్లా కవిపుంగవులెన్నడూ తయారు కాకూడదు. కవులు జగచ్ఛ్వాసకర్తలు. కవులయొక్క కలం కన్నీటి మరకలతో కని పిస్తే మాత్రం జాతికి శంకమై పోతుంది. శ్రీ తిరుపతి వేంకట కవులు, చమత్కారంగా చెప్పిన పైపద్యపాదంతో మేమే దేవుళ్ళము రాతి అప్పలుకాదు. మమ్మల్ని పూజించి భూషించి ప్రజలంతా ధన్యులు కండన్న పవిత్ర విశ్వవిజ్ఞాన భాగ్యం బాగాధ్వనిస్తున్నది. గ్రహించండి.

నిరంకుశ కవులై నిరుపమాన కవితా చతురోక్తితో అత్యద్భుతమైన సమయస్ఫూర్తితో సమ్మోహనాస్త్రంవంటి మధుర కావ్య

గానంతో యావదాంధ్ర భువనం పర్యటించి మకరంద జలద గంభీరులై కవ్వించి గర్జించి అమృతధారలు ధారబోసిన వజ్రివాఙ్మయ సింహాసనాసీనులు శ్రీ తిరుపతి వేంకటకవులు మాదిరి నేడెందరు కనుపిస్తున్నారో చూడండి. మచ్చుకొకరైనా సాక్షాత్కరిస్తే మాత్రం బంగారు భాషతో సంఘం నిండా పండువెన్నెల కాయించవచ్చు. అసలు అటువంటి నిరంకుశ కవితా పరమేశ్వరుడు.

" ఎవ్వని లెక్కఁబెట్టడు; మఱెవ్వఁడు డేబిరిగొట్టుమాటలతో
గవ్వకుఁ జేయఁజాలఁడు; ముఖంబున రాచతనంబు చెక్కుఁబో
నివ్వఁడు; డొక్క లేద్చునపుడేని వచింపఁడు దీనవాక్కు; నీ
డెవ్వఁడె యీ నిరంకుశ కవీంద్రుని కెమ్మెయినైన భూమిపై."

అంతకవితా జగదేకవీరులు కీర్తికాంతులు శ్రీ తిరుపతి వేంకట కవులు వారికివారేసాటి, తమహాయాములో, వారు తమకంటేమిన్నలైన, జగాజెట్టులైన కవిసామ్రాట్టుల్ని, వెలమీదకురప్పించే వీరకాతూహలగళంలో యీమాదిరి మీసముమెలిపెట్టి,

"దోసమటంచెఱింగియును దుందుడుకొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండుబాసలకు మేమె కవీంద్రులమంచు దెల్పగా
రోసముగల్గినం కవివరుల్ మము గెల్వుఁడు గెల్తురేని యీ
మీసముఁదీసి మీపదసమీపములం దలలుంచి మ్రొక్కమే"

యీతరహాగా కవ్వించి గర్జించారు. నిఖిలాంధ్ర కవిపండిత వేదండమండలాన్ని గడగడలాడించారు. శ్రీ తిరుపతి వేంకటకవులు గ్రామగ్రామము తిరిగి ప్రచండకవనసంగ్రామంగావించి జయభేరి

ప్రయోగించి సమస్తమనస్తత్వాలు రసమనోహర తరంగాలుచేసి అష్టావధానాలు, శతావధానాలు, ఆశుకవితాప్రవాహాలు, ప్రౌఢవాగ్వైఖరితో గావించి మధురమంజులవాగ్విలాసమకరందవర్షం కడవపోతగా గుమ్మరించి రసిక మహాజనహృదయక్షేత్రాల్లో ఆనందప్రవాహాలు మోతలు పెట్టించిచారు. ఎడారులు మరుభూములు, సస్యశ్యామలంచేశారు. శుభసుందరన[illegible]ాలు మొలిపించారు అంచేతనే యీనాడెటు చూచినా కవిరాజులు, కవిచక్రవర్తులు, కవిరాజవసంతులు, కవిదిగ్గజాలు, కవిసామ్రాట్లు, కనిపిస్తున్నారు. శ్రీ తిరుపతి వేంకటకవిశకం వచ్చినందువల్ల నేగదా!

వారికిపూర్వం మోడుబారి, గిడసబారి, గడ్డగట్టి పోయిన భాషాక్షేత్రంలో ఆనంద బృందావనం లేచింది. అంచేత శ్రీవారికి శిష్యప్రశిష్యులు, ఏకలవ్యులు, శత సహస్రాధికంగా దేశంలో తేజరిల్లుతున్నారు.

చిరునవ్వు పువ్వుల్లోంచి, చిన్ని చికిలినవ్వులు వొలికించి అక్షర దరహాస విలాసం పూయించారు. అక్షరాల్ని అప్సరసల్ని చేశారు. అమృత కవితాగానం వినిపించారు. శ్రవణానందం గావించారు. కమ్మని కావ్యాలు శ్రావ్యంగా రచించారు అంతేగాదు కవిబ్రహ్మలైన కవిత్రయంవారు రచించిన మహాభారతాన్ని జగన్మనోహరంగా నాటకాలువ్రాసి, నాటక కళాసౌదామిని మధుర నాట్యం వూరూరా నోరూర చేయించారు. శ్రీవారు రచించిన పాండవోద్యోగాలు చదవనివారు, చూడనివారు లేరు. ప్రపంచ మానవ రాజకీయ విలాసాల్ని పాండవోద్యోగ విజయాలతో కళ్ళకట్టినట్లు చూపించారు. త్రిదండి రాజపరమేశ్వరుడైన, అహింసా వజ్రకవచధారుడైన బుద్ధ

భగవానుని చరిత్ర అతిమనోహరంగా రచించారు సంస్కృత దేవీ భాగవతాన్ని చక్కని శైలిలో తెనిగించారు. సంస్థానాలన్నీ యెక్కి మదపుటేనుగుల నెక్కి, గండ పెండేరాలలో నిక్కి, నానారాజ సందర్శనాలు రచించి, కవితా సరస్వతిని నవరత్న ఖచితవజ్ర సింహాసనం యెక్కించారు.

"భారతము గురించి గీరతము రచించి
క్షీర సాగరము నూగించినారు"

రసవంతమైన శబ్దచమత్కారంలేని ధోరణి చత్వారంవచ్చినవాడి మాదిరి నడుస్తుంది. ఏరసంలోనడిచిన ధోరణికైనాసరే రమణీయమైన చమత్కారంవుండితీరాలి. ఒకానొకప్పుడు మద్గురు దేవులు, శ్రీ చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగార్ని నాయింటికి తెచ్చుకున్నాను. ఆనాడు వారిశిష్యులు చాలామంది వారివెంటవచ్చారు. వారందరికి నేను యేదోనాశక్తికొలది మర్యాదతో పూజించుకొంటున్నాను. అప్పుడే నాయింటిమీద బాకీదారుడువచ్చిపడ్డాడు. నిరంకుశ కఠోరవాక్యాలు దూసిపోస్తున్నాడు. అప్పుడు శాస్త్రిగారు అంతాతలోపద్యమైనా చెప్పి అప్పులవానిదూకులు తగ్గించమని సెలవిచ్చారు అంత నేను నాసహజ కవితాధోరణితో

"అంబరవీధినుండి విలయమ్ముగ దూకెడి బాకిదారుపై
సంబకటాక్ష లేశముచ నల్లెడి పద్యముగూడ రెండుపా
దంబులె పూర్తియై పిదప తట్టక యప్పులవాని రెండుపా
దంబులు వట్టినట్టి కవితల్లజు డీతఁడు సత్కరించుడీ"

ఈపద్యం చెప్పి అప్పాలవాణ్ణి గురుదేవుల్ని దగ్గఉన్న రసజ్ఞుల్ని, క్షీరసముద్ర తరంగాల్ని చేసుకున్నాను శ్రీ వేంకటశాస్త్రిగారు సరసులు, తెరుఁగుతల్లి కాసులపేరులో నవరసులుకాబట్టి అంత ఆనందించగలిగారు.

చమత్కారం అట్లా వుండాలని శిష్యుల్ని ప్రోత్సహించారు. శ్రీ తిరుపతి వేంకటకవులు కురిపించిన ప్రసన్న దయారస దృష్టితో, మధుర కవితా రసవృష్టితో యీ తెలుగుగడ్డ పోతుగడ్డయై, విశ్వ విఖ్యాతి గడించు కొంటున్నది అసలు కవులలో పరస్పర ప్రేమ స్వభావాలుండవు సహన స్వభావాలు కనిపించవు. శ్రీ తిరుపతి వేంకటకవులు ఉదయించి చల్లని కృపారస హిమాలయానుండి ప్రేమ రసజాహ్నవిని దుమికించి దూకులు పెట్టించి ఎన్నో నందనవనాలు, కల్పతరువులు, విశాల విశ్వ విజ్ఞాన క్షేత్రాలు పండించారు.

ఇంకో రాజదర్బారులో శ్రీ వేంకటశాస్త్రిగారు ఇట్లా ప్రశ్నించి నన్ను "నేనుగూడా ఒక కవినేనా?" అని అర్థంవచ్చేటట్లు అన్యాపదేశమైన ధోరణితో సీసపద్యం బహు చమత్కారంగా ఒకటి చెప్పమని సెలవిచ్చారు. దానికి నేను గురుదేవుని యాజ్ఞతలదాల్చి గురు కటాక్షంతో, ఇట్లా చెప్పాను.

పురిటి మంచమునుండి యరటిపిల్కలు తీసి
　　　　వంశవృక్షము పాటపాడినాడు
పల్వొరాడెడిమాట చిల్వావల్వాలుచేసి
　　　　వాఙ్మయబ్రహ్మ పేర్వడసినాడు

అరిశాలుగము సూచి మురిసి వెన్నలకాచి
వెఱ్ఱిబడుచు తేన జుఱ్ఱినాడు
కపట రాక్షసులకు త్రిపుట తాళము వేసి
వారిచెప్పులుమోసి బ్రతికినాడు

వీఁడు చేసిన ఘనకార్య విజయ మేమొ
విశ్వమోహన సౌందర్య విభవమేమొ
కంచు కాగడా కేనియు కానరాదు
నను మహాకవి యనుకొన్న నాన్నలార॥

అన్యాపదేశమైన అలంకారం చమత్కారంతో అట్లా నడిపించాలని శ్రీ గురుదేవులు దీవించారు. చిన్ననాటి శిష్యకోటి నా గురుచరణ క్షేత్రంలో చక్కని కాలక్షేపాలతో లోకాభిరామాయణాలతో విద్యాభాగ్యం గడించిది. బాదరులో శ్రీ చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారు, ఉపాధ్యాయులై, హైస్కూలు విద్యార్థులకు ఇటువంటి కాలక్షేపాల్లోనే విద్యాప్రసాదం ప్రసాదించారు. దయారసగురుహిమాలయపాదసాన్నిధ్యమందు, ఏమాటలైనా సరే, ఏకాలక్షేపాలైనా సరే అమూల్యమైన విద్యాధన మౌతుందని మద్గురుదేవులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంటశాస్త్రిగారి చల్లనిచల్వ సాక్ష్య మిస్తున్నది. ఈ తెలుఁగు భువనంమీద గురుశుశ్రూషతో అఖండ విద్యాపాటవం పట్టిన విద్యావంతులనేకులు, శ్రీ వేంకట శాస్త్రిగార్ని స్మరించని రోజుండదు.

"దొరలయి రమ్యహర్మ్యము వధూజన సౌఖ్యము పీడలేని భూ
వరులనుగూడ లేపి నిజపాదసరోరుహభాగ్య మిచ్చు శ్రీ
తిరుపతి వేంకటేశ్వరుని దివ్యప్రసాదము పెట్టినట్టి వి
స్తరినయి దుర్గతల్లి ! కవితారస పాకములెల్ల జూపెదన్"॥

# ఆహ్లాదం

కృష్ణాయపాలె మంటే
కృష్ణార్పణమైన విశ్వకీర్తి ధనంబుల్
కృష్ణార్జున శౌర్యములై
కృష్ణా గోదావరికి యెగబోసె కళల్.

2

కృష్ణపక్షకాదంబినీఖేలనమున
తెఱచి వేదాంతకవి విశ్వదృష్టి నేడు
నుదుల కెక్కడో చిల్లులు పొడిచినాడు
రసతుషారబిందువులు వజ్రాలుపూయు.

3

ధరపై నీమురళీనగర్ కనినచో ధారాళ దాతృత్వ సుం
దరు లక్షాంతము లేచి బొంగరములై దర్పంబు కప్పంబు మా
దిరి నిక్కంబుగ కట్టిపోయెదరు సందేహంబులే కింక పే
ర్చిరి త్యాగౌదార్య విభూతికై రసవిహారీ! విశ్వ సౌందర్యముల్.

4

అమృతానంద పయోధియై భువన భాగ్యంబైన కృష్ణాయ పా
లెము కాపాడెడి సూర్యచంద్ర నగరీ లీలా జయధ్వాన డిం
డిమమై వీరధరిత్రియై వెలుఁగు తాడేపల్లిగూడెమ్ము ప్రాం
తములోఁ జెల్వులు పూచుచున్నది కళా తారుణ్య లావణ్యమై.

5

నవకపు టత్తురాల చిఱునవ్వులలోఁ జిగిరించి విశ్వ మా
నవ మధుర ప్రభాత కిరణమ్ములు పూచి కిశోర కృష్ణ ప
ల్లవ చరణద్వయాంబుజ కళా మురళీస్వర సౌఖ్య కౌముదీ
స్తవములు రాశిపోసిన కతమ్మున కృష్ణయపాలె మాయెనా.

6

వ్యాజ్యాలాడక వీరభారతము మా పట్టాభి త్రైలోక్యసా
మ్రాజ్యానందమహోత్సవోజ్జ్వలకళా మాణిక్యసింహాసన
శ్రీజ్యోత్స్నల్ కురిపించినట్లు మురిపించెం చంద్రుడు పట్టాభిరా
మజ్యోతిప్రభ కృష్ణాపాలెమున కర్మజ్ఞానకేయూరమై.

7

ఉమ్మరాలిషమాని కమ్మనివాగ్దేవి
తోడుపెట్టిన పెద్దపాడికుండ
వారణాసిపసందు పేరువాసి పసిండి
మింటినంటించిన పంటచేను
మేడిచర్ల వరాల మేల్మిచెల్మిచలువ
పండువెన్నెలయిన వెండిగిన్నె
పుట్టాపురోగామి పట్టాభిషేకంబు
కన్నుకుట్టించిన పెన్నిధికద

రామలక్ష్మణశౌర్యసర్వక్రభాగ్య
సౌఖ్యగ్రామాధిపత్యాలు ముఖ్యమైన
దైవభక్తిసాహిత్యాలకోవగాదె
చాలచెలువైన కృష్ణాయపాలెమయ్యా!

8

ధనసంపాదనకేమిగాని ఘనవిద్యల్ పుట్టులై కమ్మక
మ్మని మాకమ్మని కమ్మవారు విజయ తామ్రమండలాఖండ ల
స్వన పాథోధులు శౌర్యధుర్యులు కృపా భాస్వంతు లం చెంతతూ
వినుచుం ద్రుర్వని రెడ్డి రెడ్డిగము పై తేరీగుణాశ్రేణితో.

9

రెడ్డి లక్ష్మయవేల్పు గిడ్డిదొరలనెల్ల
రప్పించి గుప్పించు గొప్పదాత
చంద్రు సుబ్బారావు చుఱుకుచూపులనెల్ల
సానబట్టిన పెద్దజ్ఞానధనుఁడు
గుణము రామారావు ధనజాతకంబెల్ల
తులతూచి కొలఁబోయుదొడ్డయశుఁడు
చంద్రు రామారావు గంద్రకొయ్యలనెల్ల
వెంటాడి చెండాడు వీరసుతుఁడు

గ్రుడ్డిదర్బారు కనఁ డేమి రెడ్డిసామి
రేడిరో నాడి పుట్టా చరిత్రదాడి
ఇంక నుమరాలిష గిజిగా డంకినీడు
మేలు కొదవేమి కృష్ణాయపాలెమునకు.

10

గాంద్రుగాంద్రు మనుచు బక్కవాంద్రపైన
దుమిదూకెడి బెబ్బులి దుర్మదమ్ము
చంద్రు మొనగాం ద్రొడిచిపిందుచుం ద్రటంచు
ప్రభలి చంద్రు సుబ్బారావు ప్రతిభ చెప్ప.

11

ప్రజలే పాలకులైరి కాన కవితాపట్టాభిషేకమ్ముఁ జే
సి జయధ్వానములోఁ బ్రభుత్వము ధరాశ్రేయమ్మునై నేఁడు ది
గ్విజయప్రాప్తికి నే నొసంగితిని సత్కీర్త్యాయురారోగ్య భా
గ్యజనామోదబలమ్ము! కృష్ణమురళీ గానామృతాస్వాదనా.

12

మూగనోమునుబట్టి మోడుమోకయినట్టి
బ్రతుకు చిగిర్చెడి రసఫిరంగి
అడవిలోఁ బడిపోయి నడుము విఱిగిపోయి
నడవని జన్మ లేపెడి తపస్వి
దిగులు తెగులువడ్డ మొగములు వెల్గెడి
గురుకటాక్ష గవాక్ష కోవిదుండు
కవనబాలిక సిగ్గు భువనభాగ్యము నిగ్గు
రక్తి కట్టించెడి రసవిహారి
ఇచ టెపుడు పార్వతీబరమేశ్వర మృదు
చరణరాజీవ కిరణమై కరణమైన
ఘనయుగంధరుండు కలండు జనప్రియుండు
నాప్రభుత్వము మురళీవనమ్ముకాదె.

13

పట్టా లెక్కడ బండితప్పని ప్రభుత్వ శ్రీ మహత్యమ్ముతో
చెట్టాపట్టము పట్టునట్లు విజయశ్రీశౌర్య చాతుర్య సా
మ్రాట్టై దొడ్డ వినాయకుండు కవితా మాధుర్య వాత్సల్యముల్
పట్టించెం మురళీనగర్ పయిన విశ్వప్రేమ ధౌరేయుఁడై.

14
రెడ్డిగము వేసుకొని పోతుగడ్డపైన
వేల్పులోటలోఁగల కల్పవృక్షములను
దించి కృష్ణపాలెమ్ము పాలించినావు
రెడ్డి లక్ష్మణస్వామి! నీ ప్రేమయేమి.

15
రామచంద్రుని చల్వతో గ్రామమెల్ల
పండువెన్నెలకాచి కన్పండువయ్యె
కృష్ణపాలెమ్ము పరమాత్మ కృపనుజూపె
భక్తిగాలమ్ముతోడ భూప్రజకు నేడు.

16
ఉర్విపైఁ గమ్మగా వినుచుంద్రు మిమ్ము
గంద్రగొడ్డలిగా కనుచుంద్రు మిమ్ము
తాండ్రపోసి రోసము కొనుచుంద్రు మిమ్ము
చంద్రువారి పే రెక్కించు చుంద్రు రామ.

17
ప్రెసిడెంటై రసికుండై
కొసదాఁక జనాభిమాన గుణవంతుండై
సిసలైన సత్యమయ్యెను
మన తెలుగని కృష్ణపాలెమహానీయులలో.

18
ఏడుకొండల వెంకన్న కీడుజోడు
కలఁడు ప్లీడరు వెంకన్న గ్రామమందు
వడ్డికాసులవానికై నడి యొగఁబడి
జుట్టుమాత్ర మెప్పు డతండు పట్టుకొనడు.

19

ఉమరాలీషకవీంద్రపాదములు సవ్యోత్సాహ సన్నాహ మో
హాములోఁ బట్టి కవిత్వతత్వ ఘనబ్రహ్మాండంబుఁ జూపెట్టి భ
క్తి మహాత్మ్యంబును గాంగనిర్ఝరిగ ధాత్రిన్ సత్యనారాయణుం
డమల శ్రీపద వారణాసి నిగమ వ్యాసాత్మతో నింపెరా !

20

అందఱిమాట కేమి వినయం బనయంబు విలాసమైన ఆ
నందమురారి చాతురి మనఃప్రసవార్ద్రి కళాచలో క్తియై
చిందును మాచిరాజు సరసీరుహ నేత్రునివంటి పేచి రా
జందును తన్మహాత్ముని మహా సహకారముపూచె పున్నముల్.

21

కృష్ణాయపాలెమందున
జిష్ణులు వర్ధిష్ణులైన శ్రీమంతులు శ్రీ
కృష్ణులు మెచ్చు జమీందార్
తృష్ణ నెఱుగకుండిరే సిరికి సత్యముగా.

22

కోటప్పకొండనుంచియు
కోటయు దిగి పాండురంగ కోటిప్రభలతో
ధాటిగ ప్రభుత్వకావ్యము
చాటెను కృష్ణాయపాలె భజనావళిచే.

23

అమ్మాన్యుల్ పురుషార్థముల్ పుడమి వింధైనట్లు చెల్వొ యమూ
ల్యమ్మై కాటుకకంటి సోయగము మేలై యావు ముత్తైదువుల్
సమ్మానించెడి పాడిపంటలకు విశ్వశ్రీ కళారామరా
జ్య మ్మిప్పింతురు కృష్ణపాలెమున నిచ్చల్ దొడ్డ సాధ్వీమణుల్.

24

సామవేద సీతారామశాస్త్రి బుధుఁడు
రామనామరసము దిగఁద్రావు యశుఁడు
కీర్తి పట్టాభిరామయ్య కృష్ణపాంగు
దయను నాప్రభుత్వమున కధ్యక్షుఁడయ్యె.

25

చెవి కింపైనవి సామవేదమహాతి శ్రీ సామ్యవాదస్వర
వ్యవసాయంబులు పల్లవించు ఘనుఁడై యానందసామ్రాట్టు మా
నవకళ్యాణ కళాప్రభుత్వమున కేనాఁడో సభాధ్యక్షుఁడై
కవిసన్మానము కర్షకోత్తములచే గావించిపాలించెరా.

26

గుణ్ణమువారి యశస్సుకి
దణ్ణముపెట్టని నియంత ధరపై గలఁడే?
తూణ్ణముగా తెలియని దే
పణ్ణము మీతో నెవండు పట్టఁడు రామా.

27

కమ్మకమ్మనివారు కమ్మవారేయని
నమ్మి మీ గుణగౌరవమ్ముఁ గొలిచి
కమ్మకమ్మనివారు కమ్మవారే యని
నమ్మి మీమేలి త్యాగమ్ముఁ బొగడి
కమ్మకమ్మనివారు కమ్మవారే యని
నమ్మి మీదొడ్డధైర్యమ్ము మెచ్చి
కమ్మకమ్మనివారు కమ్మవారే యని
నమ్మి మీరామ నామమ్ముఁ దలఁచి

లోకమున సూర్యచంద్రాదు లేకధాటి
ఇహపరద్విచక్రశకట మెక్కి రాను!
నడుపలేక లోకాత్ముకి విడిచి నేను
లాడనేమిటి గెలుచు భూమండలంబు.

28

కవినై పర్ణకుటీరవాసియయి సౌఖ్యశ్రీలోద్యాన ప
ల్లవ సామ్రాజ్యము నిరభోజ్యమును కల్యాణస్వరాలాప వి
శ్వవసంతుండయి మావిపై మధుర భాషాకోకిల స్వామినై
స్తవనీయప్రభునిం స్తుతించుటలు కృష్ణా! ధాత్రిపై వింటివా?

29

శ్రీరాగప్రద! సద్యశోధన జయశ్రీమోహినివారిదా!
యే రత్నాకరుడైనగాని ధరపై హీనస్వరం బెంతయో
నైరాశ్యమ్ముగ విప్పుచుండెను; జగన్నాథుం డదే గొంతుతో
హోరెత్తించిన విశ్వముల్ నిలుచునా? యుల్లాసముల్ సాగునా?

30

ఊరెరిగించినారు, కళలూరెడి విశ్వకవిత్వరాణి నో
రూరెడి వాగ్విలాసము మహోజ్జ్వలభాగ్యము జూపినారు; కే
ళీరమణీయ కృష్ణమురళీ నగరంబును జాటినారు. మీ
పౌరులు సర్వకాలము శుభంబులు గైకొనుచుండ్రు ధీమణీ.

31

ఏనుఁగు నెక్కఁగాని పరమేశుని మోసెడిగోపురాజుపై
నేనరు డెక్కలేదని కవీశ్వరునిం వృషభేంద్రకోటిపై
ధీనిధి నెక్కఁజేసి సురదీర్ఘికలో జయభేరిగొట్టి పూ
వానలు జోరుగా శిరముపై గురిపించితివయ్య కృష్ణయా.

32

మహిషాసురమర్దని వా - గ్లహరీ సవరత్నమీనకాత్యాయనివై
మహదాశీస్సుల నిచ్చుత - గృహలక్ష్మికి రైతులారా! కీర్తించునటుల్.

# ప్రభుత్వం

శ్రీ సుగుణోదయమ్ము చిగిరించి సుమించి కళాశకుంత వి
న్యాసవసంతసౌఖ్య దాహోస దిగంత దిశా ప్రభాతముల్
రాసులు రాసులైన మకరందమనోహర వాగ్విలాస ల
క్ష్మసుముహూర్తవేళ ప్రణమిల్లెడి సంఖ్య లనంత మానయా.

అక్షయపాత్రమై యవని యందలి జీవన భాగ్యసౌఖ్య సం
రక్షకు లక్షలాది ధనరాసులు పోసినగుండె దేనికో
కక్షలు? క్రౌర్యశౌర్య గుణకార్ముకసుక్యులు ప్రేలు టేలకో?
కుక్షికి కుమ్ములాటలు? రసజ్ఞుని మంచిపై తెల్వితేటలా?

## అక్షరం

లక్షచక్షువులే కళానటీనటులవో
గగనజఘనము స్వర్గతలమమ్యొ
బృహదోజ్జ్వలహరిత్తు లేయో మహాత్ములో
చతురబ్ధిగళము విశ్వము కుదించె
మృగనగోర్వీతపాత్రమె రణక్షేత్రమో
భువనమోహనము కప్పుగ మొనర్చె
రసప్రవాహ నిదాహగసనమే వ్యసనమో
వ్యామోహవల్లి ప్రపంచమల్లె
నప్పరసమై మయూరనాట్య జగదేక
సౌఖ్యనసరాశి దివ్యపింఛమ్ము విప్పి
కంఠమెత్తి వైకుంఠమ్ము కనులగట్టె
అక్కడెక్కడో అక్షరాభ్యాసములకు.

## కథాతరంగాలు

కదళీస్నిగ్ధరసాలసాల మురళీకంఠస్వర శ్రావ్యమో
మదమాతంగ గభీర వీరవనితా మంజూషికా రావమో
అది యే రాపిడిఁబట్టి వాడి యడిదంబై ప్రాణముల్ కోసెనో
గద, బ్రహ్మాండము లెన్నియో పగిలి మొలకల్ లేచెరా తీపితో.

స్వర్ణ నీలాంబరోజ్జ్వల రత్నవల్లికా
శా విలాసోర్వశీ చక్షువులకు
అజవచో రసధునీ గజగామినీమోహ
నాతురదేవీ మహాశ్రుతులకు
మధురాణ్మసృణ ఘుసృణ ధనుర్గుణ
ప్రసూనలతాంగి సుస్నిగ్ధనాళికలకు
బ్రహ్మాండసౌఖ్య శుభ్రాంశురేఖార్ద్ర
సుహాసినీరక్త కీర్త్యధగములకు

చాకచక్యమా? రాసిక్యమా? కళామ
నోహర వివేక మాణిక్యమా? హరిహర
బ్రహ్మమూర్తిత్రయమ్ముతో పరిఢవిల్లి
క్రుళ్ళిరిల సూర్యచంద్రు లోకళ్లోకళ్లు.

అరదంబుల్ ద్విరదంబులా ఘనసమూహంబై చమూ సంఘముల్
వరనక్షత్ర బలమ్ములై నడచి దివ్యచ్ఛౌర్య గర్వధ్వజా
భరణశ్రీ కిరణప్రసార బలదర్పంబుల్ భుజాస్ఫాలనల్
ధరపై జేయుచు నస్తమించిరి నియంతల్ సూర్యచంద్రప్రభుల్

చంద్రభూపాలకునిపక్షమున నిల్చి కీర్తించెడి ప్రముఖులంతా పరిహాసపూర్వకముగా సూర్యుణ్ణి హేళనచేస్తున్న సందర్భాలివిగో.

7

చండగభస్తి తీక్ష్ణ మజస్రసహస్ర పవిత్రదేశ భూ
ఖండముపైన జూపి బలగర్వము సర్వము నేఁడు పట్టలే
కుండెడి ఱొమ్ముపుష్టిని మహోన్నతవైభవ మూపి యూపి మా
ర్తాండుఁడు చిక్కినాడకట రాహువునోటికి తాటిపండుగా.

8

ఎండి మండి మసి యయి యెడారియై పోయి
బావురు మనె వేఁడ్పు పాటచేను
ఇగిరి యూపిరి తిత్తు లెగిరి తుత్తునియలై
కళవయినవి చేప కాపురాలు
రగిలి రగిలి మంటపగిలి నాలుకలయి
రచ్చచావడి కెక్కె చిచ్చుబుడ్లు
నెఱియలువడి కొండచెఱియలు కైవడి
యిరులిరికిరికి క్రిక్కిరిసె పుడమి
తత్తడులు కట్టి యే డరదమ్ము నకటు
పెత్తనమున కేగి వెలిగి పెద్దవెలుగు
గుట్టుచప్పుడు కాకుండ క్రుంగిక్రుంగి
మాయమగుచున్న ప్రొద్దుద్రిమ్మరి కతాన.

9

కులికెడిగట్టుపై గరికకూన వరాల జరీలగౌనుతో
చెలువులు మొల్కనవ్వులు విచిత్ర కళానవరత్న భూషణ
మ్ములు భువనైకమోహన తపోధన జీవనమాధురీ కథాం
జలుఁ లొలికించి భక్తికిరణా లెగబోయుట గిట్టకుండెనా?

### 10

ఘృతకోశాతకివోలె పేరుగలవాఁడెంతో జగద్బాంధవో
న్నతనామాంకిత గర్వరేఖలకు పన్నాగంబు లల్లించి స
న్నుత సన్నాహము లెన్నియో నడిపి కన్నుంమిన్నునుం గాన కు
ద్ధతకృద్ధానల ఖండకేశుడయి పాత్రం ధాత్రి జాలించెనా?

చండశాసనాలతో మండిస్తున్న మార్తాండభూపాలకుడు నిరంకుశ ప్రతాపం చల్లారి దిగజారి పట్టుబడ్డతర్వాత ప్రకృతి సుందరి మెల్లగా గోల్కొని చల్లగా కాపాడే చంద్రభూపాలకునికోసం తయారవుతున్న తీరు చూడండి.

### 11

అతినిర్మల మహావియన్నదీ నళినాక్షి
రసగళోర్మిక మెల్లగ సుఖ మరసి
లక్ష్మీకళాప్రఫుల్ల ప్రసూనాత్మ శ్రీ
కిరణచరణము సుందరము తఱచి
మణికిరీటఘృణి హిమగిరి శృంగ శుభాంగి
వ్రజమానస సరోవరము తెఱచి
ఘనదర్శన సుదర్శన నిదర్శనోజ్వల
పింఛరింఛోళిగర్వించి విప్పి

అఖిలభాగ్యరమ్య మాబాలగోపాల
ప్రాణిమోహనము కవనభువనము
హొయలు లయలుజేసి యుఱ్ఱూత లూగించి
ప్రకృతిసుదతి సొగసు పరిమళించె.

ప్రకృతి రమణీలలామ అతిలావణ్యాలై మురిసిపడుతున్న
చంద్రుణ్ణి విరహజ్వర పరవశుణ్ణిచేసి,

12

ఆ రమణీయరేఖలు మహాసుకుమార పరిమళమ్ములై
యీ రుధిరప్ర ముడికించి పరాక్రమ వీరశౌర్య శృం
గార వివేకనాళముల కల్లపుడోసడలించి చెట్లలో
చేరిచె కొమ్మరెమ్మ కసిచెల్లని చల్లని వాని వెచ్చతో.

13

కవితాకింకరుడైన శంకరుని సౌఖ్యశ్రీలసత్రోస్రతసీ
నవరత్నాభరణాంగినాట్యము లఖండ ప్రేమబృందావనో
త్సవ మందార మహీరుహప్రసవ సంధ్యారాగభాగ్యమ్ములై
నవులాటల్ చిగిరించుచున్న కనుసన్నల్ చంద్రుడూహించెనా ?

అమృతము గూడుకట్టిన సుధాంశుణ్ణి సమస్తభువననిర్మాత
యైన విధాత్రుడు విశ్వసౌందర్యము పులకించెడి వనితనంతో యెట్లా
తయారుచేశాడో చూడండి.

14

సుఖనఖజ్వాల సమ్ముఖ జలజవిహాంగి
మధురస్వరవసంతరుధిర మోడ్చి
దరహాస విన్యాస కిరణ కీర లతాంగి
వ్రీడా విలాస పరిమళమిచ్చి
స్నిగ్ధపల్లవ కావ్యదుగ్ధసురుచిరాంగి
వాక్యార్థ రమణీయపాక మొసగి
రసఝరీ నవ్యతరంగ భాగ్యకురంగి
త్రిజగన్మనోహరక్రీడ గఱపి

బ్రహ్మపుణ్యాహవాచక వనవిపంచి
శుభ్రసర్వాంగ సౌందర్య శోభగూర్చి
సకల నిర్జరకోటి పోషకుని జేసి
స్త్రీవదన సదన శ్రీ శశిని సృజించె.

15

సర్వసుపర్వకోటి బలశౌర్యపరాక్రమ భోజనక్రియా
నిర్వహణైకదక్షతకు నిక్క సమస్త జగత్ప్రభుత్వముల్
దోర్విభవమ్ముతో నడుపు ధూర్జటి మస్తకమెక్కి యెంతయో
గర్వము జన్నుగా కరడుకట్టిన వెన్నెలరాయ డూగెరా.

16

ప్రళయగళప్రగల్భములు రాక్షసకృత్య జగత్ క్షుపాతటి
ద్దళ దళితప్రహార భయతాండవ ఖాండవవహ్ని నీచికాం
గుళి నివహప్రచండములు కొండల గుండెలు జార్చి కామినీ
కళ ప్రియ మెప్పుచేయుటకు గారణ మా యమృతాంశుడే సుమా!

17

చతురుండై నవమోహనాంగు డయి యీ సమ్మోహనామ్నాయముల్
బ్రతుకుల్ పూచుట కెక్కడో గలచి తారల్ కళ్లలోపోసి యె
న్ని తెగుళ్లున్నను చీకిపోయినను వన్నెల్ చిన్నెలై పోయినన్
రతనాలొలెకెడి తోరణాలను తమిస్రస్వామి కులికించెరా!

ప్రకృతి స్వరూపిణి, విరహాశియై తనను పాలించెడివాడి కోసం అఖిలోకభీకర పరిస్థితులతో దిక్కులుపిక్కటిల్ల చేస్తున్నప్పుడు వ్యామోహపరవశుడైన చంద్రుడు గుండె పీచుపీచైనప్పటిగ్గూడా కాలుమబ్బుల్లోంచి ప్రేమకిరణాలు పూయించటం చూడండి.

18

ఎంచుట కించుకేని రుచియించక యింకొకగోడు కున్కఁ ప
ట్టించని మన్మథానలసొటిల్లత చిట్లి మహోగ్రలీల బృం
హించెడివేళ భీకర వినీల వలాహక పంక్తి వెన్కఁ జీ
వించుట కింక సాగి కనిపించిన వెన్నెల తున్కఁ గాంచుడీ.

భువనమోహనాంగియైన పకృతి సురుచిరాంగికోసం తపించి తపించి సూర్యుడుకూడా ఏమయినాడో కనిపెట్టండి.

19

సంధ్యారక్తిమనోదవానల మహాజాజ్వల్యమానైక దో
ర్వింధ్యగ్రావ కషాయజిహ్వాకుహరక్రీడోగ్ర శార్దూలమై
సంధ్యావందన మాచరించెడి జగత్సాక్షిం సమీపించి గ్రమి
గెం; ధ్యానముమాని వృక్షములు దించెం పక్షిసంక్షోభముల్.

20

ఏరై క్రూరమృగప్రపంచవనమం దే దిక్కుఁద్రొక్కంత లే
కా రమ్యాంగనయైన క్రొంబసిఁడి ఛాయాదేవి శుష్కించి దుః
ఖా రూఢక్షుపయై విదల్చిన కుసువ్యామోహ హాస్త్రాలతో
గారీశంకరపూజ జేసి పతికై కంజాక్షి యాచుండెరా॥

21

నాడుల్ జ్ఞానమహార్ణవోదయ కళానారీ తపస్తప్తమై
నేఁ డే మానవయంత్ర దివ్యబల మన్వేషించి బృంహించెనో
గూడల్ వంగి యరిప్రభుప్రతతిచిక్కుల్ చేతికింజిక్కఁ నా
తే డక్కంజదళాప్తుఁ డార్తుఁడయి పేర్చెం శౌర్యముల్ ఖైదులో.

22

చూపులువచ్చి దుర్మదరుచుల్ కడు హెచ్చి దివాంధముల్ మన
స్తాప దురంతముల్ కుదిపి శౌర్యనిశీథి మహోదిగంతముల్
పాపపయోధి దుర్వ్యసన పారణ కారణ ఘోరవీచికా
లాప కలాపముల్ వలె వెలార్చె జగత్పతి క్రుంగినందుచే.

23

నిబిడధ్వాంతము నీలమేఘమయి మాణిక్యాలు పండించి మ్రొ
క్కుబడుల్ తీర్చి త్వదీయదివ్య మధుర క్రోధానలజ్వాలమా
లఁ బరోక్షమ్మున డాచి దేవ యశముల్ లక్ష్మీప్రసాద మ్మొన
ర్చి బలంబిచ్చినమాడ్కి చూడవటె మాప్రేమాంధకారమ్ముతో.

24

ఎవరేకుండెడి లోకబాంధవుఁడు నేఁడే క్రూరుఁడై దూకి నా
డని యాకర్కశకార్శ్యపీనలయ కారాగారమం దిట్లు దు
ర్జనపైశాచికకోటి మైమఱచి నిర్బంధించెనో శౌర్యమం
డన! నీ దివ్యసహస్ర నేత్రములతో నల్దిక్కు లీక్షించుమీ !

25

క్రొంజీకట్ల ముసుంగుతో పసిడినిగ్గుల్ తూగుటుయ్యాలతో
కెంజాయల్ చిగిరించు క్రొందళుకుతో గీర్వాణ మొల్కించి పం
చం జాగ్రత్తగ గండుపిల్లి యయి యాజాబిల్లి కాలూని యీ
కంజాక్షిం జడిపించి మూసెను కనుల్ కల్లోలమై గుండియల్.

26

దిక్కుం మ్రొక్కటులేకయుంటి కరుణార్ద్రీభూతచేతస్కు లే
ప్రక్కం లేరు మదీయజన్మము జగత్పారుష్యకాలుష్య ధీ
దృక్కోణాఖిల పంకమందు విలసత్కీర్త్యామృతాంభోజగా
ముక్కాలంబున వెల్గఁ జేసెడి విభుం ముక్కంటి! చూపించవే.

27

ఈనిశ్శబ్దభయానకాలయము నేఁ డీ క్రౌర్యశౌర్యక్రియా
స్థానాధీశ్వరకోటిచే తెలిచి క్షుద్రప్రేతభూతప్రజా
దీనశ్రేణికి విందుజేసి విలయోద్రేకమ్ము రేగించి వి
జ్ఞానక్షోణిౖ విషాదవైతరణి విశ్వగ్రీవ ! కావింతువా?

28

క్రొవ్వి క్రోల్పులి నెత్తురవ్విధమ్ముగ త్రావి
కారీగ బాధతో కాయగలదె?
పడగవిప్పిన త్రాఁచు పరవశత్వము నొంది
రాగడోలిక దిగిరాగల దటె?
కళ్ళునెత్తికివచ్చి క్రుళ్ళి యేడ్చిన గూబ
పెద్దవెలుగుఁ జూచి ముద్దులిడునె?
మెఱుపుమెఱసి ప్రేలి కొఱవిదయ్యముగుండె
జాలి కేనాడైన స్థానమగునె?
సర్వదేవతాశనమైన చందమామ
చల్లచల్లని కరుణారసమ్ము మఱగి
గుఱకపెట్టిరి కాబోలు సురలుకూడ
చిక్కచీకటిచీల్చువాఁ డెక్క డుండె॥

29

వారిజలోచనా! పదునుబారెడి కోఱలు తేలి పర్వతా
కారముగా వరాహములు కన్నులుపూడి భయంకరాటవీ
స్వైరవిహార సౌఖ్యవిలసన్నవకైరవ కౌరవేంద్ర శృం
గార కళామనోహరము కన్గొని మూల్గిన వెంత బాధమో?

30

ఇక్కడ యిమ్మెయి నుండగ
అక్కడ కమాలాప్తుడు విరహాజ్వరవశుడై
స్రుక్కుచు స్వప్నసుఖంబున
మిక్కిలి చెప్పందొడంగె మేలిమిహితముల్ .

31

ఛాయాదేవి ! జగన్మనోహరకళాబ్జశ్రీవిశాలాక్షి యే
మాయాభీలనిశాచరాధములచే మార్మ్రోగి మూర్ఛిల్లెనో
యే యధ్యాయముగా తయారయి తపం బీనాఁడు గావించెనో
న్యాయం బారసి నా చెవిం బడుము పుణ్యాం బో సుఖస్వప్నమా.

32

వేకువజాము కోడి తెగ ప్రేలెడి వేళ యధార్థభాగ్యముల్
నీకు లభించితీరు గమనించుము పైనముగూడ యప్పుడే
శ్రీకులికించు; కాకి చెలరేగకమున్నె జయాభిలాషతో
నా కమలాలయమ్ము భువనస్తవనీయము సేయుమో కలా.

33

అందము చిందుచుం చిగురుటాకులుకులెక్కడి విశ్వసౌఖ్యకా
వ్యేందిరవై ప్రభాతపరమేశ్వరివై నవయౌవనాంగివై
అందరిడెందమందుఁ బ్రళయంబులు లేపెడి సంజ కన్గవల్
ముం దిదుగో కనుంగొనుముమొత్తము తేలును స్వప్నసుందరీ !

34

కాంచు మరాళకుంతలముఖస్మిత పంకజ మొట్టు లున్నదో
చుంచలమై మహాశ్రమ కషాయ పరిస్ఫుటనేత్రగోళలో
లాంచల మగ్నభగ్నహృదయాచలవార్ధి కథాతరంగమై
మంచము పట్టినట్లయిన మర్లుము తర్లుము స్వప్నశోభినీ.

35

తోడవుల్ వీడిన మేనితో ప్రళయరాత్రుల్ నెట్టుకై మోడ్పుతో
అడవుల్ సొచ్చిన జన్మతో గిరులు వ్రయ్యల్ వ్రయ్యలైపోవు వా
గుడుతో నిర్ఝరులైన చక్షువులతో ఘోషించి ఘోషించి చూ
చెడి నల్దిక్కులు తెల్లవోయెడి యుషశ్శ్రీ కొల్వువెమో స్వప్నమా !

36

ఆపెయె పతివ్రతాంగన
ఆపె కటాక్షమున విశ్వమంతట తృటిలో
పాపతిమిరమ్ము లింక ప
టాపంచ లవునుకదా తటాలున జనుమా.

37

నే నెట్లుంటినొ నీవు కంటివికదా నిక్కంబుగా నాముఖం
బే నాడైనను గామపంకతిలకం బేమాత్రమైనం సుఖ
ధ్యానజ్ఞానవిలాసినీపరవశత్వం బొంది చూపించెనా?
నానిర్నిద్రపరాయణత్వమును స్వప్నప్రౌఢ! శంకించకే!

38

నా వృత్తాంత మభూతకల్పనకు జింతాకంతయుం దాక న
ట్లీ వేదాంతముమీఁదనే నడిపి నన్నీరీతి మర్యాదతో
నీ విశ్వాత్మను నిల్పి చెప్పుము విరించిశ్రీ విపంచిశ్రుతి
ప్రావీణ్యంబు శరణ్యమై కులుకు స్వప్నశ్రీ పురంధ్రీమణీ.

39

కులుకుముత్యము మేలి తళుకునృత్యముగూర్చి
గిరులు నిర్ఝరులు దూకించినావు
కాఱడవి నెమిళ్లజారుకొప్పును విప్పి
నీలి మబ్బులు పైకి ద్రోలినావు

క్రూరమృగాళి సంక్షోభమార్గము నూపి
గుప్పిటప్రాణాలు గ్రుక్కినావు
కడలిరాయడు గొంతుపిడికిలితోఁబట్ట
ముజ్జగమ్ముఁ బ్రతుకు ముంచినావు
రత్నమాణిక్యసౌధాంతరమ్మునుంచి
పూరికొంపలోపల దించి పోయినావు
నీకు నీవె దైవమ్ముతో నిలిచి గెలిచి
యేలుచున్నావు స్వప్నలక్ష్మీలలామ.

40

నీ కెవ డడ్డు రాగలఁడు ని న్నిటువంటి మహాభయంకర
వ్యాకుల ఘోరవీరవిరహ ప్రళయస్థితు లడ్డలేవు లో
కైకబలాఢ్యురాలవు మహీతలమంతయు తెప్పపాటులో
గైకొని త్రింగగల్గుదువు గారడికైవడి స్వప్నమాధవీ.

41

ఇదిగో! నే నసలైనదే మఱచినానీ గుండెకొట్లాటలో
అది యే దేశనివాసురాలయినదో యాతన్వి యేవాడ ను
న్నదియో చెప్పెద; బ్రహ్మపట్టణము సౌందర్యప్రపంచంబులో
విదితంబై విలసిల్లుచుండె కల ద న్వీటం కళారామమై.

42

సౌందర్యసౌఖ్యనిష్యందామృతోత్సవ
శంపాలతలు పూచి చమనులయ్యె
మధురమోహానకళామందారపుష్పవి
శ్వవిలాస మొలికి భవంతులయ్యె

ఆనందవాక్యనాట్యసుమనోహర సరో
వరము పొంగి సిరికాపుఁములయ్యో
ఔదార్యశౌర్యధైర్యస్థైర్యగాంభీర్య
సద్యశోధనమెల్ల జ్ఞానమయ్యో
అసహానవికారదుర్వారరసవిహీన
దుర్మదాంధదుస్సాంకారదుర్బలాత్మ
ఘోరక్రూరమనస్తాప తీరమైన
బ్రహ్మపట్టణమున నలుప్రక్కలందు.

43

నీ వేమాత్రము జాగుసేయక మహానిర్నిద్రపాథోధి కే
ళీవిన్యాసకథామనస్కుఁడగదా మ్లేచ్ఛావరోధమ్ముతో
జీవుల్ తావులుతప్పియుంటి నడు మే శ్రీమంతుతోనైన వా
చావైదుష్యమువెట్టితేని యిక నాజాబుల్ వృథా స్వప్నమా.

44

పైనము గమ్ము రమ్ము తెలవారకమున్నె మదీయదివ్య సం
ధానముగూర్చి మోడ్చి కనుదమ్ములు భీకరలోకయామినీ
మానినియై తపంబున నిమగ్నమొనర్చి సమస్తప్రాణముల్
ధ్యానముసేయుచున్నదిక దా! రమణీమణి! స్వప్నభారతీ.

45

ఏగితివా? కనంబడ వదేమిటి? మాటిదిగో! మరొక్కమా
టాగుము కానరా దెచట కర్గెదు? స్వప్నకళామయూరిణీ!
ఈగడుసైన బెబ్బులులవేమయినం దిగమ్రింగెనా? కటా!
ఓగురు! తెల్లవారినటు లున్నది చెండెద చిక్కచీకటుల్.

46

అని నిప్పుముద్దగ నినుడు
వననిధు లుప్పొంగు శౌర్యవర్చస్సులతో
వనజదళేక్షణకై మొ
క్కనుబోని కరానగూల్చె కారాగృహముల్

47

అంతట ప్రాక్సరోవరకళాబ్జమనోజ్ఞ మయూఖ విశ్వది
గ్దాంతము లద్భుతంబయిన కాంతులు పూచెడిరీతి వజ్ర శు
ద్ధాంతమునుంచి దివ్యకవితా నవరత్న విభూషితాంగియై
కాంతునిగూర్చి పొల్చె భయకంపితుఁడై విధు డక్క డుండగా.

48

వెచ్చనిచూడ్కితో నినుఁడు విస్మయుఁడైకని చంద్రబింబముల్
పిచ్చమనుష్యుఁడై నిలిచి పెచ్చుతలంపులలోన మున్గి యే
మచ్చట నున్నదో కనక యచ్చరువైననిమేషముందు వి
య్యచ్చరపిండు దూరెడి సుధాంశుఁడు మెల్లఁగ దారిబట్టెరా.

49

సూర్యుఁడు కార్యధుర్యుఁడు యశోధనమండనచండశాసనా
చార్యుఁడు ప్రాక్సతీమణివిశాలముఖాబ్జము జూచి చాలు చా
తుర్యము కట్టిపెట్టుము విధుం డపుడే పయనించె నేమి? సౌ
కర్యము వెల్తి లేదుకద! గట్టిగ చెప్పు మటంచు నడ్గెరా.

50

వెలవెలబోయె నీప్రియుఁడు వేలుపుబువ్వయిగూడ దేనికో
గడగడలాడుచుంవెడలె కామిని! యేమని యానతిచ్చితో
కులుకుల కేమిగాని పయికూరిమిపేరిమి నా కదేల? నీ
వలపులు తెల్లమాయె భగవంతుఁడయోమయ మౌను ప్రేమతో.

51

ఊరిన భావముల్ మధునవోదయముల్ మృదుకంఠనాళముల్
మీ రమణీలలామలకు మెల్లగచల్లగ మేళవించి కం
సారి కుమారుఁ డెంత విలయస్వనవిశ్వగళమ్ము విప్పి నాఁ
డో రసరూపిణీహృదయడోలిక లూపులు మిన్నుముట్టెనే?

52

నళినీమణీ నవ్యదళినీ ఘృణీదిశ్య
నయనోజ్వల కళాధనమ్ముకొరకు
జలజ విద్యుల్లతా మలయమారుతకథా
వాగ్వధూటీ వైభవమ్ముగూర్చి
మహతీసుహాసినీ లహరీవిలాసినీ
రసపల్లవశ్రీ చరణములకయి
హిమబిందు సుందరీ సుమనోజ్ఞమాధురీ
నవరత్నహారాణి నగవుగుఱిచి

సప్తసాగరబడబాగ్ని తప్తచిత్త
తీవ్రసంక్షోభ దుర్మోహదేహలోహ
జాతి చిట్టెమ్ముకట్టి దుర్నీతి జగతి
పెంచి పోషించి భూషించి విరగబడిమె.

53

ఛాయా! తావకపల్లవార్చన కళాసౌందర్య వాల్లభ్య జా
తీయేభ్యుల్ నవనందనోత్సవధరిత్రీ వల్లరీ సభ్యులై
మాయుత్సాహ తరంగడోలికలతో నిర్నిద్రశౌర్యార్ణవ
శ్రీయోగమ్ములు పట్టిరెంత సుకృతా శీర్దేశ మూర్ధన్యులో.

54

ప్రాచ్యశ్రీరమణీలలామ ! ధరణీప్రాగబ్ధపాథోధిలో
నైచ్యశ్రేణి ముదావహమ్ముగ భవన్నైష్క్యశిత్యసాహిత్యస
ద్వాచ్యామోదలసత్ప్రసూనగుణ సౌభాగ్యమ్ముతో హాయిగా
శౌచ్యశ్రీ కుసుమాభిషేకములు నిచ్చాల్ సల్పె కన్పట్టవే.

55

ఉదయశ్రీనవకోమలాంగి ! మృదుభావోద్యానశైత్యోపచా
ర దయాంతఃకరణైకకల్పతరు పత్రచ్ఛాయలై యెందరో
చదువుల్ సంధ్యలు ధారబోతురు భవత్సౌందర్య మాధుర్యసా
ఖ్యదశానంతవసంతులైన రసికుల్ కళ్యాణముల్ సూతురే

56

ఆమందారవనమ్ములో పెరిగిఛాయా ! యింక యెన్నెన్ని యో
ప్రేమోపాసనచేయుచున్న విహగశ్రీ రత్నమాణిక్యముల్
నీముందుం దలయెత్త లేవు రసకేళీసౌఖ్యసుస్నిగ్ధపు
ష్పామోదప్రియుఁడైన మాధవుఁడు నీయాలాపముల్ మెచ్చెనే.

57

విఫలాయాసము లేల సాధ్వి! రసపృథ్వీరత్నమాన్వీః ది
వ్యఫలశ్రీస్యముకంటె నవ్యభవదీయచ్ఛాయ నేఁడెంతయో
సఫలంబై శుకశారికాదిసుకవిస్వాముల్ మహోత్సాహ గా
ఢఫలాపేక్ష కసంతులై కలపుపోట్లం తేనె చిందించిరే.

58

ఇక నన్నొక్కఁనిగూర్చి నీ విపుడు దేవీ! యీకళోపాసనా
ధికులం నిష్ఫలభావనాపథకథా ధీశాలురం జేతువా
సకలైశ్వర్యవసంతమోహన తపస్సామ్రాజ్ఞి హర్మ్యంబులో
సుకుమారత్వము దివ్యజీవితము వీచుం పుష్పసౌరభ్యముల్.

59

అడ్డము లెమ్మటంచు ప్రణయ ప్రగతుల్ విరమించు మంచుఁ గ
న్పడ్డ సుఖస్వరూపచరణమ్ములు పట్టు మటంచు మింటిపై
దొడ్డమయూఖుఁ డెక్క జలధుల్ జగతుల్ ప్రళయాగ్నిదృష్టితో
గడ్డగమార్చి మాడ్చి యలుగల్ వడగాడ్పుదురుల్ పగిల్చెరా.

60

మధ్యస్యందన చండభాస్కరుని బ్రహ్మాండ ప్రతాపంబుతో
సాధ్యాసాధ్యము లేవిటో, కనక విశ్వంబెల్ల మార్మ్రోగి సా
రథ్యం బెవ్వని కివ్వలేక జగదారాధ్యుం డెవండో మహో
పాధ్యాయుం డెవడో కనుంగొనుటకై ప్రారబ్ధమై వేగరా.

61

గుండియపైన పెంకులు చిట్లిపోయెడి
వాడికత్తులు త్రుప్పుపట్టె నేమొ
కదలిదయ్యము కాళ్ళుముడుచుకొని పడెడి
వీరపౌరుషము చల్లారెనేమొ
గహనక్రూరమృగాలు గుహలలో జొచ్చెడి
మొగిలిలు నభమం దణగిన వేమొ
కొండలమెకిమీఁదు గొణుగుచువణకెడి
ఆఖండలుడు మానియయ్యె నేమొ
యింతప్రళయమార్తాండవహ్నిరగిలి పగి
లి దశదిశలెక్క భగ్గున లేచిలేచి
దాహతాప విరహమనస్తాప మయ్యె
కోకిలస్వామి! నీవైన దూఁక వేమి?

62
తావకపంచమస్వరసుధారస మేరికిధారవోతువో
జీవము లేచివచ్చి నవజీవితకోమలపల్లవార్చన
శ్రీవిభవమ్ముతో పుడమిచేడియ పూజలు సేయు నీకు నీ
రావము మోడుమోక కౌనప్రాణములో దిగనిమ్ము కోకిలా !

63
ఏమధురప్రభాతమున కీవుసుమించితివోకదా! పిక
స్వామి! త్వదీయరమ్యమృదుపల్లవ కోమలకంఠమాధురీ
ప్రేమరసాభిషిక్తుడయి విశ్వమయుండు దయార్ద్రభావజీ
వామృతవర్షముల్ బ్రతుకులన్నిటిపై గురిపించుc గూర్మితో.

64
విమమో కోయిలరాజ! దేనికి వృథావిశ్వంబు మార్మ్రోగు న
ట్లు నినాదమ్ము కుహూకుహూ యని పటాటోపంబులం జేతు మం
డినమార్తాండుడు శాంతిచెందెడి కళానృత్యోత్సవశ్రీప్రస
న్ననవాలాపకథాకలాపమధుగానం బింక వర్షించుమీ.

65
శంఠవు నీవు నీసాగసుమాడక కంఠము చించుకొన్నవై
కుంఠము ముందు నూడిపడి కోటి జయంబులు నీకుగొల్చునా?
శాంతికపాయ మేమయిన జట్టితివా? నవపల్లవార్చనో
త్కంఠత హెచ్చుజేసి వడగాడ్పుడికించితి వక్రదృష్టితో.

66
ఋతుభూపాలకులార! విశ్వమురళీ ఋష్యాదులారా! జగ
న్నుతికెక్కించెడి మీరు మీతపము మిన్నంట్టి మేఘంబులై
బ్రతుకుల్ పచ్చగ పల్లవించుటకు ధారాళమ్ముగా కుంభవ
ర్ష తరంగమ్ములు నెత్తిపోయుడు కృపార్ద్ర శ్రీ కటాక్షమ్ముతో

67

మండినస్వార్థవహ్ని మతిమంతులలో ప్రళయాగ్నిగోళ మా
ర్తాండవిదాహతీవ్రపరితాపములై దిశ లెక్క నేను బ్ర
హ్మాండము నిప్పుముద్దయిన దయ్యా! తపోధనులార ! మింటిపై
లెం డిక శాంతివర్షము ఒలియమునేయు ముదారదృష్టితో.

68

ఈ ఘనమేధావులలో
మేఘోదయ మైననాడు మేదిని కులుకుల్
శ్రీఘల్లు ఘల్లనుచు క డ
మోఘముగా కుట్మలించి పుష్పించు జుమీ.

69

పుష్పకిశోర! నీభువనమోహను డెంత మహాత్ముడో కళా
శాష్పము నోడ్చి నీ ప్రణయభాగ్యము మేలిమి జేసె దేశముల్
నిష్ఫలమైన వెన్క రమణీయ సుఖా లెటు పల్లవించు? స
పుష్పవిహారిపుష్టి కొలబోయుము సుందరి క్రూరసృష్టిపై.

70

దశవెల్గు వారిసృష్టికి
మశకంబై, విశ్వకర్త మాయామహిమా
తిశయంబు లక్షరములో
నిశితంబుగఁ ద్రవ్విపోయు నెవ్వరి కవియే

71

అవిభు డ కవీశ్వరుఁ డహర్నిశ మతుగదృష్టితో ధరా
దేవి వరాలనోములకు దిక్కయి యీప్రళయాగ్నిశైలలో
కావళిపై మహాముని ఘనావళి దెచ్చికృపాభిషేకముల్
ప్రోవులుపోసె! దూకగ నమోఘతరంగమృదంగనిర్ఘరుల్.

72

నెత్తురుగ్రుడ్లుగూడ గమనించెడివిశ్వకవీంద్రవాక్కులో
మెత్తని వేమిటో బహు సుమించి రమించి.జగద్ధితంబులై
హత్తిన వేమిటో ఋతుచయంబు మహాఋషివంగడంబు దం
డెత్తెను నీలిమబ్బులయి హెచ్చులు చిచ్చులు జిమ్మ వానిపై.

73

ఆశాలతా స్వర్ణహార సౌదామిని
జయహారతులు దిగ్విజయములయ్యె
జలద గంభీరనిస్వనవిధాన విమాన
పౌరుషమ్ములు జయభేరు లయ్యె
బృందావనోత్సవ మందారపుష్ప వి
తానమ్ములు జయపతాక లయ్యె
రసవిలాసధునీతరంగమ్ములు తురంగ
మాతంగ చతురంగజాతు లయ్యె

గగనమండలిమార్మ్రోగి పగులుచుండె
రోదసీగహ్వరమ్ము నిర్ఘోషమయ్యె
వీరచండభాస్కరుఁడు చల్లారుచుండె
మునివరులు జన్మధారఁబోసినకతాన.

# గీతాంజలి

శ్రీకార జగజ్జననీ
ప్రాకార సువర్ణవజ్రవై డూర్యమణీ
నీ కారుణ్యార్ఘురిపయిన
నా కావ్యము క్రొంబసిండినావ కదమ్మా॥

మేరువై తోడిగెగా పేరు నిల్పంగ నీకు
నూరుయుగాల బంగారుతోడుగు
జలధియై లేపెగా జయదుందుభిగ నీకు
దేశదేశాల కీర్తి ప్రతిష్ఠ
తనయుండై తలంచెగా దయపుట్టగా నీకు
వేదవేదాల గంభీరసూక్తి
రసికుడై కొలిచెగా రసమాధురిగ నీకు
రత్నమాణిక్యాల రాశిరాశి

ఏమి తక్కువచేసె నేండింక నీకు
విజయవాడ వేదాంతకవి వరుండమ్మ
ఏలవమ్మ ని వరహాల బాలుండమ్మ
కరుణరసవర్గ! చల్లని కనకదుర్గ॥

"ఆంధ్ర బెర్నార్డ్‌షా"
వేదాంతకవి

# నన్ను చెప్పనీ

నవ్విస్తున్న పరహాలు, కవ్విస్తున్న కలహాలు, దువ్విస్తున్న తరహాలు, త్రవ్విస్తున్న సలహాలు పుస్తకాలై, దస్త్రాలై వేనకు వేలు, లక్షలకు లక్షలు సంపాదించిపెడుతున్న లోకంలోవాణ్ణి. ఎక్కడా అయిపూ అజా లేకుండా వున్నవాణ్ణెవణ్ణో నమ్ముకొని, గొంతులు చించుకొని గోలపెడుతూన్న, గుండెలు పడుతూవున్న యిరుగు పొరుగులో ఇరుక్కున్నవాణ్ణి.

అంచేత నేనుగూడా యీ బాపతు భయభ్రాంతులతో వులిక్కిపడి, గడబిడపడి, అయోమయంలోపడి, అలివికాని రాపిడిలోపడి నలిగి నలిగి నులినులియై, పొడిపొడియై నీరసమై, భక్తిరసమై, పాదరసమైన మనస్సుతో నిలుకడలేకుండా నిబ్బరం లేకుండా వున్నా. దేనంతూ కనుక్కోలేని వేదాంతాల్తో సిద్ధాంతాల్తో పల్టీలు కొడుతున్నా. ఉల్టాసీదాలు కొడుతున్నా.

ఈ విధంగా వుక్కిరి బిక్కిరియై, చిక్కిరి బిక్కిరియై చివరకు చేసేదేమీలేక, చేయటానికేమీతోచక యీ జగత్తంతా వట్టి మాయే అని వొక్క నిట్టూర్పువిడుస్తున్నా.

బ్రతుకుకోసం బయల్దేరి యిన్ని దండకారణ్యాలలో, ఇన్ని బంగాళాఖాతాల్లో సంపాదించుకొన్న యీ మాయతో జీవిస్తున్న వాణ్ణి. అయితే యిది పబ్లికులో కెక్కించేటప్పుడు మాత్రం నన్ను మాయగాడని యెవడూ తెలుసుకోలేనట్లు శాస్త్రాల్తో, సంగీత సాహిత్యాలతో, కవిత్వాలతో, వాఙ్మయ ప్రభుత్వాలతో జబర్దస్తీగా

కనిపిస్తున్నా. ఇంత హోదా వెల్లబోస్తున్నవాఁడు ఈతనిది "కుంచారం" కాదటయ్యా అని నేను పుట్టి పెరిగిన పల్లెటూర్ని యెవరన్నా చేయెత్తి చూపిస్తేమాత్రం యినాఁటి నా బస్తీ అవతారం నరసింహావతార మెత్తకమానదు. నా నేటివ్‌ప్లేస్ ఢిల్లీ అంటేకాని నా ఫీవర్ తగ్గదు. అంత ముదురుపాకంగా కనిపిస్తున్నానన్నమాట. ఈమో స్తరుగా నేను గీతాపారాయణయుగంలో దైవధ్యాన జగంలో తయారైన సరుకుని. ఇంకా ముందేమాదిరిగా నాజూకైనసామానొతానో అసలందటిసీ నిజంచెప్పనీయని కత్తులమీద నివాసాలైతే నావంటివాని భూతవర్త మాన భవిష్యత్తులెట్లానికచ్చిగా, నిర్దుష్టంగా బయటికొస్తై ? అం చేత నా మాయ జీవితానికి యిదీ ఒక విధాన మెటుగ్గానే కనిపిస్తున్నది.

దగా జీవితానికున్న దర్జా, తడాఖా మత్తే దేవత్వానికిలేదన్న అభిమానం, అసమాన విజ్ఞానం నాలో ముదురుతున్నవి. దాంతో నేనెంతవాడికీ పట్టుపడనంత వేషభాషల్తో ద్వేషరోషాల్తో మిడిసిపడే నా వాలకాన్ని, నా కీలకాన్ని అతి వినమ్రతాభావకిరణాల్తో విరాజిల్ల చేస్తున్నా. పరాక్రమిస్తున్నా.

ఇంత హడావుడి జీవితాన్ని, యింత హంగామాభాగోతాన్ని బలిపిస్తున్న యీ మానవసంఘ సంస్థానాన్ని మరామత్తుచేసే విశ్వ విజ్ఞాన విప్లవాలు పెద్ద తుపానుగా పట్టనంతవరకూ నా మాయల మారి గారడీలకీ, నా కపట నాటక జీవితాలకి వుపద్రవం వుండదన్న గుండెధైర్యంగలవాణ్ణి.

అంచేత అటువంటి విజ్ఞానవిప్లవాలు నాచుట్టుపక్కలెక్కడా తలెత్త కుండా తంటాలు పడుతున్నవాణ్ణి. పహారాలు కాస్తున్నవాణ్ణి. దీనికి

తోడుపడే తోడేళ్లవంటి హేమా హేమీలతో చెట్టాపట్టాలుపట్టి సకిలింపుల్తో, ఇకిలింపుల్తో స్నేహం చేస్తున్నవాణ్ణి. ఈ ప్రజ్ఞా విశేషాలు ప్రదర్శిస్తున్న నా తమాషాలకింకా పూర్వ మూఢనమ్మకాల్లో క్రుళ్లి పళ్ళికిలించి పెద్ద మద్దతిస్తున్న సనాతన శల్యసంఘాన్ని మెడ పట్టుకొని కూర్చున్న మేధావంతుణ్ణి.

ఇహ తాము చదివేది యేదీలేదని ఒళ్ళు విరుచుకొని తిరుగుతున్న విద్యావంతుల అహంకారగోళం నాకు స్వేచ్ఛావిహారసీమైంది ఏనాటిగ్గూడా ఎంత ఆర్జించినప్పటిగ్గూడా తమకి సంతృప్తికనిపించకుండా, అసలు తమకెంతకావాలో ఆకాశపు నోరుతెరచి అడక్కుండా ప్రొద్దస్తమానం పైకం కోసం మైకంకమ్మి మైమఱచి తిరుగుతున్న శ్రీమంతులు దురాశాపిశాచ నిశాచరభూమండలం నాకు ఆఖండల సామ్రాజ్య కళ్యాణమహోత్సవ నవరత్నమండపమైంది. ఇహ విద్యావంతులకి అసంతృప్తి, శ్రీమంతులకి సంతృప్తికావాలన్న మాటెట్లా నా చెవినిపడుతుంది? నాకెట్లా ముందడుగు పడుతుంది? దానికి తోడుగా బడాయి కొట్టటం బాగా అబ్బింది. బజారులోబడ్డ బ్రతుకులకు బడాయి ప్రాణప్రదానమైందేగా.

అనాదినుంచి యీ మానవసంఘం పునాది కుదించి, పెకలించి చూస్తే రెండు పనికిమాలినవి కనిపిస్తున్నై. అవి యివిగో: బీదమొహం పడేస్తున్న బిచ్చాలు, భీష్మించి చేస్తున్న శపథాలు. జీవిత విజ్ఞాన సౌందర్య ధనాన్ని యీ బిచ్చాలు, శపథాలు నిట్టనిల్వునా ఖూనీచేస్తున్నై.

ఇలాటివి బోలె దనుభవాలు కళ్ళకి కట్టినట్లుగా వొకచోట కని పిస్తుంటే నామీద బిచ్చాలు పెట్టేవాళ్ళని ధర్మదాత లనటం, యీ శపథాలు పట్టేవాళ్ళని మహాత్ములనకోటం నాకు బాగా అబ్బింది. ఇదే యీ బానిసత్వానికి వారసత్వంగా వచ్చిపడ్డ ఆస్తి పాస్తి.

బిచ్చాలు పెట్టి పెట్టి తోటిమానవుణ్ణి యెంత హీనంగా దీనంగా తయారు చేసుకొంటున్నానో యీనాడు నా దవడకింద దండకాలు, ధర్మశాస్త్రాలు నన్ను తెల్సుకోనీయకుండా కట్టేసినై. శపథాలు పట్టిపట్టి నన్నగిల్లిపోతున్న తోటి మానవోత్తముడు శివాలుపెరిగి, జుట్టు విఱగబోసుకొని వీధిని బడేట్టుగా, వానివెంట వీరంగాలు వాయించుకొంటూ, గుగ్గిలాలువేసుకొంటూ యెంత బలవన్మరణానికి అతణ్ణి లాక్కుపోతున్నానో నన్ను తెల్సుకోనీయకుండా పాతరపడ్డ పురాణాల్లో జాతరమైన జీవితాలు నన్నాశీర్వదిస్తున్నై; అభినందిస్తున్నై.

ఇటువంటి నరహత్యా పాతకాలెన్నో మాయకథలతో, తీయని సంగీతాలతో మెఱుగులుపెట్టి నవరసులుగా మార్కెట్టు చెలామణి చేసుకొంటున్నమాట నేను చెవినిబెట్టుకోకుండా వీటికి తతంగాలు వన్నిన వాళ్ళని చూచుకొని మధుర ప్రసంగాలు చేస్తున్నా.

ఒకళ్ళొకళ్ళు చంపేసుకొందామని తెగించి నడుం బిగించి దూకి యుద్ధానికి బాకులూ, తుపాకులూ తీసుకొని కళ్ళు చెదిరేట్టు, ఒళ్ళు గగుర్పొడిచేట్టు రక్తప్రవాహాల్లో తుండాల్ని, మొండాల్ని దొర్లించు కొంటూ చుట్టుపట్ల దుఃఖ సముద్రాల్ని పొర్లించుకొంటూ, జయ

భేరి ప్రయోగించుకొంటూ పోతున్న రావణసంహార శౌర్యధుర్యుడైన వానిని చక్క చక్కని పద్యాల్లో, గేయాల్లో చుట్టి, కమ్మ కమ్మని రాగాలతో దవడల క్రిందణచిపెట్టి యెంతకాలంనించో భక్తిరసం తీస్తున్నవాణ్ణి నేను. గెలిచినవాణ్ణి తలచినవాఁడు భక్తుఁడౌతాడన్న మాట సార్థకం చేస్తున్నవాణ్ణి నేను. ఈ బాపతు బాణీ పుణ్యమా అంటూ సంఘంలో ధనవంతులూ, బలవంతులూ కొనియాడబడుతున్నారు. అన్యాయంగా, అనివార్యశౌర్యంగా పైఁబడి పీక్కుతినే ముఠాల్ని యథేచ్ఛగా, పరీక్షగా వీరవిహారం చేసేటందుకు భజనతో వాళ్లని బలిపిస్తున్నా. ఇంకా "భజనపరులకేల దండపాణి భయము?" ధనముతో మూల్గిస్తున్నా, దుర్గర్వంతో దుమికిస్తున్నా, విజ్ఞానంతో నిమిత్తంలేని సంఘాన్ని. అంచేత నేను ధనదాసుణ్ణౌతాను గాని హరి దాసుడనుగాను.

ఈ వరస రామనామ సంకీర్తనలతో నేను నా ధన దాసత్వాన్ని తత్వాల్లో, కవిత్వాల్లో కప్పిపుచ్చి మహాకవిగా, మహాభగవద్భక్తుడుగా సంఘంలో చెలామణి అవుతున్నా పైకి కనిపించని నా ముదిరిపోయిన స్వార్థం పెంకుకట్టి నే నిహా రాంబదుల టెక్కుల చప్పుడు పైకి వినిపించనట్లు త్యాగయ్య, క్షేత్రయ్య కీర్తి కళేబరాలపై వ్రాలి వంగనామాల్లో గరుడాళ్వారనిపించుకొంటున్నా.

ఈ తంతగంతోనే సంఘంలో బలిసిన ధనాఢ్యుని, బలాఢ్యుని శంఖచక్రగదాధారుణ్ణిచేసి, వడ్డికాసులవాణ్ణిచేసి వూరూరా, యింటింటా వేంకటేశ్వరస్వామిగా నిల్పి కొల్పిస్తున్నా. వీళ్లందరిపైనా

హైకమాండ్ ప్రెసిడెంటుగా తయారుచేసిన యేడుకొండలవాడికి తిరుపతికొండ సెంట్రల్ ఎసెంబ్లీగా నిర్ణయించి, యిటువంటి యింత పెద్ద పంగనామాల రాయుడికి ఇహ అందఱివొంటిమీది బంగారు తొడుగులు ముడుపులుగా కట్టించి, అమాయకులందఱి జుట్లూ వాడి దివాణంలో సొంతంగొరిగించటానికి పంపిస్తున్న నేను సంఘంలో భాగ్యశాలికి భక్తాగ్రగణ్యుణ్ణైనాను. అందుచేత నాదేహం ఇంత బిదురుతో, దురదతో గిడసబారి, బండబారి నేనుకూడా అక్కడక్కడా నాప్రక్కను నాకు తాళంవేయటానికి నాకు భజనచేయటానికి కొన్ని వెఱ్ఱిమొహాల్ని తేవదీస్తున్నా. ఎందులోనన్నా కాస్త పేరు వస్తేసరి ఆపాట్న నావెంట భజనపరుల్ని వేసుకొని తిరగాలనిపిస్తుంది ఈ కంఠమాలిజాడ్యం నాకు జాస్తిగావుంది. ఇది ప్రజానాయకత్వాలు సంపాదించిన పెద్దతలలన్నింటికీవుంది. ఇందులో అందెవేసినచేతికే బజార్లలో జబర్దస్తీ పెత్తనాలు, అధికారాలు దొరుకుతున్నై. అంచేత ఎప్పుడూ ఎవడో వొకడు భజనపరుఁడుగా నావెంట తయారై చమ్మగా నావీపు గోకుతుంటే నాకు బ్రహ్మానందంగా వుంటుంది. ఇటువంటి భజనపరుడు నమ్మినబంటుగా హనుమంతుఁడుగా నాముందు నడచి యింకా తనవంటి కోతిమూకను తెచ్చి నా భజనపరులుగా కట్టేస్తున్నప్పుడు నాకు నేనే కోదండరామావతారమనిపించి యేమిటో చెప్పలేనంత విసురుడుగా యేదో వెఱ్ఱి ఉన్మాదం నాలోంచి గాలిదుమారంగా లేస్తుంది. దాంతో యిహ గ్రామగ్రామాల్లోనూ సంగ్రామాలు, హంగామాలులేపి వూరూ పేరూలేని, నోరూవాయీలేని వట్టి అమాయకజనం మచ్చమాపి నా ముఠాదారులందఱికీ పట్టాభిషేకాలు జరిపిస్తున్నా. కనుక వెంట భజనపరులుంటే ఎంత లాభమో, యెంత జగదేకారాధ్యుడు కావచ్చునో తెలుసుకొన్నా బాగా. ఈ భజనపరులకి, భక్తాగ్రేసరులకి,

కవిసార్వభౌములకి కావల్సినన్ని అగ్రహారాలు, మడిమాన్యాలు వెనుక బాగా కట్టబెట్టారు. ఈ పెళ్ళికూతురు సినిమాయుగంలో బాపతు భజనపరులైన పత్రికా సంపాదకులగ్గూడా కావల్సినవి కట్టబెట్టి వెంటపెట్టుకొన్నా. జయభేరి కొట్టుకొన్నా. ఈ రుచి మఱిగే కాబోలు గుళ్ళల్లో కాపురాలున్న దేవుళ్ళందరిగ్గూడా తమ భజనపరుల మీద అంతమక్కువెక్కువై భక్తాగ్రగణ్యుల భక్తిపాశాలకి కట్టుపడ తామని, తామెప్పుడూ దాసదాసాను దాసులమని చెప్పుకొని మంచి నిషామెక్కించి భజనపరుల్ని తమ పాదాలదగ్గర కట్టేసుకొన్నారు. ఈ దేవుళ్ళ బ్రతుకూ, ఈ నాయకుల బ్రతుకూ, ఈ మహా విద్వాంసుల బ్రతుకూ భజనపరుల మీ దుందని నే తెల్సుకోక తప్పిందికాదు. రాగారాగా నా తీటకోసం నే నట్లా తయారుకాక తప్పిందికాదు.

అయితే ఈ వరస సంవత్సరాలతరబడి నువ్వొత్తిపోయదలచుకొన్న చెత్తా చెదారాలకి మేం సహించాలా ? అని దూకుతారేమో!

అట్లాగే యేండ్లతరబడి నేను సహించినట్లుగా ఇప్పుడు నేను చెఱిగిపోసేవన్నీ సహించి గ్రహించాలి. మఱి నిన్న మొన్నటివరకూ నీ చేతిలోవున్న ధర్మశాస్త్రాలన్నీ బస్తీరోడ్డుమీది పోలీసు జవానుల మల్లే నిలబడి, బారలుసాచి, దారులు చూపి, బిగుళ్ళువేసి, బెదరగొట్టి, వట్టి అలిపిరికి మనుష్యులైన అమాయకుల్ని హడలగొట్టి చాటుగా చేతులుపట్టి ప్రభుత్వాలు వెల్గించినట్లు నా హయాంలో కూడా కాస్తట్లా, నన్ను చెలరేగనిస్తారా లేదా మీరు ? వ్యవహారమంతా యిట్లా అడ్డంతిరిగిందేమని భావిస్తారేమో. మఱి యాక్షనికి రియాక్షన్ సహజమేగా.

ఇన్నాళ్ళూ నువ్వు చెప్పేదానికి వెంట నేను ఫిడేలుమాదిరి వంత పాడుతున్నట్లు నేను చెప్పేదానికిహ నువ్వుకూడా ఫిడేలల్లే వంత

పాడుతున్నప్పుడు మన చుట్టరికం సిగపట్లగోత్రాల కేనాఁడు సిద్ధంగాదు. ఈ లోకంలో ఫిడేళ్ళ బ్రతుకన్నా చూచుకోవాలి. తోడేళ్ళ బ్రతుకన్నా చూచుకోవాలి. ఈ రెండింటిలో యేదో వకటి అలవాటు కానివాని అగచాట్లు చెప్పి రాసులు పోయటానికి పద్యాల్లు భువనాలు గూడా చాలవు.

ఇటువంటి ఫిడేళ్ళు తోడేళ్ళు బ్రతుకుతున్న సంఘంలో వొక గ్రుడ్డిమాట పెత్తనం చేస్తున్నది. అది అందఱిమొగుడుగా "అదృష్టం" అని పేరుపెట్టుకొన్నది. ఈ అదృష్టానికి ముక్కూ మొహం లేదు, దిక్కూ మొక్కూలేదు. లేకపోయినప్పటికిగూడా జగన్మోహినివలె అందఱ్నీ బానిసల్ని చేసి బలహీనుల్ని చేసి తింటున్నది. ఈ అదృష్ట మనేమాట మానవసంఘానికి వేరుపురుగుగా పుట్టి సంఘాన్ని అభ్యుదయ మార్గంమీద అడుగుపెట్టనీయడంలేదు. నల్గురు కలిసి వొకణ్ణి ముంచి, తమ చేతులారా అమాంతం అట్లా మునిగినవాణ్ణి, పైకి తేలనివాణ్ని పట్టి దురదృష్టవంతు డని పెద్ద నల్లరాతి బండమీద దొర్లించిపోతున్నారు, ఖూని చేసిపారేస్తున్నారు. మళ్ళీ యింకో నల్గురువచ్చి మునిగినవాణ్ని బయటికితీసి యింతకు అదృష్టం వుండబట్టే నూకలింకా మిగలబట్టే బ్రతికి బయటపడ్డాడని వాఁడి చుట్టూతా చెక్కభజనచేసి చిందులు త్రొక్కుతున్నారు. అసలు నిఖార్సైన మనిషి జన్మ తయారు కాకపోవటంమూలానే సంఘంలో క్రూరమృగజీవనాలు కనిపిస్తున్నై. ఈ గ్రుడ్డిమాటైన "అదృష్టం" ఆటలు సాగుతున్నై.

ఈ మాదిరి మనిషిమాంసం బాగా రుచిమఱిగిన అదృష్టరాక్షసి ఆటేపున్న ఖామందులమీద అభూయిత్యం చూపించటానికి పొదను కొంటూ. పట్టాభిషిక్తుడు కాఁబోతున్న రాముడు అమాంతం అడవికి

లేచిపోవాల్సిన అవస్థ వచ్చిపడ్డప్పుడు, రాముడు భీకరారణ్యంలో సీతను గోలుపోయి సీతాన్వేషణకోసం చెట్టుగుట్టలుపట్టినప్పుడు, రాముడు పట్టి దురదృష్టవంతుఁడని వదలిపెట్టక రాముడు కేవలం పితృవాక్య పరిపాలకుడని, దుష్టశిక్షణార్థం అవతరించిన అవతార పురుషుడని యీ సంఘం ప్రోత్సహించి, అభినందించి, అడవిలోగూడా ఆదుకొన్నది. ఈ రాముడు లేనివాడి కడుపునపడి నానా అగచాట్లు పడుతున్నప్పుడు మాత్రం సంఘంలో పుట్టిపెరుగుతున్న "అదృష్టరాక్షసి" హాతమార్చి పారేసేది. పురాణ ప్రపంచంలో బాగా కల వాళ్ల కడుపునబడ్డ బిడ్డలంతా యెన్నో కష్టాలపాలయినప్పుడు వాళ్లకి పేరు ప్రతిష్ఠలిచ్చి కష్టాల్నుంచి గట్టెక్కించిన సంఘం యీ నాడు కష్టపడుతున్నవాళ్లని కాపాడలేకపోతున్నది. నల్గురూ కలిసి ఆదుకొంటే అదృష్టం పడుతుంది. నల్గురూ కలసి నిరసించి అసహ్యించుకొని విడనాడినప్పుడు దురదృష్టంపడుతుంది. అయితే యీ అదృష్టం అనాదరణ చూపిస్తున్న సంఘంయొక్క హాక్కుభుక్తంలో వుందని తేలింది.

ఒకానొక పేద దంపతులకి ఒక పిల్లవాడు పుట్టాడు. వాఁడఖండ మేధావంతుడౌతాడని, నవఖండలాధిపతియై తీరుతాడని వాఁడి జాతకం చూచి జ్యోతిష్యులంతా చెప్పారు. అట్లాగా అని ఆ పిల్లవాణ్ణి బహు భద్రంగా ఒక సర్కసు బోనువంటి బోనులో వేశి, వేళకి తిండి తిప్పలు చూచుకొంటూ ముప్పయేళ్ళు పెంచారు ఆ విధంగా బోనులో పెరిగిన ఆ మహాజాతకుణ్ణి ముప్ఫైయేళ్ళ తర్వాత బోనులోంచి బయిటికితీసి అంతా వాణ్ణి పలకరించి చూస్తే జ్యోతిష్యులు చెప్పిన లెక్క ప్రకారం, సంఘంలోవున్న మూఢనమ్మకాల ప్రకారం, మేధావంతుఁడుగా మాట్లాడుతాడా? అడవి మనిషిగా అరుస్తాడా?

అందఱికీ సంఘములో తిరిగి ప్రపంచానుభవం సంపాదించి నప్పుడే మాయలు మహాత్ములూ వస్తై. ఈ మాయలూ, ఈ మహాత్ములూ నల్లుమూకలపి ప్రయోగిస్తున్నప్పుడే అదృష్టంఅనేది, దుర దృష్టం అనేది వస్తుంది. ఈ విశాల విశ్వవిజ్ఞాన భావభాగ్యంపట్టించే చదువులు సంఘానికి అంటినప్పుడే బ్రహ్మరాక్షసుల్ని తరిమి పారేస్తాం.

అదృష్టవంతుణ్ణెవడూ చెరపలేడనీ దురదృష్టవంతుణ్ణెవడూ బాగుచేయలేడని రాక్షస సామెతలు పెట్టుకొని తోటిమనుష్యుల్ని. అభ్యుదయమార్గాన్ని హతమార్చి బకాసురులు సుఖజీవనాలు చేస్తు న్నారు. "కాకుసున్నా పెడితే ధం" అనే వట్టి బడుద్ధాయి రకాన్ని భాగ్యవంతులు కని పెంచుకొని వాడెట్లాగైనా అదృష్టవంతుడని భజనపరులైన లేకి మొహాల వాళ్ళచేత భజన చేయించుకొంటున్నారు, మందూ రాంబోతుల మాదిరి బలిపించు కొంటున్నారు. సంఘానికి విజ్ఞాన చైతన్యాన్ని ధారపోసే మహా మేధావంతులకి, శ్రమజీవులకి ధారకం లేకుండాచేసి మొండపెడుతున్నారు. చూడండి! అదృష్టం సంఘాన్ని యెంత ముద్రష్టంచేసి పారేస్తున్నదో; సంఘానికి దయ్యం మాదిరి పట్టిన మూఢవిశ్వాస మూర్ఖత్వాలు, అమాయకత్వాలు రోగిష్టి వాళ్లనీ, కుంటి గ్రుడ్డివాళ్ళని తయారుచేస్తున్నది. ఈ పరమ సత్యాన్ని ప్రజలు తెలుసుకోకుండా అదృష్టం అనే మత్తుమందు కథ లలో, సంగీతాలలో కలిపి పోస్తున్నారు. కళ్ళు మూస్తున్నారు.

మనిషి గుండెకాయతీసి దాన్నింకోమనిషికి పెట్టి బ్రతికించి, చచ్చిపోయినవాని నల్లగ్రుడ్లు తీసి వాటిని పుట్టు గ్రుడ్డివాడైనవానికి పెట్టి చూపు తెప్పించి, వృద్ధునికి మర్కటరక్తం యెక్కించి యౌవన పుష్టి రప్పించి, పరమాణుశక్తి ప్రభావంతో నక్షత్రగోళాన్ని పరామ

ర్షించి, మబ్బుల్ని పితికి మరుభూముల్ని వసించి మానవత్వానికి దేవత్వం సంపాదిస్తున్న యీ సైన్సుయుగంలో, మానవుణ్ని మృత్యుంజయుణ్ని చేయుటకు గొప్పగా సైన్సు డెవలప్పయిన యీ నవయుగంలో ఇంకా వాఁడదృష్టవంతుడనీ, వీఁడు దురదృష్టవంతుడనీ మాయపన్నాగాలు పన్ని బ్రతుకుదామని చూస్తున్న వెఱ్ఱివాళ్ళని ముందుయుగం ఎంత వెక్కిరిస్తుందో చూడకపోరు. అదృష్టవంతులమని విఱ్ఱవీగిన వాళ్ళగతి, దురదృష్టవంతులమని దుఃఖిల్లినవారి స్థితి మన ప్రక్కనున్న రష్యాదేశంలో, చైనాదేశంలో, యెట్లా తారుమారైందో చూడనన్నాచూచి వివేకం తెచ్చుకోవచ్చు. విశ్వకుంటుబం లోకి రావచ్చు.

అసలు తలో ఆచారం, తలో ఆహారం పెట్టుకొని బ్రతుకుతున్న బ్రతుకులు విశ్వకుటుంబంలో భద్రంగా వుండలేవు. తలో ఆచారం తలో ఆహారం పెట్టుకొన్న మూలంగానే మహాకాటకాలు, మతోన్మాదాలు, భాషోన్మాదాలు మన దేశానికి దయ్యాలుగా పట్టినై.

ప్రభుత్వంవారు టంకసాలలో అందరికీ వొకేరకమైన రూపాయలు చిల్లర్లు వేసి అందిస్తున్నట్లు ఈ నాటి మతోన్మాదాల దేశంలో, భాషోన్మాదాల రాష్ట్రంలో జిల్లావకటింటికి ఆహారశాల వొకటి కట్టించి, అందఱికీ వొకేరకమైన రొట్టెలు, బిస్కత్తులు, పానీయాలు, వివిధమైన ఆహారపదార్థాలతో తయారుచేసి చట్టబద్ధంగా, కట్టుదిట్టంగా అందిస్తుంటే యీ మతోన్మాదాలు, ఈ భాషోన్మాదాలు పటాపంచలైపోతై.

అయితే మనం ఇకనైనా కొట్టుకొనిచచ్చే భాషాప్రయుక్త రాష్ట్రాన్ని నిర్మించకుండా ముఖ్యంగా రాజప్రముఖ యాగంచేసి,

అందఱికీ ముఖ్యమైన, కేంద్రమైన పట్టణాల పేర్లతో రాష్ట్రాల్ని నిర్మిస్తే భాషావైశాల్యాలు తగ్గి రాష్ట్రోన్మాదాలు నిర్మూలనమైపోతై. ఐక్యాలు, సౌఖ్యాలువస్తై.

అంతేగాని వెనక సర్పయాగంచేసి సర్పజాతి మొత్తాన్ని అగ్నిహోత్రగుండంలో ఆహూతి చేసినట్లు ఆంధ్రమహాయజ్ఞం తలపెడితే మటుకు ఆంధ్రజాతి మొత్తానికే చివరికి ముప్పు వస్తుందనుకోవలసి వస్తుంది. ఎంచేతనంటే మఱి అది యీ ఆంధ్రమహాయజ్ఞం అన్న మాటలోనే కీడు జొరబడ్డట్టుగావుంది. దీనికంటే చేయాల్సిందసలు రాజప్రముఖయాగం. దేశ భావిభాగ్యోదయానికి పెద్ద అడ్డంకిగా హిమాలయాలై కూర్చున్న రాజప్రముఖుల్ని కుదించి కదిలించి ప్రజల్లో కలిపేయటానికి "రాజప్రముఖయాగం" తలపెడితే ఇహ దాంతో ఈ మైసూరు, నైజాము మొదలైన రాజప్రముఖులంతా సామాన్య మానవ జీవితాల్లోకొస్తారు. అప్పుడు కర్మాగారాలు, ప్రాజెక్టులు, ఫ్యాక్టరీలు, విద్యాలయాలు బోలెడు నెలకొల్పుకొని దేశాన్ని, ప్రజాజీవితాల్ని సుభిక్షంగా పండించి, విశ్వవిజ్ఞాన మాణిక్యాలతో పండువెన్నెల కాయించవచ్చు. ఆంధ్రమహాయజ్ఞం అందఱికీ అనర్థదాయకం. అంచేత ముఖ్యంగా, మహామహులెవరైనా రాజప్రముఖయాగం ప్రారంభిస్తే విశ్వమహాజనులంతా మద్దతిస్తారు దానికి తోడుగా ప్రజాప్రభుత్వాలవారు కలగజేసుకుంటారు. అప్పుడు ఈ సుఖ-భోగలాలసులైన రాజప్రముఖులంతా మనమాదిరి "ఓటర్లయి" ప్రజలతో కలసి జీవించటానికి కదలివస్తారు.

ఏనాటికీ ముందడుగు వేయలేని ఘోర నిరంకుశ దారుణ శృంఖలాలు తగిలించి మతంనిషా బాగా ఎక్కించిన మూఢ విశ్వాస

హిందూసంఘంలో పుట్టిపెరిగిన జీవాలం మనం. ఆదరాభిమానాల్తో, ఆస్తి పాస్తుల పంపిణీలతో ఒకే కుటుంబంలో పుట్టిపెరిగిన స్త్రీ పురుషాదులకు సమానత్వం లేకుండాచేసి స్త్రీలని సంత పశువుల్లాగా వాడుకొంటున్న హృదయాల్లేని పుక్కు మరలం మనం.

సీత, సావిత్రి దమయంతి మొదలైన సాధ్వీమణులు పతివ్రతామతల్లులని పూజించుకొని, మన పిల్లలకి వాళ్ళపేర్లు పెట్టుకొని యీనాఁడు మన యిళ్ళల్లో మన తల్లులెన్నొంతమందిని కడుహేయంగా తయారుచేసుకొని, వాళ్ళని సీతా అనీ, సావిత్రీ అనీ, పిలుస్తున్న సిగ్గులేనివాళ్ళం మనం. కాలు సేతులకు సంకెళ్ళువేసి, మెడలకి పలుపులు తగిలించి, మోయలేని మోపెడు గుడ్డలుచుట్టి బందిరి దొడ్డిలో తోలిన గొడ్లమాదిరి ఆడవాళ్ళని యింట్లో ఆ జన్మాంతం కఠినఖైదు విధించి హింసిస్తున్న రాక్షసులం మనం.

పుట్టెడు పుణ్యం, కొండంత పతివ్రతా మహాత్యం వచ్చి విఱగపడుతుందని చెప్పి మనం తిని వదలివేసిన యెంగిలి పులిస్తార్లకుల్లో మన స్త్రీలకి కుక్కలకి పడేసినట్లు తిండి పడేయించి పాపిష్టి మొహాల్తో యికిలిస్తున్న వాళ్లం మనం.

ఏ పురాణాల్లో చూచినా, ఏ పవిత్ర చరిత్రల్లో చూచినా నలభీమ పాకాలున్నవి కాని, సీతమ్మపాకం, దువ్వూరి సుబ్బమ్మ పాకం మాత్రం ఎక్కడా కనిపించటంలేదు. అంటే పూర్వం ఆడది వంటింట్లో మసిగుడ్డగా తయారుకాలేదని తేలింది. అదేం ఖర్మమో మర్మమో దానికి విరుద్ధంగ మన ఆడవాళ్లని వంటింటి మసిగుడ్డలుగా, అమాయక వెట్టిజంతువులుగా తయారుచేసుకొన్న మొహాలు మనవి.

నిజంగా స్త్రీ హృదయం మంజుల మనోహరం కాబట్టే దయా దాక్షిణ్యాల్తో అష్టకష్టాలు భరించి, సహించి బిడ్డల్ని ప్రాణప్రదంగా పోషించుకొంటున్నారు. ఆదిదైవస్థానం అలంకరిస్తున్నారు. మగ వాళ్ళకి ఆ దయా దాక్షిణ్యాలు శూన్యం కాబట్టే మగవాళ్ల చేతుల్లో పిల్లలు బ్రతుకలేరు.

మన కిన్ని విద్యావైదుష్యాలు ప్రసాదించిన సరస్వతి స్త్రీ జన్మ యెత్తి యీ హేమా హేమీలందరికీ ఉపాధ్యాయురాలై నప్పటి గ్గూడా మనం గ్రహించలేక మగపోతుల్ని పాఠశాలల్లో వుపాధ్యాయులుగా నియమించుకొని మనకు వారి కఠిన కర్కశ పాషాణ హృదయాల్లోంచి వచ్చిన విద్యలబ్బి మనం ఒకళ్లొకళ్లం కొట్టుకొని, పొడుచుకొని తినే దుర్మద రోగాల్తోపడి యేడ్చి దుర్మరణాల వాత పడుతున్నాం.

ఈ ముప్పులూ, తప్పులూ తప్పించి సంఘాన్ని విశ్వవిజ్ఞాన భాగ్యోదయంమీద నడిపించటానికివచ్చిన హిందూకోడ్‌బిల్లు నంతా బలపరచి అమలుజరపాలని జగజ్జననిని ప్రార్థిద్దాం. ఇహ వచ్చే ప్రభుత్వాలన్నా నేను చెప్పినవన్నీ జగజ్జనని సాక్షిగా జరిపితీరాలని కోరదాం. ఇహ ఎలెక్షన్లన్నీ కొత్తదారిత్రొక్కి ఏపార్టీలు ఎలెక్షన్ల ప్రచారాలు చేయకుండా కఠిన శాసనాలు పెట్టి, పోలింగునాడు ప్రజలు తమకిష్టం వచ్చిన పెద్దతలల్ని తెల్సుకొని యెన్నుకొనేట్టు, నిల్చిన ప్రతినిధులజీవితాల్ని. త్యాగాల్ని, సామర్థ్యాల్ని ప్రభుత్వం వారే సమత్వదృష్టితో రెండు నెలలకి ముందుగా పార్టీలన్నింటితరఫున ప్రచారంసాగించాలి. పోష్టాఫీసువారు, టంకసాల అధికారులు

నాణాలన్నింటిమీద ప్రభుత్వంవారి మోహరు సమానంగావుంచి వాటి వాటి విలువలు ప్రకటిస్తున్నట్లు ఎలెక్షన్లలోకి దిగినవారిగుఱించి ప్రభుత్వంవారే ప్రచారంసాగించాలని కోరుతున్నా. దాంతో పార్టీకక్షలు లేవవు. దానికోసమే జగజ్జననిని ప్రార్థిస్తున్నాం.

పార్టీవ్యామోహాలు ప్రజలిక్కి, పదవీవ్యామోహాలు నాయకులకి బలిసిపోయి పచ్చికసాయి మార్కెట్టుగా మారిపోయిన యీ ప్రపంచంలో మహాకవుల్ని, మహామహా విద్వాంసుల్ని యెవరు చూస్తారు? చూడకుండాపోవడం మూలానే యీ మహాకవులు, యీ మహావిద్వాంసులూ ప్రతి గుమ్మాలముందు తామెత్తులుకట్టే దాసరోళ్ళమాదిరి, బాకాలుపట్టే కొమ్ముల్నోళ్ళమాదిరి వ్రేలాడాల్సి వస్తున్నది. ఇట్లా విశ్వవిజ్ఞాన చైతన్యమూర్తులు తయారవుతున్నప్పుడు ప్రపంచసౌందర్య చైతన్యం మంటకలసిపోక యేమౌతుంది? అంచేతనే ప్రతి మహానుభావుడు కవుల్లో, విద్వాంసుల్లో తమకేమాత్రం నిమిత్తం లేనట్లు చిన్న చూపుచూస్తున్నాడు.

ఏమయ్యా వేదాంతకవిగారు! మీ గురువుగారైన తిరుపతి వేంకటశాస్త్రిగారు వెనక మీసాలు వదేసి కవిత్వాలు చెప్పి ప్రభుత్వాలెట్లా వెలిగించారో మఱచిపోయినట్లున్నారు. భలే పద్యం చెప్పారు. ఇది వారిదే సుమాండి.

దోసమటం చెఱింగియును దుందుడుకొప్పగఁ బెంచినార మీ
మీసము రెండు భాసలకు మేమె కవీంద్రుల మంచుఁ దెల్పగా
రోసము కల్గినన్ కవివరుల్ మము గెల్వుఁడు గెల్తురేని యీ
మీసముఁదీసి మీ పద సమీపములం దల లుంచి మ్రొక్కమే.

మీ కాకిరోసాలుంటే మీ గురువుగారి మాదిరి మీసాలు పెంచి కాల్చుద్రవ్వి కాలక్షేపాలు చేసేవారు ఆ తడాఖా లేక మీరు మీసాలు గొరిగించుకొని తిరుగుతుంటే, మావంటి వాళ్ళంతా మీరు మొగవాడు కవులని యెట్లా తెల్సుకొంటామని యెగతాళి చేయటానికి సిద్ధపడ్డ మహానుభావులముందు పడ్డాం అయితే మా గురువుగారి కీర్తి ప్రతిష్టల్ని నిలపెట్టాలిగాని, మేము పనికి మాలిన బొచ్చు పెంచి మీసాలు మెలిపెట్టాల్సిన వెఱ్ఱివెంగలప్పలం కాదని చెబుతున్నాం. ఇది చింబోతుమీసాల యుగం కాదు. ఇది ఆటంబాంబుల యుగమని తెల్సుకోండి.

మీపయి లేచు మీసములు మీకిల లేని కతాన మీరు న
ల్వైపుల గొప్పగా దిరుగవచ్చుఁ గదా మఱి మీరు మీసముల్
చూపెడి రోష పౌరుష వచోవిభవంబును సైపకుండ మీ
ధీపటిమాన మీసములఁదీసి కవీంద్ర! యశస్సు బెంచుడీ.

ఇది పైవానికి సవాలుచేసి చెప్పిన మా జవాబు. సుప్రసిద్ధమైన, ప్రపంచ మహాజనజీవ చైతన్యమైన కవితల్లజులు సైడ్ కాల్వల్లో పడి క్రిమికీటకాలల్లే జీవించటానికి తయారుకాఁగూడదు. విశ్వవిజ్ఞాన చైతన్యమూర్తులైన కవి పుంగవులు, మహావిద్వాంసులు మహాజీవనదీ ప్రవాహాల్లో పడి మీన మాణిక్యాలల్లే పవిత్ర జీవనంచేయుటానికి జగజ్జననిని ప్రార్థిస్తున్నాం.

కవితా సంస్థానం
విజయవాడ
27—11—51

"ఆంధ్ర బెర్నార్డ్‌షా"
వేదాంతకవి

# కృపాభిషేకం

దండాడించెడి కైౘతలు కొండాడి వరాల శిల్ప కోవిదమణులన్
ముందూరు వీరబ్రహ్మను పండించెను తెన్గుతల్లి వజ్రంబులలో.

శ్రీరాగోదయ భాగ్య వైభవకళా సింహాసనాసీనుఁడై
భారీయెత్తున బ్రహ్మదేవుఁడెపుడో బ్రహ్మాండముల్ నిల్పి మా
వీరబ్రహ్మ సహస్రశిల్ప ఘటనా విజ్ఞాన మాణిక్య శృం
గారంబుల్ నవరత్నహారములుగా గ్రాలించి గీలించెరా.

విశ్వబ్రహ్మ కళావిలాసములు పృథ్వీమండలాఖండ లా
ర్యాశ్వాసమ్ములు నిండి నిగ్గులయి శౌర్యశ్రీప్రభాతమ్ములై
విశ్వప్రేమ మనోహరమ్ములు మహావిజ్ఞాన సౌందర్యముల్
విశ్వంబేలఁగ వీరబ్రహ్మకర కేళీ కౌశలం బౌలెక్కరా.

తట్టిన మేలిభావము సుతారముగా చుఱుకైన చూపుతో
చిట్టి వరాలపూల నగిషీకులుకుం దొణకించి యే జగా
జెట్టులకైన స్వర్ణమణి శృంఖలముల్ తగిలించి శిల్ప సా
మ్రాట్టనిపించుకొన్న లసమాన సమర్థుఁడు వీరబ్రహ్మమే.

శిల్పకళాపురంధ్రి విలసిల్లెడి భాగ్యము రాశిఁబోసి, ము
వ్వేల్పులు సేతులెత్తి జయభేరిని గొట్టెడి విశ్వభారతీ
కల్ప మహీరుహప్రసవకాంతులతో మణిహారమల్లి మా
స్వల్పము వీరబ్రహ్మ యులి చక్కిలి గింతను గుల్కఁజేసెగా.

తన వియ్యంకుఁడు బాలబ్రహ్మ కవిశాస్థానకుమారాజాని చ
క్కని కావ్యేందిర పూలకౌగిటను సౌఖ్యశ్రీలనిం దేలినాఁ
డని విన్నంతనె వీరబ్రహ్మ బహు వీరాగ్రేసరుండై జగ
జ్జననీ దివ్యకృపాభిషేకము వంశశ్రీకి సల్పించెగా.

ఇమ్మహానీయుఁ డింత గడియించిన కీర్తి మనోజ్ఞరేఖ చం
ద్రమ్మ పసిండిపంట; నవరత్న సువర్ణ వినూత్న పుష్పహా
రమ్మున మేలిసూత్రముగ రాజిలి చంద్రము వీరబ్రహ్మము భా
గ్యమ్ముగ బిడ్డలైనుగురిఁ గాంచెను నోచిననోము తోటలో.

నాణ్యములైన శిల్ప ఘటనా చతురత్వములెల్ల నైమిశా
రణ్యము దిక్కుఁబట్టెటుకి నిరంకుశ పాలనలోన మా సుబ్ర
హ్మణ్యము వీరబ్రహ్మమున కగ్రతనూభవుఁడౌచు శిల్పనై
పుణ్యములెల్ల నిల్పె కవిపుంగవు లందఱు గొల్చునట్లుగా.

హాయిగ భోగియై సుకవులందఱు మెచ్చెడిమాడ్కి సత్యనా
రాయణ త్యాగియై ఘనతరమ్ముగఁ బెర్గుచు వీరబ్రహ్మ ల
క్ష్మియుగ వైభవోన్నత విశేష యశోధనవాఃశి కింక దీ
ర్ఘాయువులం ద్వితీయ సుతుఁడై కులికించెను నద్వితీయుఁడై.

మూడవవాఁడు ముఖ్యుఁడు సుబోధిని సఖ్యుఁడు బాలబ్రహ్మ ము
ద్దాడెకి ముద్దుటల్లుఁడు మహాసుకుమార సునామధేయుఁడై
మేడలు వీరబ్రహ్మ సుతిమెత్తని కీర్తికి కట్టుచున్న మ
న్నిడయి నూరువేలను గణించి గడించును రామబ్రహ్మమై.

ఇతఁడే యాంధ్ర కథాసుధార్ణవ కళా హేలావిలాసైక స
న్నుత సమ్మోహనమూర్తి శిష్యుఁడయి కన్నుల్ పండువై మున్ను సం
తత మాహ్లాదముఁ గొల్పి మా హారికథాధౌరేయుఁడౌ బాలబ్ర
హ్మతనూజం సువివాహమాడి యనసూయాదేవిఁ బాలించెరా.

ఈ యనసూయ కాపురము హేమముతోఁ గలికించి కీర్తి దీ
ర్ఘాయువు పుట్టినింటికి మహాసుగుణమ్మున మెట్టినింటికిన్
బోయుచు రామబ్రహ్మ తలపుల్ వలపుల్ పుష్కండఁజేసి బల్
హాయిగ వెల్గె మా హారికథార్ణవ చంద్రుడు పొంగులెత్తగా.

రాకారామముగా మనోజ్ఞమయి వీరబ్రహ్మవంశంబు ల
క్ష్మీకాంతా సుకుమారికామణిని గాంచెం నోముపండించి దే
వీ కారుణ్య కళావిలాస వర సావిత్రీ మహాసాధ్విని
శ్రీకల్యాణిగఁ గాంచె; చంద్రము తపశ్శ్రీ రమ్యాహర్మ్యంబులో.

శ్రీ కనకదుర్గ కృపతో లోకైకశ్రీ జయంబులు యశంబులు స్వా
మీ! కైకొనుఁ డాయుర్ధన సౌకర్యంబులు చెలంగి చక్ర-గబ్రహ్మ.

"ఆంధ్ర బెర్నార్డ్‌షా"
వేదాంతకవి
విజయవాడ, 29-11-51

# జ గ జ్జ న ని

శ్రీ సుమనః ప్రఫుల్ల సుమశీర్ష సుధాంశుమణీ, మయూఖినీ !
కోసలరాజపుత్ర నవకోమలగాత్రి సువర్ణరత్న సిం
హాసిని! మా జగజ్జనని! హాయిగ స్థాయిగ నీవు మా కళా
వ్యాసధునీ కృపారసవిహారిణివై మము మేలుకొల్పుమీ.

సురుచిరవేణి! సత్కవి వచోరస వాహిని! శైలరాణ్మనో
హార, నవరత్నసౌధ శిఖరాగ్ర సమగ్ర శుభప్రదాయినీ !
స్మరహరమానసాబ్జ మధుసద్మ సుఖాసిని! నీదు పాదకిం
కరులము మా జగజ్జనని! కత్తుల బోనులనుండి విడ్వుమీ.

త్రిభువనసౌఖ్య మంగళకరీ! శతకోటి తరంగధాటి దో
ర్విభవ కథాసుధారసఝురీ! కమనీయ మయూరిణీ! కళా
శుభకరి! మా జగజ్జనని! చుక్కల తోటనుబెంచి విశ్వ వ
ల్లభుడు త్వదీయకీర్తి ధనలక్ష్మిని గుల్కఁగజేసె నేలుమీ.

అంబ! కృపాంబుజేక్షణ కళామృత దివ్యధునీకదంబ! భా
వాంబురుహోద్భవాది దివిజాళిసేవిత రత్నరేఖ పా
దాంబుజ! మా జగజ్జనని! అన్యులటన్న విభిన్నదృష్టి నీ
రుం బొడగట్టియున్న బ్రతుకుల్ తెలవారును మాకు బ్రోచుమీ.

తోయజ కౌముదీ కనకదుర్గ! పయోధిపరీత ధారుణీ
న్యాయ విశారదైక నయనాంబుజనర్గ! సహస్రకోటి వా
క్ఛాయకు మా జగజ్జనని! స్వర్ణమయూఖ విశాఖవ్రజ దీ
ర్ఘాయువుపోసి నమ్మవుగదా! కొదవేమిటి నీకు నేలుమీ.

హైమవతీ! కృపారస మహావిభవైక మనోజ్ఞ సత్కళా
రామసతీ! సమస్త కవిరాడ్గజరాడ్విభ విశ్వభారతీ!
ఏమని మా జగజ్జనని! యీ కొఱమాలిన వెఱ్ఱి నోటితో
నీ మహిమంబు లేను రమణీయముగా కొనియాడనేర్తునే.

గేయ కళాప్రఫుల్ల శుభకీర్తి వసంత దిగంతమూర్తి కా
త్యాయని! నవ్య దివ్య కవితామృత మంజుల భాగ్యవాహినీ!
రోయక మా జగజ్జనని! రోజు తరాజు రివాజు లెన్నియో
నా యనురాగ భక్తి కిరణా లెగబోసెను చూడరాదటే.

మంజుల భావభాగ్య సుకుమార మరాళ మయూర నాట్యగీ
తాంజలి! విశ్వకావ్య మహిమాన్విత కార్య కళా పతంజలీ!
పుంజులు మా జగజ్జనని! పుట్టెడు పౌరుష ముట్టిపడ్డవై
గుంజలు పెళ్ళగించియును గూడలు వంగి నమస్కరించవే.

శాంభవి! సర్వసౌఖ్య శుభశాంకరి! సజ్జన రమ్యహర్మ్య సం
రంభ సభాతలోదరి! పరాక్రమసింహ కళాకృశోదరీ!
సంభవమా జగజ్జనని! జ్ఞాన పటుత్వము లీ యుగంబులో
డింభకుఁ డైనవానికి కడింది బెడంద యొడంద బాపవే.

దేవి! మహాతపోవన సుధీజన పావన భాగ్యరాశి సం
జీవి! దయాసముద్ర ఘన శృంగ తరంగ మృదంగ జాహ్నవీ!
కావుము మా జగజ్జనని! గ్రాలుము నా వసుధైక రాజ్యల
క్ష్మీ విభవమ్ముల్తో కొలుతు కేలుమొగిడ్చి నిగిడ్చి కన్గవల్.

శుభకరి! మాధురీ త్రిపురసుందరి! గంధమదేభ శత్రుదో
ర్విభవ పరాభవాగ్ని పదవీ పరివేష్టిత శౌర్యమంజరీ!
ప్రభలను మా జగజ్జనని! ప్రాణము తానము నీవు కాని యీ
ప్రభువులు కారు; నా యెడఁద రాపిడి చూచి యనుగ్రహింపవే.

ఈశ్వరి! వామదేవ హృదయేశ్వరి! పౌరుషలోక రాజరా
జేశ్వరి! నవ్య దివ్య భువనేశ్వరి! మంజుల కావ్యభాగ్య కా
మేశ్వరి! మా జగజ్జనని! యెంత రచించి నుతించినన్ బుధుల్
శాశ్వత భక్తి గోరితి నజస్ర సహస్ర భవత్కథారుచుల్.

అక్షర రూపిణీ! శుభ సుధాంబుధి కావ్య కథాతరంగిణీ!
దక్షధరాపురందర విధాన వధాన భయానక ప్రజా
యక్షిణి! మా జగజ్జనని! యద్భుతమైన త్వదీయ శౌర్య హా
ర్యక్షము ముందెవండు విజయ ధ్వజ మెత్తగలండు బ్రోచుమీ.

పార్వతి! శైలరాజ ఘనవంశ సురద్రుమ పుష్పభారతీ!
గర్వతమోగుణైక ధనగంధ గజేంద్ర జితేంద్ర హారతీ!
సర్వము మా జగజ్జనని! చక్కని చల్లని నీ మహత్కృపా
నిర్వహాణముతో జరుగనేర్చు నటంచు గ్రహించు బిడ్డనే.

కోమల వాగ్విలాస మణి కుడ్య నికేతన సర్వమంగళా !
సామజ భాగ్యవైభవ రసాతల మంజుల మాధురీకళా !
ప్రేమను మా జగజ్జనని ! బిడ్డల కష్టము సైచవంచు మా
రాములువెట్టు కుఱ్ఱము; చిరాకు పరాకు మరేమి లేపకే.

ఘన గిరిజా ! ప్రసన్న గుణకల్ప మహీరుహకోటి వారిజా !
మునిజన పూర్ణయోగబలమూల కుశాగ్రవివేక నీడజా !
అనయము మా జగజ్జనని ! యంతయు హూనము హూనమైన మ
న్మనము త్వదీయ దివ్య చరణమ్ములు పట్టెను శ్రావ్యకావ్యమై.

గౌరి! కథాప్రసన్న శుభకార్య మనోజ్ఞ కళా విభావరీ!
శూరకులైకమండన యశోధన వర్ధన వాఙ్మనోహరీ!
మేరువు, మా జగజ్జనని! మ్రింగెడి నోరు వరించలేదె, బం
గారము పండి రత్న సహకారము చేసెడి మట్టి నియ్యవే.

హూణ కళాప్రపంచ సుముహూర్త సముజ్జ్వల హావభావ శ
ర్వాణి! మృణాల కోమల మరాళ సరోవర కావ్య గామినీ!
ప్రాణము, మా జగజ్జనని భావ్యముగా భవదీయ భాగ్య ని
ర్మాణముఁ గోరుచున్నది; సరాసరి వచ్చి యనుగ్రహింపవే.

కావ్యభవాని! విశ్వజనకౌతుక జాతక భాగ్యపావనీ
దివ్య కళాతపోధన సుధీజన మండన చంద్రికావనీ!
ద్రవ్యము మా జగజ్జనని తావక మంజుల పాదపద్మ సం
సేవ్య మటంచు గొల్చితిని జీత మెఱుంగని జీవితమ్ముతోన్.

సులలిత విశ్వగాన శుభసుందర మందిర రత్నవల్లికా!
విలసిత వజ్ర పుష్ప పరివేష్టిత శోభిత శబ్ద మల్లికా!
కలుములు మా జగజ్జనని గంపలు గాదెలు నింపినం; భవ
న్నిలయములోని బిడ్డలము నీకయి యేడ్వక యెట్లు లుందుమే ?

శక్తి ! సమస్తలోక బల శౌర్య సముజ్జ్వల కార్య జీవనా
రోక్తి ! మహాజనార్ణవ మహోదయ మంజుల భావరక్తి త్వ
ద్భక్తులు మా జగజ్జనని తామర తంపరలై త్వదీయ స
న్మౌక్తిక తాంహారమణిమండనులై కయికొన్నదివ్వవే.

మంగళవాద్య భాగ్య రసమార్గ నికేతన విశ్వచండికా !
భంగిమ సౌఖ్యసంయుత సుభాషిత శోభిత భారతాంబికా !
దొంగలు మా జగజ్జనని దూకులు దూకెడి కాళరాత్రి గ
న్నుంగవ గప్పకుండుము ననుం గనిపెట్టుముచంటి బిడ్డనే.

తాళ తరంగమాళి ! కవితా వనితాంగుళి ! వ్యాఘ్రీ మహా
కాళి ! విహంగరాడ్వినుత కాంచనపుష్ప నివాళి ! నీ కళా
గోళము మా జగజ్జనని ! కుట్మలమై మకరందమొలిక గం
గాళముగా తయారయిన నన్ను వినాయకుండంచు నెంచవే.

చిత్ర కళాప్రపంచ యమచిత్ర పరిభ్రమ వీరశౌర్య సా
విత్రి ! త్రిలోక పావన నివేదన దివ్య కథాసవిత్రి ! యీ
పాత్రలు మా జగజ్జనని త్వచ్ఛుభ సుందర గానమాధురీ
గాత్రములోని రాగరసకావ్యములౌచు మనోజ్ఞమైనవే.

శ్రీ జగదంబ! మంజుల శిరీష కళా కవితాకదంబ! వి
భ్రాజిత పద్మసంభవ సభాజన సేవితడంబ! విశ్వ భ
ట్రాజులు మా జగజ్జనని! ప్రక్కను రక్కసి రాజ్య కాంక్షచే
పూజలు సల్పునట్లు తలపుల్ వలపుల్ పెనవేయనీయకే.

శైలసుతా! ప్రఫుల్లసుమసౌఖ్య పరిమళ భావసన్నుతా!
బాలరసాలవృక్ష మృదుపల్లవ భాగ్య పికస్వరామృతా!
యేలుము మా జగజ్జనని! యీ కవితా ఘనచాతురీ భుజా
స్ఫాలన దిక్కుదిక్కులకు శౌర్యములై మొగఁదన్నునట్లుగా.

సుమ సుకుమార వర్ణ! నవచూత విశాల కళాప్రపూర్ణ! గీ
త మధుకథాన్నపూర్ణ! కవితా వనితా చతురోక్తి వర్ణ! కా
వుము మము మా జగజ్జనని! పువ్వుల తోలకరి కుల్కునట్లు, వి
శ్వముపయి మేము నీ కడుపుపంట గదమ్మ ముదావహమ్ముగా.

నందన భాగ్య వైభవ ఘన ప్రతిభా కవితా విపంచికా
సుందరి! విశ్వమోహన యశోధన మండన వాఙ్మహేశ్వరీ!
అందరు మా జగజ్జనని! హాయిగ నీ నయనాల చల్వతో
చందురులైరి సస్యఫలసంపద లిచ్చెడి చంద్రమౌళికై.

జయ జయ సద్యశోభువనచందన కుందన భాగ్యవల్లి! సం
శయరహితాత్మ సౌఖ్య సువిశాల కళా కవితామతల్లి! ని
ర్భయముగ మా జగజ్జనని! పైబ్రతుకుల్ తెలవాఱనిచ్చి, లేఁ
త మొదఁదలో మరే బెడఁద త్రవ్వక నీ కడగొట్టు బిడ్డనే.

# శ్రీ దు ర్గా మ ల్లే శ్వ ర స్వా మి కి

## మా కృతి కృతజ్ఞతాంజలి

శ్రీ మాణిక్య గిరీంద్ర సౌధ నవరాజీవ ప్రభానీక దు
ర్గా మల్లేశ్వర! విశ్వమానవ మహాకాలుష్య ప్రక్షాళిత
ప్రేమాశీః ప్రణవైక నిర్ఝరధరా! వేయేండ్లు గొంతెత్తి నీ
నామంబుల్ రతనాల తోల్కరిగ గాంచంజేసె మాకోటయే !

2

స్వామీ! స్నిగ్ధ శిరీషముగ్ధఘన పుచ్ఛావంశ దుగ్ధాబ్ధి దు
ర్గా మల్లేశ్వర కోటిలింగ నవశృంగార ప్రజాస్వామి! మా
సీమన్ తావక దివ్యభవ్య కరుణాశీర్వాద సమ్మోద పు
ష్పామోదమ్ములఁ జిమ్ము చంద్రికకు కోటయ్యే మెఱుంగయ్యెగా!

3

వేసిన తోటలో పరిఢవిల్లెడి చిన్ని రసాలతర్వుపై
నీ సిరులెల్లఁ గ్రొంబసిఁడి నిగ్గులుగా విలసిల్లువేళ, క
న్వేసితి, గాలిదుమ్ము వినువీధికి లేపితి, కోయిలెంతరో
జేసిన గోలయుంజెవిని చేర్పకపోతి వుమామహేశ్వరా!...

4

ప్రమధపతీ! త్రినేత్రసతి! త్వత్కృపనోములతోట కుట్మలిం
చి, మును ఫలించినట్టి తన చిట్టివరాల ఫలమ్ముపేరు వే
యి మడుఁగులింక పైడితలకెత్తెడి కోటయకొండయెక్కి ధ
ర్మము నడిపించె: మీకు హనుమాయుమ మేలిమి పూజగిట్టదా?

5

మా హనుమాయమ, మానవ
మోహన ధరణీ కుమారభూపతి యున్నన్
శ్రీ హిమగిరి జామాతా!
ఈ హంపీక్షేత్ర మెంత యేత్రైపోనో!

6

మా దుర్గాజనయిత్రి, విశ్వకవితా మాణిక్య వీణేందిరా
నాదోపాసనతో, సువర్ణ సుమ గంధ శ్రీ సుధావృష్టితో
నీ దాంపత్య లతానికుంజ రమణీ నిత్యోత్సవ శ్రీల నెం
తో దివ్యమ్ముగ వెల్గఁజేయుటలు మాన్యుల్గాంచరా ధూర్జటీ!

7

నిత్యము మీ యమూల్య కమనీయ పవిత్ర సుఖైక దివ్య దాం
పత్యమహాత్మ్యముల్ పతితపావన మైనవటంచు వేద సా
హిత్య మహీరుహ ప్రసవ హేమ పరిమళముల్ గ్రహించి సం
స్తుత్యపు భక్తురాలయిన దుర్గనుజూచి సహించరా శివా!

8

ఏ లోపంబెటు లేనివారలని మిమ్మేనమ్మి కొల్పించగా
నీ లోగిళ్ళకు నీ కథా శ్రవణముల్ నిత్యమ్ము సాగించు బ్రా
హ్మీ శేఖర్షభ సార్వభౌములకు కల్మిం రాశిగాఁబోసి మీ
కాలక్షేపమొనర్పు దుర్గకిట దుర్గాస్వామి! దుర్యోగమా!

9

ఈ సుగుణ ప్రసూన లత కింపెసలారెడి వజ్రసౌధ సిం
హాసన మూర్తియై, గణన కాతని కాతఁడె సాటియైన ధా
త్రీసుర చక్రవర్తియయి తెల్గుల వెల్గులలోన నందెయున్
వేసిన చక్కనయ్యయయి విశ్రుత కీర్తికి నెక్కె కోటయే...

10

తడియారని కనుగవతో
గుడిపావురమైన దుర్గ గుండియలోనన్
పిడుగై పడి మా కోటయ
యిడె నభిషేకమ్ము నీకు నెల్లప్డు శివా !

11

ఈ విధమైన ఘోరముల కీవపకారములెన్నియో మహా
దేవ ! ఘటించి నీయశము దిబ్బను బెట్టుటఁజేసి నీ యుమా
దేవి విచారముంగని గదే యిటు దుర్గ త్వదీయ దుర్యశం
బీ విధిఁబాప మా శరభయే సహకార మొసర్చె సత్కృతిన్ ...

12

తన ఇలువేల్పు దుర్గయయి తజ్జనయిత్రి మనంబు నిర్మలం
బున విలసిల్ల జేయుట కపూర్వముగా శరభయ్య సాయ మి
ట్లనయము దుర్గ కై కొనుచు నచ్చెరువైన మదీయ కావ్య మి
ద్దినమున నీకు నిచ్చుటకుఁ దెచ్చెను కోటయవీర ఈశ్వరా !

13

నరనారాయణులైనవారి శుభసాంగత్యంబులో లోపము
చ్చెరువై యుండిన నుండవచ్చు; త్రిజగచ్ఛ్రేయోభి లాషుల్ వలెం
హరనాథా ! మఱిమాదు వీర శరభయ్యాఖ్యుండు, కోటయ నా
మరవీంద్రుం డొనరించినట్టి చెలిమిం మచ్చేమి లేదెచ్చటన్

14

శరభయ్యాఖ్యుఁడు శౌర్యధుర్యుఁడయిభీష్మశ్రీ ప్రతిజ్ఞాధురం
ధరుఁడై యీ పది దిక్కులందెవని మేధాపుష్టియైనం సరే
కరగింపంగల శేముషీ మకుట భాగ్యప్రౌఢ వాచాపురం
దరుఁడై పెట్టనికోటగా నిలిచెఁగాదా నీకు దుర్గేశ్వరా!

15

ఆ ధనశాలి సేవకు దయారస మొలకనీ వాఁడవైతి గం
గాధర! నీళ్ళ బ్రాహ్మణునిగా నిను బిల్చిన తప్పదేమి? గం
గాధర! నీ దయారసము గడ్డయి నీ బిరుదమ్మదే వృథా
గాథల పాలు సేయని యుగమ్మిఁక మా శరభయ్య నిల్పెడిన్—

16

తనయగచాట్లకోసమయి తావక సేవకు నడ్మఁగట్టలే
దనయము మాదు వీర శరభయ్య త్వదీయ మహా యశోధనం
బును ఘనమైన నీ బిరుదముం నిలఁబెట్టుటకై సమస్త శ
క్తిని యిల ధారఁబోసెడి విధేయుఁడు నీకు సుధాంశుశేఖరా!

17

కోటయలేని లోటు తనకుం మఱి యెవ్వరుఁ దీర్చలేరుగా
నీ, టకటాంకు కాలమున నీచుల నుక్కడగింపనెంచి క
న్నీటిని నాను దుర్గకయి నేఁడు కుమారగ సునామధేయునిఁ
కోటకు దత్తుఁ దెచ్చె తన కోటయకుం శరభయ్య మిత్రుడై...

18

నీ వేనాడపకీర్తి పాలసలు తండ్రీ! యింక గాకుండగా
దేవీ భాగవతంబు గొప్ప కవిచే దిక్కెక్కగాఁజేసి, నేఁ
డీ వేదాంతకవీంద్రు కావ్యమును నీ కిప్పించి, గుప్పించె నీ
శా! విన్నాణపు కట్నకానుకలు మెచ్చం విశ్వవిద్వజ్జనుల్...

19

ఘన దుర్గామల్లేశ్వర!
నిను గొల్చెడి దుర్గతల్లిని, కుమారస్వా
మిని, వీరశరభయను, భూ
జనమును, వేదాంతకవిని చల్లగఁగనుమీ

# మా ఇలువేల్పు

స్ఫటికచ్ఛాయ విభూతి ధారణభవా! శంభోమహాదేవ! త్వ
న్నటనాకౌశల భావభాగ్యఘటనా నైపుణ్య లావణ్య మి
చ్చట గంగాతటిని తటాంచల కళాసాధ్వీతరంగమ్ములో
స్ఫుటమై నవ్యనటీనట ప్రణవమై పోషింపగా జేయుమీ...

2

శుభగీతిం నటరాజువై నవసుధాంశుజ్యోత్స్నలో కోటి భూ
నభముల్ పూచెడి సర్వమంగళకళా నందోత్సవ శ్రీ జగ
త్సభ నట్టింతల నూపుచున్న ప్రభువై శంభోమహాదేవ! త్వ
త్ప్రభ నగ్గించు నటీనట ప్రణవ సంధ్యాకేళి నెగ్గించుమీ...

3

మహిపై కొండల చక్రవర్తి విలసన్మాశిక్య గాణిక్య సం
గ్రహ కోటీర మయూఖ సౌధ శిఖరాగ్రంబందు చిన్నారి త్వ
త్సహాకారంబున గండుకోయిలవలెం శంభోమహాదేవ! వా
గ్లహరీ ఘోష ముహుర్ముహుర్మధు తరంగాల్జేసె పాలించుమీ...

4

స్తవనీయ స్థిరశౌర్య వజ్ర కవచస్త్రైలోక్య మృత్యుంజయా!
భవదీయ ప్రభకింకొకండెదురు నిల్వం లేడటంచేము వా
స్తవమార్గమ్మున మాసమస్తమిడుచుం శంభోమహాదేవ! నీ
కవనిం చక్కని పాదరక్షలముగానైపోతి మోదార్చుమీ...

5

ఈ బ్రహ్మాండము రంగభూమియయి నీకెన్నోయుగాల్నుండి పె
ల్లుబ్బంబైన త్వదీయ నాట్య ఘనవిన్యాసైక సౌందర్య హ
ర్షశ్రీ బ్రాహ్మణ్య మృదంగ గర్జిత తరంగాదుల్ మహాదేవ శం
భో! బ్రహ్మాండముగా నదీ నదములై పొంగెం కటాక్షించుమీ...

6

నీ లావణ్యము, నీ కృపారసధుని నిర్ణిద్ర కల్లోలినీ
డోలాందోళిత పారవశ్యము కళాఢ్యుల్ ధీవిరాట్టుల్ మఱే
లీలం వర్ణనసేయలే రనని గాలించం మహాదేవ శం
భో! లభ్యమ్మెటుగారు నీపగిది స్వాముల్ మాకు; కాపాడుమీ...

7

వీరోత్సాహము లేటులై దుమికి పృథ్వీమండలంబెల్ల త్వ
ద్ధీరోదాత్తతఁజాట తక్ ఝణుత ధింధింతో మటంచెంతయో
వైరుల్ జంకెడి యశ్వధాటిమెఱుగుల్ పర్గుల్ మహాదేవ శం
భో! రోషమ్ముగఁలేచెఁగాని మఱి మా మ్రొక్కుల్ కటాక్షించుమీ...

8

దేవాంశ ప్రముఖైక రత్న విలసద్దేదీప్య శుభ్రాంశు వి
ద్యా వారాన్నిధివంశ నిర్ఝరధరా! త్రైలోక్య వైశ్వానరా!
మా వైదూర్యములెల్ల తావక కళా మౌళిం మహాదేవశం
భో! వర్ధిల్లెడి చల్వ చిల్కుము కృపా మూర్ధాభిషేకమ్ముతో...

9

ఓ వ్యాఘ్రాంబరధారి! యో యురగ హారోత్సాహ పాకారి! నీ
యవ్యాజ ప్రియబంధు సింధు హృదయాహ్లాదమ్ముతోఁబాటు త
ద్దివ్యాలంకృతి కెంత వెల్తిపడితో! దిక్కుల్ మహాదేవశం
భో! వ్యాఖ్యానమొనర్పనేరక యిడెం మ్రొక్కుల్ కటాక్షించుమీ...

10

ప్రాలేయాచల గాంగసైకత కళావైడూర్య మాణిక్య వీ
ణా లాలిత్య తుషారహార వనితానంద స్వరూపా! కృపా
వ్యాలోలాత్మ సుధానులాప! భవదీయశ్రీ మహాదేవశం
భో! లోకమ్ముల కన్నపూర్ణయయి లేముల్ బాపు పోషించుమీ...

11

ఎపుడీ వ్యోమపథాన [illegible] స్వామీ! పైనమైనారలో
యిప్పుడీ నల్లని వ్యోమకేశములలో నిమ్మాడికంగాంచికిం త
చ్చపలాత్ముల్ త్వచ్ఛివతాండవమ్మున గదా శంభోమహాదేవ! మ
ల్లెపువుల్, జాజిపువుల్ వలెం బ్రణయకేళిం గులికరోదార్చుమీ...

12

శుభసౌందర్య రసాభిషేకరమణీ సుశ్లోక మాధుర్య సౌ
రభ సామ్రాజ్య మహేశ్వరా! కవన శౌర్యక్షోణి ధారాధరా!
స్వభువుల్ త్వచ్ఛివ తాండవ ప్రథలతో శంభోమహాదేవ! దో
ర్విభవంబుల్ గలవారలైరిగద సంప్రీతిం గటాక్షించుమీ...

13

ఆర్యామోద కథాప్రసూన కవితావ్యామోహ లోకైక సౌం
దర్యోపాసక! విశ్వగాన మహతీ నాద ప్రశంసాగ మా
చార్యోద్ధారక! అజ్జువంచితిమయా శంభోమహాదేవ! మా
శౌర్యోద్రేకము బిజ్జు దప్పినదయా సంగతుకీవేనయా...

14

రసగంగాధర! ధారుణీ నవరస ప్రాక్పశ్చిమాశాంకురా!
పసిమిం మీనకిశోరపంక్తి మిసిమిం బ్రహ్మాండ సామ్రాజ్య రా
జసముల్ పొంగులు పొంగుచుం వఱదలై శంభోమహాదేవ! తా
మసలోకమ్మున ముంచివైచినవి త్వన్మౌళిప్రభం దేల్చుమీ...

15

నాదబ్రహ్మనిరూపణా! త్రిభువ నానందోదయ శ్రీఘనా!
ఏ దిక్కుండని వేద వేద విదులై ఋష్యాదులెల్లం త్వదీ
యాదేశాలకు త్వద్వియజ్జలధి మత్స్యాలై మహాదేవశం
భో! దేశాలకు జీవనాలయిరి; తన్ముక్తిం ప్రసాదించుమీ...

16

చతురాస్య ప్రమథాది మౌనిజన త్రింశత్కోటి కోటీర ది
వ్య తురాషాడ్విభవైక సేవితపదా! బ్రహ్మాండ ముక్తిప్రదా!
చతురత్వంబులకెల్ల త్వత్కృపఁ గదా శంభోమహాదేవ! శౌ
ర్య తరంగమ్మయి దిక్కుమ్రొక్కయిన దయ్యా మా మొరల్ పట్టుమీ

17

ఊహాతీత కథావలంబన సుధాజ్యోత్స్నా కళారూఢ! హా
హాహూహూ నగరీ విలాసలహరీ హార్మ్యేంద్ర దేవేంద్ర స
న్నాహోత్సాహ నిరూఢ కోమలమృడా! నాదుల్ మహాదేవశం
భో! హెచ్చైన హడావుడుల్ సలిపె; సద్బుద్ధుల్ ప్రసాదించుమీ...

18

నటరాజా! గిరి కన్యకా ప్రణయ గాన శ్రీ బిడౌజా! కళా
నటివై నీ హిమబిందుసుందరి మహానంద ప్రఫుల్లాంశులి
చ్చుట బృందావనమెల్ల దింపినటులం శంభోమహాదేవ! మా
వటవృక్షాగ్ర శకుంతకోటికిక నీ పాటల్ కటాక్షించుమీ...

19

రుద్రాక్షప్రియలోక నాయక! భువర్లోకాపదోద్ధారకా!
ముద్రల్వడ్డ త్వదీయ దివ్య చరణమ్ముల్ మాదు హృత్సీమపై
నిద్రల్వట్టని మేలి యక్షరములై నీకుం మహాదేవ శం
భో! ద్రాక్షాఫల గుచ్ఛగుచ్ఛములుఁ గాపుల్వట్టె కాపాడుమీ...

20

త్రిపురారీ! యరిలోక భీకర మహా తీవ్రప్రతాపాగ్ని గో
ళ పరీతావ లలాటవహ్ని లయకాల జ్వాల నిర్వైరి! మా
చపలత్వంబు సదా చెలామణీదియై శంభోమహాదేవ! నీ
విపులంబైన ప్రచండ రౌద్రరస మూర్విం లేవనల్లేలుమీ...

21

నవోత్సాహ కురంగపాణి! గిరికన్యా హస్తవిన్యాస కే
ళీ వ్యామోహ కళామృణాళ మృదు నాళీకతుమాజాని! మా
శ్రావ్యంబైన వినూత్న కావ్య సరసిం శంభోమహాదేవ! త్వ
ద్భావ్యంబైన మరాళదంపతి మహాోపన్యాస మెక్కించుమీ...

22

గిరిజా ప్రేమరసైక మోహన కళాకేళీ జగత్కీర్తి సుం
దర! కేయూర మయూర నాట్యరమణీ దాక్షిణ్య ధారాధరా!
సరవిం నీ మెఱుపుల్ పగిల్చి యుఱుముల్ శంభోమహాదేవ! భీ
కర భీభత్స రసాలు లేప జగముల్ కంపించు కాపాడుమీ...

23

ఓ కోటీశ్వర! యో కుబేర ఘన శౌర్యోద్దండ వేదండ ధా
టీ కోటీర జటా పటీర వనవాటీ రాజరాజేశ్వరా!
మాకై నీవలె త్యాగరాజయిన సంపన్నుల్ మహాదేవశం
భో! కన్పించరు త్వద్వినం త్రిభువనంబుల్ నేఁడు కాపాడుమీ...

24

విలసత్కీర్తి సహస్రకోటి భువనప్రీతి ప్రఫుల్లేందు మా
ళి! లసద్వజ్ర సరోవర ప్రణయకేళీహంసరాట్పాలి త
జ్జలజాతాసన ముఖ్యదైవములకుం శంభోమహాదేవ! కే
వల మనోన్నదకముల్ భవత్పద సమీపంబందునే బ్రోచుమీ...

25

ఓ బాలేందుకళా కుతూహల బలా! యోనీల విద్యుద్గళా!
మా బాసల్ పలికించుచుండెడి పసల్ మా దిక్కు మ్రొక్కుల్ నోసల్
నీ బంగారు వరాలచేతి చలువల్ నిచ్చల్ మహాదేవ శం
భో! బస్తాలకుఁగొల్చు భక్తి కిరణమ్ముల్ మొల్చె కాపాడుమీ...

26

వృషభేంద్ర ప్రభు కేంద్ర సంస్తవ కవీడ్వేలా విలాసైక పౌ
రుషహేలా వృషవాహనా! ఫణఫణీ రుజ్మండనా! మాకథా
ఛషకంబుల్ మశకంబులైన కతనం శంభో మహాదేవ! ఆ
శిషముల్ కోసము మోరలెత్తితిమి త్వత్సేవాసుధల్ నింపుమీ...

27

ఓ విశ్వేశ్వర! యో మహాద్భుత కథా వ్యూహావళీ బ్రహ్మ వి
ద్యా వైదుష్య కళా త్రినేత్ర నవరత్న శ్రీతటిద్వీతి హో
త్రా! వైతాళికులైన యీ కవులనేత్రంబుల్ మహాదేవశం
భో! వైశాల్యములేక గాఢతిమిరంబుల్ సూపె కాపాడుమీ...

28

నీలగ్రీవ సునామధేయ! గిరిజా నీరాజనాహ్లాద గీ
తాలాంగూల విలాస గాంగ తటినీ ధౌరేయ! నీవింకమా
కోలాటంబులు నిచ్చు ముచ్చటలు గైకొన్నన్ మహాదేవశం
భో! లక్షల్వడి మాదు ముచ్చెమట లా వూటారు నోదార్చుమీ...

29

తుహినాద్రి ప్రభుపుత్రికా నవమణీ తూణీర దోర్వీర భూ
ర్వహ దుర్వారకళా మనోహరా! శరద్రాకేందు ధాత్రీశ్వరా!
సహనంబే దహనంబు కాఁబడుటచే శంభో మహాదేవ! మా
గ్రహచారంబులు పెన్విచారములుగా కాల్పట్టె కాపాడుమీ...

30

ఓ భిక్షాటనచక్రవర్తి! వినుమో యుద్రేక రౌద్రేభ సం
క్షోభాఖండల ఖాండవానల మహా క్షుద్రైక బీభత్సమూ
ర్తీ! భూఖండముపై దరిద్రులయి లేరే శ్రీమహాదేవశం
భో! భస్మాసుర సార్వభౌములును కల్ముల్లేక? పోషించుమీ...

31

ఓ తారుణ్య కథా సుధా శశిధరా! ఓ శాకినీ ఢాకినీ
భూతప్రేత పిశాచ భీకర ధరా భోగీంద్ర సంస్థాన ఖ
ద్యోతాఖండల కీర్తిమండల హరా! దుష్టుల్ మహాదేవశం
భో! తల్లత్స్యములేక ప్రేలుదు రవేమో చూచి కాపాడుమీ...

32

ఓ త్రైలోక్య దరిద్రపీడిత వికారోన్మాద బాధా కథా
క్షేత్రాలోకన ఫాలనేత్ర శుచిరాశీ! యో శ్మశానస్థలీ
చిత్రప్రాభవ దివ్యదర్శి! మము పోషించం మహాదేవశం
భో! త్రాణమ్మికలేక ప్రేలె తలలెన్నో పీకడన్: చూడుమీ...

33

రజతగ్రావ సువర్ణరత్న ఖచిత ప్రాకార సింహాసనా !
గజరాట్ ప్రేమసుఖైక సుందరకళా కల్లోలినీ మోహనా !
స్వజనుల్ జ్ఞానధనుల్ వలెం పెరుగుచో శంభోమహాదేవ ! ది
గ్విజయ ప్రాప్తిగ రాజు భేరినిల మ్రోగించుంజుమీ సాకుమీ...

34

త్రిజగన్మోహన కాంతి కోమల కళా దేదీప్య దివ్య స్వరూ
ప ! జటాజూట మహాటవీ ఘనఝరీ బ్రహ్మాండ సౌందర్య ఘో
ష జయధ్యాన శిరీష మంజుల కృపా ! శంభోమహాదేవ ! పం
కజనేత్రుండు రమావిభుండయిన త్వత్ఖ్యాతిం కనంజాలుమీ...

35

ఓ నాగేశ్వర ! ఓ మహాభువన కావ్యోద్యాన సంతాన భా
షా నవ్యోదయ సుందరీ మధుకరీ సంగీత రత్నాకరా !
యేనాఁడైనను నీశ్వరేశ్వరుఁడ వీవేగా ! మహాదేవశం
భో ! నీకన్నను కన్నతండ్రి యెవరబ్ధుల్ దాటినం; గాచుమీ...

36

ఓ కారుణ్య మహా గభీర జలధీ ! ఓదివ్య చారిత్ర్య గం
గా కల్లోల సహస్రకోమల తరంగ క్షీరవారాన్నిధీ !
యీ కౌటిల్య మనోవికార ఖలు లేమేమో మహాదేవశం
భో! కాఱుల్ తెగఁ బ్రేలి దూకెదరు: దుర్బుద్ధుల్ నివారించుమీ...

37

ఓ దుర్గా కమనీయ దివ్యనిలయా! ఓ విశ్వ కాదంబినీ
వేదోద్యాన తటిన్నటీ సుమవటీ ప్రేమామృతాస్వాద దీ
క్షా దాక్షాయణి పూజనీయ! విను మా స్వామీ! మహాదేవశం
భో! దాక్షిణ్యమునీకు నాణ్యమయి యబ్ధుల్ పొంగ మమ్మేలుమీ...

38

అవనీఖండ నిశీధినీ గరళకంఠా! సర్వసర్వంసహా
స్తవనీయామృత భావ శోభిత శిరోధార్య ప్రశంసామణీ
చ్యవనాచార్య జిగీషు ఘంట! భువిపై శంభోమహాదేవ! మా
భవముల్ తావక మాధురీ చరణ సేవల్ సేయ పండించుమీ...

39

నిఖిలైశ్వర్య కళానికేతన మహానిర్లిప్త నిర్మోహ చి
త్త! ఖరాఖండల ఖడ్గకోటి నిశితాస్త్ర శ్రీధరా శస్త్రహ
స్త! ఖలుల్, ఘోర రుజారిపుల్ యమభటుల్ శంభోమహాదేవ! త్వ
న్నఖ సంస్పర్శకు తున్గినుత్తునియ లైనారొప్పు; మమ్మేలుమీ...

40

ఓ దాక్షిణ్య సుధాబ్ధి! ఓ నిగమ కార్యోల్లాస యోగీంద్ర భా
వోదారైక వివేక లబ్ధి! ధరలెన్నో యేమిటో నీ దయా
వైదుష్యమ్ము ఖరీదుకట్టి పెను లాభంబుల్ మహాదేవశం
భో! దోచం బరవళ్ళుపెట్టిరవి; లుబ్ధుల్ బుద్ధులీక్షించుమీ...

41

ఓ శ్రీశైల కళామహోజ్వల పరంజ్యోతి ప్రభాఖండల
శ్రీ శ్రేయోఽమృతమూర్తి ! ఓ భువన కాశీదక్షిణామూర్తి ! నీ
వే శ్రోత్రమ్ములునున్న దేవుఁడవు మాకింకం మహాదేవశం
భో ! శ్రోతల్ మఱియేరి నీ పగిది మా మొఱ్ఱల్ వినం? బ్రోచుమీ...

42

ఓ సుశ్లోక శిరీషపేశల కళాన్యోన్య ప్రసన్నాత్మ ! యో
వ్యాసారాధ్య సుహృద్య పద్య సుమ రమ్యాలోక సాన్నిధ్య వి
ద్యా సౌధాంతర సౌఖ్యమందిర మహాత్మా ! శ్రీ మహాదేవశం
భో ! సంతుష్టిగ నిన్నెటుల్తనిపి మా మ్రొక్కుల్ నివేదింతుమే !...

43

ఓ గౌరీపతి ! ఓ మహాపశుపతీ ! ఓ రాగ భోగీంద్ర గం
గా గీర్వాణ తరంగ సంయుత మృదంగధ్వాన సంధాన భా
షా గంభీర శుభాకృతీ ! శరణు మాస్వామీ ! మహాదేవశం
భో ! గర్వించి మదించి చించుకొని గొంతుల్ పోదు మోవార్చుమీ !

44

ఓ కాళేశ్వర ! ఓ మహావిజయకార్యోత్సాహ సన్నాహ శౌ
ర్యా కర్ణాంత ధనుర్బలైక ఘన శస్త్రాచార్య లోకేశ్వరా !
మా కీవేగద నాయకుండవు మహాత్మా ! శ్రీమహాదేవశం
భో! కవ్వించెడి వైరులం దునిమి మా మ్రొక్కుల్ కటాక్షింపుమీ...

45
పరమాహ్లాద త్రిలోకకీర్తి నికషాభ్ర స్రోతసీ పద్మ స
ద్మ రసావేశ కథా సుధాకర కళా మౌళీశ్వరా! మాధురీ
స్వర పాథోధి మహేశ్వరా! నిరతముం శంభోమహాదేవ! త్వ
చ్చరణాంభోజము లీవు మచ్ఛిరముపై జాచం గటాక్షించుమీ...

46
గురుమూర్తీ! భువనైక మోహన కళా కోటీర మాణిక్య సుం
దర బృందావన కల్పవృక్ష సుమకన్యా దక్షిణామూర్తి! త్వ
చ్చరణమ్ముల్ తలదాల్చు కింకరుఁడనై శంభోమహాదేవ! మా
దోర! మోతుం, నిను గారి శంకరుని జేతుం మమ్ము కాపాడుమీ...

47
కమనీయాచల కార్ముకాంచల కళా కాత్యాయనీ కౌశలా!
రమణీయాంకుర భావరమ్య రమణీ రాకామణీ మేఖలా!
సమశీతోష్ణ దయాపయోధివి మముం శంభోమహాదేవ! కా
వుము, దీర్ఘాయువులెల్ల పోయుము రణవ్యూహమ్ము లందీయుమీ...

48
వనజాతాసన వజ్రసౌధ మహిళా వ్యాఖ్యాన సౌఖ్యా ధునా
తన మంజూషిక! మూషికాది వృష సౌందర్యాను రాగైక భూ
షన లంబోదర సత్కృపాజనక! శ్రీ శంభో మహాదేవ! నం
దనులన్ నీవలెఁ గాచువాఁడెవఁడు మాతండ్రీ! కటాక్షించుమీ...

49
ఓ లింగేశ్వర ! ఓ కళాత్రిభువ నార్యోత్సాహ భృంగీశ్వరా !
ఓ శేఖర్షభ సార్వభౌమ నగరీ యోషామణీ ధ్యానకే
ళీ లీలాపరమేశ్వరా ! వరము లీలీలం మహాదేవశం
భో ! లక్షల్ కొలిపించుచున్నను జయంబుల్ మాకు దక్కించుమీ...

50

జయభేరీ విజయధ్వని ప్రణవ భాస్వద్రూప రేఖా మహో
దయ! తారుణ్య కృపాభిషేక ఘన సంస్థానైక దాక్షిణ్య ని
శ్చయ! నీ యట్టిడు తండ్రియుండిన కవిం శంభో మహాదేవ! యె
మ్మెయినైనం గెలువంగలే రెవరు స్వామీ! మమ్ము కాపాడుమీ...

51

త్రిదశారాధ్య! మహామహీ మసృణ గౌరీ దివ్య సమ్మోహ నా
స్త్ర దశాఖండల శాస్త్ర వేద్య! నవనీత శ్రేయసీ విశ్వ భా
ష్య దిగంతైక విశాలహృద్య! వినుమీ శంభోమహాదేవ! పెన్
రొదతో వీనులెడంద రాపిడులు మార్మ్రోగించె మమ్మేలుమీ...

52

మృదుమాధుర్య రసాలసాల ఫలరాశీ! దివ్య చాతుర్య ధీ
విదుషీమండల శేముషీ! భువన తన్వీకోటి మాణిక్య స
స్య దశానంత సదస్య సంతత శశీ! శంభోమహాదేవ! మా
పదవుల్, మా చదువుల్ మఱెట్టికొదవల్ పాల్సేయ కోదార్చుమీ...

53

శర్వాణీ నవకోమలామృత మన స్సౌందర్య కావ్యేందిరా
గర్వోత్సాహ గభీర నిర్ఝరబలా! కాత్యాయనీ మాధురీ
సర్వైశ్వర్య విపంచికా స్వరగళా! శంభోమహాదేవ! మా
గీర్వాణంబులవేవి సాగవు కళా కేళిం కటాక్షించుమీ

54

ఓ సర్వేశ్వర ఓ శుభైక ధరణీ యోధాగ్రణీ స్వర్ణకై
లాసగ్రావ గణేశ్వరా! త్రిభువ నోల్లాసంబు లెన్నెన్నియో
నీ సాన్నిధ్యమునందు పొంగులయి పొంగెం శ్రీమహాదేవశం
భో! సిగ్గేమియులేని యీ పరమ లుబ్ధుల్ పంచ మేమొల్లమే...

55

గౌరీశంకర రమ్య హార్మ్య శిఖరాగ్ర ప్రేమ సుస్నిగ్ధ శృం
గారోద్యాన కళామణీ నవఘృణీ కాత్యాయనీ మండనా!
నీరాగ్రేసర కోటి సూర్య నయనా! ప్రీతిం మహాదేవశం
భో! రేయింపవ నీవు, నీ సతియు మా మ్రొక్కుల్ కటాక్షించుమీ...

56

ఓ మాణిక్య కిరీటధారణ ధవా! ఓ భావ సౌదామినీ
ప్రేమాంభోధి కళా మహాలయ శివా! విన్నాణమై విశ్వ వీ
ణా మాధుర్య కథా సుధారస తరంగమ్మై మహాదేవశ
భో! మా రాగకిశోరి తావకపదమ్ముల్ పట్టెఁ గాపాడుమీ...

57

ఓ భీమేశ్వర ! ఓ కళాంబుధి తరంగోత్సాహ సంభార భా
షా భాండార ప్రబంధ బంధుర కథా సౌధాంతరాశీన వి
ద్యా భాగ్యాంక రుమామహేశ్వరా! శ్రవణ సౌఖ్యంబుల్ మహాదేవశం
భో! భాస్వద్భవదీయ దివ్యచరితంబుల్ మాకు బోధించుమీ...

58

ఓ రాజేశ్వర! ఓ విశాల విలసద్వ్యోమాపగా కోటి శృం
గారాంభోరుహ నేత్ర శ్రోత్ర నవరత్నచ్ఛాయ కోటీశ్వరా!
యేరీ నీవలె చక్కనయ్యలు? మఱే యింటం మహాదేవశం
భో! రేచిక్క మొగాలుదక్క కనమే; పోషించి మమ్మేలుమీ...

59

ఓ కామేశ్వర! ఓ సుఖైక శుభ కార్యోత్సాహ రామేశ్వరా!
ఓ కళ్యాణ శతావధాన కవితా యోషా మనీషా కథా
లోకారాధ్య ఋషీశ్వరా! పసిఁడి కల్మల్ మహాదేవశం
భో! కాల్పించెడి నీ శరాబుల ఖరాబుల్సేయకోదార్చుమీ...

60

ఓ త్రైలోక్య మహేశ! ఓ త్రిపుర దైత్యోన్మత్త గ్రావాంకుశా!
ఓ త్రైవిష్టప వజ్రనిర్ఝర గభీరోగ్ర ప్రభావైక స
త్త్రాతానీక నిరంకుశా! శరణు మాస్వామీ! మహాదేవశం
భో! త్రేతాయుగ చక్రవర్తియు నినుం పూజించె నమ్మేలుమీ...

61

ఓ శ్రీకంఠ కళాప్రసన్న మృదు శబ్దోచ్ఛ్రశవోచ్చారణా!
ఓ శ్రేయోన్నత వజ్రశైల శిఖరారోద్వేగ విధ్వంసనా!
అశ్రాంతంబిక నీవు మా హృదయ శయ్యం మహాదేవశం
భో! శ్రీ చుంచుగ విశ్రమించుచు శుభంబుల్ మాకు దక్కించుమీ...

62

ఓ కల్యాణ త్రిశూలపాణి ధరణీ యోధాగ్రణీ! ఓ మహా
లోకైక ప్రతిభా విశేష శుచిరా లోకానన శ్రీ జయ
శ్రీ కోలాహల పావనీ! శరణు కాశీ శ్రీమహాదేవశం
భో! కారుణ్య పయోధివీవు విజయంబుల్ మాకు దక్కించుమీ...

63

ఓ కాశీపతి! ఓ కృపారస ధునీ వ్యూహైక వాచస్పతీ!
ఓ కోదండ భుజా ప్రజా ప్రభృతి యుద్ధోద్రేక భద్రేభ యూ
థా కీర్త్యార్ణవ చక్రవర్తి! భవదర్థంబుల్ మహాదేవశం
భో! కీర్త్యాయువులై, మహాధనములై పోషించె మమ్మేలుమీ...

64

ఓ జ్ఞానేశ్వర! యో ప్రజావిజయ శౌర్యోర్వీశ్వరా! యోమహా
ప్రజ్ఞాచార్య శిరీషకోమల కళా రాజీవ సౌదామినీ
జిజ్ఞాసైక మహాకవీశ్వర! జయ శ్రీలన్ మహాదేవశం
భో! జ్ఞానామృత బిక్ష మా కిడుచు మా ప్రొక్కుల్ కటాక్షించుమీ

65

ఆనందోదయ భాగ్యవైభవ జగద్వ్యాప్త స్వరూపాయ వి
ద్యా నైపుణ్య నమశ్శివాయ గిరిజా తారుణ్య దాక్షిణ్య ల
క్ష్మీ నిర్నిద్రకళా సముద్ర ఘన వాగ్గేయా! మహాదేవశం
భో! నీకంటె నెవండు సద్రసికుఁ డంభోజాప్తుఁ డగ్గింపగాన్ ...

66

సుబ్రహ్మణ్యకుమార శౌర్యరస సుశ్లోక స్వరూపాయ ల
క్ష్మీ బ్రాహ్మీగిరిజా ప్రసన్నమురళీ గీతాంజలి స్నిగ్ధగే
యా! బ్రహ్మాదులునైతె మెల్లపుడు నీ యండం మహాదేవశం
భో! బ్రహ్మాండముగా ప్రశంస కలశాంభోరాశి పొంగించరే!...

67

గంగా నిర్ఝరిణీ ప్రఫుల్లసుమ శృంగారేందు చూడామణీ!
రంగత్కీర్తి కిరీట వజ్ర విలస ద్రాజీవ భాస్వద్ఘృణీ!
సాంగోపాంగముగా భవత్స్మృతి శృతుల్ శంభోమహాదేవ! సా
రంగమ్ముల్‌వలె చెంగుచెంగున యశోరాశుల్ వెలింగించవే!

68

ఓంకారామృత నాదబిందు కవితా ఘోషా మనీషా! జిగీ
షాంకచ్ఛాయ చికీర్ష కోటి రణ విద్యాంభోధి ధాటీ ధను
ష్టంకార ప్రతిశబ్ద దుందుభి వృషా! శంభోమహాదేవ! ని
శ్శంకన్ నీ పద పంకజమ్ముపయి విశ్వాలన్ని రాజిల్లవే! ...

69

తేజోరాశి ఖరాసి భీషణ మహా దివ్య త్రిశూలాయుధా!
రాజోత్తంస విరాజహంస వన శర్వాణీ మనోజ్ఞాభిదా!
మా జోహారులు, మా ప్రసూన లతికా మాలల్ మహాదేవశం
భో! జంటీగలు మాడ్కి నీ మధు కథాంభోజాలలో రేగవే!

70

శ్రీగౌరీ శివ సార్వభౌమ ! శుభ రాశి శ్రీ భుజస్కంధమా !
త్యాగావిర్భవ మోక్షరాజ్య రమణీ దాక్షాయణీ బంధమా !
నీ గానామృత పాన మత్త మధు వాణిం శ్రీ మహాదేవశం
భో ! గో బ్రాహ్మణ విశ్వనందన వనంబుల్ మధ్య పాడించమే ! ...

71

నాదోపాసక ! శైలరాజతనయా నైర్మల్య సౌశీల్య సు
శ్రీదివ్యామృత జాహ్నవీ కవన లక్ష్మీభంగిమోద్ధారకా !
నీ దాక్షిణ్యముఁజేసి మోళ్లు చిగిరించెం శ్రీమహాదేవ శం
భో! దిక్కేమియులేని త్రాళ్లు నిలువేల్పుల్ కొల్పులార్జించవే!...

72

గౌరీ పల్లవపాణి భాగ్య సుమ శృంగారోత్సవ శ్రీకళా
ధారేయా! శతకోటి దివ్య ధరణీ ధర్మ స్వరూపాయ వి
ద్యా రాకేందు యశోవిశాల నిలయా! ధాతల్ మహాదేవశం
భో! రాజిల్లెడి నీదు పాద నవ సంఫుల్లాబ్జముల్ మ్రొక్కరే!...

73

ఆశీర్వాద జగద్ధితైక ఘన దుగ్ధాంభోధి శుంభన్మణీ
రాశీభూత లసద్ఘృణీ నవ నవ ప్రాచీతటి ద్వారగా
నీ శృంగార దివాకరా! స్మర హరా! జీవుల్ మహాదేవశం
భో! శైరీషకళా ప్రఫుల్ల కుసుమంబుల్ నిన్ను మోహించవే!

74

మార్కండేయ మహా తపోవన నభోమార్తాండ! మాణిక్య సో
మార్క ప్రౌఢ కళాలలాట విలసద్ధర్యత్న కోదండ! మా
సర్కల్, మా ఘన సభ్యతా మకుటముల్ శంభోమహాదేవ! పెన్
తర్కంబుల్ ఘటియించి నిన్ను గడియింపంజూపెసంపర్కముల్ ...

75

నీహారాద్రి సువర్ణ రత్నతనయా నీలోత్పల శ్రీకళా
మోహావేశ విపంచికాస్వర సుఖామోద ప్రసూనాలయా!
సౌహార్ద్రైక రసావతార సుమణిచ్ఛాయా! మహాదేవశం
భో! హేమాద్రి ధనుర్విజృంభణఘనాంభోధుల్ వినుంగొల్వవే!

76

భావాంభోధి మహాగభీర ఘన శబ్దగ్రీవ హాలాహలా!
దేవేంద్రాది సుపర్వకోటి నవ కీర్తి స్తోత్రి కోలాహలా!
నీవే దిక్కులకెల్ల దిక్కయితి తండ్రీ! శ్రీమహాదేవశం
భో! విశ్రాంతికి నీను మా హృదయ సంఫుల్లాబ్జముల్ విచ్చవే!

77

భువనైశ్వర్య మహా సుఖైక కలశాంభోరాశి! త్రైలోక్య న
వ్య వివేకోదయ భాంతీ మధు మధు వ్యాసంగ సంగీత భా
ష్య వచో వైభవ రాగభోగ సగసీ! శంభోమహాదేవ! నీ
ధవళచ్ఛాయకు మా నిరంకుశ నిశీథంబుల్ పటాపంచలా...

78

అమృతాంశు ప్రణయైక మోహన కళావ్యామోహా! శృంగారభం
గిమ విద్యా రమణీ మయూర జననీ కేయూర మాణిక్య పిం
ఛ మరీచి ప్రతిభా ఘృతాచి నివహా! శంభోమహాదేవ! సౌ
ఖ్యము నీకంటె మఱే మహామహుఁడు విఖ్యాతిం ప్రసాదించునే...

79

సకలోర్వీ మద గర్వ ధూర్త జన శిక్షాదక్షకేళీ భయా
నక రౌద్రాంబుధి వీరభద్ర తనయానందస్వరూపా! సమ
స్తకళాత్మా తరుణీమణీ మృదు కృపా! శంభోమహాదేవ! తా
వక దేవాపగ లేపి మా కలుషముల్ ప్రక్షాళనల్ సేయవే...

80

ఇభరాట్ శ్రీ శుకరాట్కథా నగధిరాట్ హేలాతురాషాట్ కవీ
ద్విభురాట్ సంస్తవ సర్వమంగళ కళా వేదాంతవేద్యా! విశే
ష భుజంగాభరణైక సాధ్యా! నిను శ్రీ శంభోమహాదేవ! కో
రి భజింతుం మఱి మాకు స్వామివని గర్వింతుం కటాక్షించుమీ...

81

నవమాణిక్య గిరీంద్రసంస్తవ రవీంద్రస్వామి! మందారప
ల్లవ బృందార రసాల సాల మధుశాల శ్రీ శికస్వామి! వా
స్తవ భక్తిం భవదీయ దివ్య పదముల్ శంభోమహాదేవ! శ
బ్ద విధాతృండయి గొల్చినం శతశతాబ్దంబుల్ కళల్ చాలవే...

82

సుకుమార ప్రభుపీర ధీర శుభ సుశ్లోక ప్రసన్నాత్మ! శ్రీ
శుక యోగీంద్ర మహా తపోధన కళాసుస్నిగ్ధ శుభ్రాంశు వ
జ్ర కథా కల్పలతా మహాత్మ! వినవా శంభోమహాదేవ! మా
కకుబంతంబులు మారుమ్రోగెడి జగద్గాథల్ వినోదార్థముల్...

83

ధనగంధర్వ పురీ పురందర సఖా! దాక్షిణ్య తాత్పర్య ది
వ్యనదీ కావ్య కథా సుధారస తరంగాంభోధి గంభీర ని
స్వన దంభోళి శరధ్వని ప్రముఖ! శ్రీ శంభో మహాదేవ! న
వ్వినచో ఘనకన నీవు వేయి పడగల్ విప్పున్ కళావిశ్వముల్...

84

జన కోలాహల దివ్యభవ్య కవితా సంగీతలీనా! జగ
జ్జననీ మంజులపాణి పల్లవ కళా సౌందర్య మాధుర్య సూ
చన! మందార ఫలైక సౌఖ్యరసనా! శంభో మహాదేవ! ని
న్ననయంబుం మెడఁగట్టుకొంటిమిఁక కుయ్యాలించి మమ్మేలుమీ...

85

అమృతానంద విభూ! దిగంత శుభకార్య శ్రీ భవానీ ప్రభూ!
సుమకన్యా కమనీయ గేయమురళీ సుస్నిగ్ధ శృంగార వి
శ్వమరీచి స్వభు! సర్వమంగళవిభూ! శంభో మహాదేవ! మా
శ్రమజీవుల్ మొఱవిన్మ నీ మధుర సాక్షాత్కార భాగ్యమ్ముతోన్...

86

అసమాన ప్రతిభా ప్రభావ! లసమానానందలక్ష్మీ కళా
కుసుమాశీర్వచనాత్మరాత్మయ శివా! గోబ్రాహ్మణాచార వి
శ్వ సమాచార సుఖ ప్రదైక భవ! శ్రీ శంభో మహాదేవ! మా
యసువుల్ మా కసవుల్ త్వదీయ శుభ విద్యాంభోజముల్ పట్టవే...

87

విజయశ్రీ తరుణీలలామ ధరణీ వేలా విలాసైక సౌ
ఖ్య జిగీషాలయ చంద్రమౌళి! యుదయశ్రీ కళారామ వి
శ్వ జయధ్యాన కథావిధాన పటలీ! శంభోమహాదేవ! నీ
భుజశక్తిం కడు నమ్మిచేసితిమి స్వాముల్ పై భుజాస్ఫాలనల్...

88

జయ సంధాన కథా ప్రధాన విజయా! శౌర్యేందిరా దివ్య భ
వ్య యుగైశ్వర్య మహా ప్రకాశనిలయా! బ్రహ్మాండ కర్తృత్వ ని
శ్చయ వక్తృత్వ సుధా ప్రవాహ హృదయా! శంభోమహాదేవ! వి
శ్వ యశశ్చంద్రిక ముద్రణాలయము నీ శైలమ్ము మమ్మేలుమీ...

89

ఫల సుస్నిగ్ధ రసాలసాల మృదు కావ్య శ్రీ రసాస్థాన మం
జుల బృందారక చక్రవర్తి! విలస జ్జ్యోత్స్నా లసత్స్రోతసీ
జల మాణిక్య తుషార హార నృపతీ! శంభోమహాదేవ! మా
తలపుల్, మా పిలుపుల్ త్వదీయ శ్రవణద్వారమ్ములో దూరనీ...

90

అఘమాలిన్య సహస్ర పంకిల జగద్వ్యామోహ ప్రక్షాళనా!
రఘువంశార్ణవ చక్రవర్తి నవ సామ్రాజ్యోత్సవ శ్రీ విలా
స ఘుటాశ్వాస తురంగ రంగ చరణా! శంభోమహాదేవ! మా
లఘు జన్మంబు లవేమి లెక్క యిక నీ లక్ష్యంబులో బ్రోచుమీ...

91

నవ సౌందర్య కథా కలాప విభవా! నానా ప్రసూనాత్మ ప
ల్లవ సంగీత సుధారసైక ప్రభవా! లావణ్య సౌజన్య సం
స్తవశృంగార కళా ప్రఫుల్ల సుభవా! శంభోమహాదేవ! మా
కవనంబుల్ భువనంబులన్నిట వివేకశ్రీలకై విప్పుమీ...

92

క్రమసౌందర్య శరన్నిశీవన కళా కాంతారవాస ప్రియా!
సమరాత్మధరశౌర్య ధైర్య ఘన విశ్వాస ప్రతాపోదయా!
శ్రమతో మీ సములింత ద్రిప్పెడి దొరల్ శంభోమహాదేవ! మీ
సములౌచుం మెలివెట్టగా నలుగుచుం సంక్షోభముల్వెట్టరే...

93

చతురంభోధి పరీత విశ్రుత ధరా శౌర్యోత్సవ ప్రౌఢ ది
వ్య తుషారాద్రి రసప్రవాహ రమణీ ప్రాణేశ్వరా! కోటి వి
శ్వ తురాషాడ్వన దేవతా మధుకరా! శంభోమహాదేవ! మా
ప్రతిభాకౌశలమెంత పెద్ద గలభా పడ్డన్ దిగడ్డొడ్డునా...

94

మదనౌద్ధత్య మహా ప్రతాప ఘన సామర్థ్య ప్రజాభీల దు
ర్మద జాడ్య ప్రభవేంద్ర మౌఢ్య హరణా! ప్రాలేయ రుఙ్మండలీ
సదనానంద కళా ప్రభాత కిరణా! శంభోమహాదేవ! మా
రొద నీకెక్కెడిదాక మేము కవితా రోలంబముల్ రేపమే...

95

కవితాకల్ప మహీరుహ ప్రసవ భాగ్యశ్రీ కళామోద సౌ
ఖ్యవసంతా! మృదుశారికా శుకపిక ధ్యానామృతానంద వి
శ్వ విలాసైక జయంత! నా పాడి నుడుల్ శంభోమహాదేవ! నీ
చెవికెక్కించెడిలెక్క తాళపు చెవుల్ చేఁ జిక్కునట్లేలుమీ...

96

సంగీతామృత మేఘనందన కళా సౌదామిని శ్రీలతా
శృంగారోత్సవ పుష్పవృష్టి లహరీ! హేమంతగౌరీ పరి
ష్వంగ ప్రౌఢ సుఖ ప్రభూత నృహారీ! శంభోమహాదేవ! సా
ష్టాంగమ్ముల్వడి నిక్కొసంగినవి వేసంగుల్ నమస్కారముల్...

97

శాంతాకార శుభావతార త్రిజగచ్ఛౌర్యాబ్ధి ధిక్కార దు
ర్దాంత క్లేశ దిగంత దంతి ధరణీ ప్రాకారా! గౌరీమణీ
సంతోషాంతర కోటి సాగర ధరా! శంభోమహాదేవ! మా
గొంతుల్ బొంగురుపోయి నీకప శ్రుతుల్ కొల్పించ నట్లేలుమీ...

98

పాకారి ప్రముఖైక దివ్య జన కావ్యస్తోత్ర సత్పాత్ర! శ్రీ
రాకేందు ప్రతిభా ప్రసన్నముఖ సర్వజ్ఞాభి వైచిత్ర! పై
సాకై స్తోత్రముగాదు; నీ వొకఁడవే శంభోమహాదేవ! స్త్రీ
లోకమ్ముం దలఁదాల్చి చూపితివి మాలో స్త్రీ స్వతంత్ర ప్రథల్...

99

అవనీఖండ సమస్తసౌఖ్య శుభకల్యాణ క్రియాశౌర్య! సం
స్తవనీయార్ణవ కోటి సూర్య ప్రకరా! శంభోమహాదేవ! మా
కెవఁడున్నాఁడిఁక నిన్ను మించుటకు తండ్రీ! అర్ధనారీశ్వరుం
డవటంచుం దిశకెక్కితీ వొకఁడవే నవ్య ప్రపంచైక్యతన్...

100

నవరత్నచ్ఛాయ విశాల విశ్వనిలయా! సర్వోదయ శ్రీ విలా
స వికాస ప్రసవ ప్రశాంత హృదయా! శంభోమహాదేవ! వే
యి విధాలం దలిదండ్రివీవె యనువట్లే యర్ధనారీశ్వరుం
డవు, నీకంటె మహాత్ములుండిరిక? బిడ్డల్వడ్డ పాళ్లేలుమీ...

101

సౌందర్యంబులు, సర్వసంపదలు నీ సంస్థానమందెంతయో
విందుల్సేయఁగ నాదుకావ్యము సమర్పింపం గటాక్షించుమీ
సందర్భంబు సమస్తమీవుఁ గాని శ్రీ శంభోమహాదేవ! ని
ష్యంద ప్రేమ కథా సుధారస కళా చాతుర్య సంపత్తితోన్...

(శ్రీ) (శ్రీ) (శ్రీ) (శ్రీ) (శ్రీ)

# విశ్వాసం

శ్రీ పాదపద్మాలు పాపా లను ఖలుండు
తిరుపతి వేంకటేశ్వరుని గనునె
ఆదిభట్లు గళమ్ము చేదన్న తలకట్లు
బాలబ్రహ్మ పదమ్ము పట్టుకొనునె
ద్వారం ఫిడేలు సైపని వెఱ్ఱి తోడేలు
మా మహావాది కమ్మదనమనునె
చినపీరు సన్నాయి వినలేని గన్నాయి
ఆదం ప్రసాదించు హాయిగొనునె

నగరి "ఇమిటేషనాచారి" నవ్వుల వర
హాలతోట చూడని మా మహామహులకు
ధరను వేదాంతకవి కవితాలతాంగి
మెచ్చుకొన్న కల్యాణిగా నచ్చుగలదె.

"ఆంధ్ర బెర్నార్డ్షా"
వేదాంతకవి